


ప్రథమ ముద్రణ : : సెప్టెంబరు, 65

సాదా ప్రతి : : రు [illegible]–00

మేలు ప్రతి : : రు [illegible]–00

ముద్రణ : : ఉజ్వల ప్రింటర్స్,
కర్నూలు.

'నవ్వీన పువ్వు' కథలోని

కుముదినికి అంకితం-

- రాఘవ

# ఇందులో

చి...కా...బు

నవ్విన పువ్వు

ఆమె మనసు

మా అమ్మగా ఏడవకూ!

తనలో తాను

జీర్ణగతుడు

ప్రాక్పశ్చిమాలు

ఉపప్లావి

పునర్జన్మ

సర్పదష్టులు

ధార్మిక

వరుణధార

ఈ సంపుటిలో కథలన్నీ లోగడ ఆంధ్రప్రభ, ఆంధ్ర పత్రిక, భారతి, చుక్కాని, హంస మొదలుగాగల పత్రికల్లో ప్రచురితమైనవి. ఆయా సంపాదకులకు రచయిత కృతజ్ఞుడు.

## చయితగా రాఘవ

ఇప్పటికి రెండు సంవత్సరాల క్రితం అనుకుంటాను- ఒక త్రుడు 'రాఘవ'ను పరిచయం చేశాడు. అప్పటినుండి మా రిచయం పెరిగి ఒకరి కష్టాసుఖాలు మరొకళ్ళకు చెప్పుకో లిగినంత దగ్గర వాళ్ల మయ్యాం—

ఆంధ్ర దేశంలో 'చింతపల్లిని' నాటక రచయితగా ఎరు చుదురు జనం- ముఖ్యంగా విషాద నాటకరచయితగా! అందుకే మా రాఘువ కూడా అప్పుడప్పుడు- 'ఈ వేళే ఓ నాటకం ర్తిచేశాను' అనగానే "ఎన్నో హత్య చేశావు" అంటాడు వ్వుతూ—

ముఖ్యంగా రాఘవకు నా జీవితంలోని మలుపులన్నీ తెలుసు. అప్పుడప్పుడు నా గమ్యానికి ఆయన సలహాలు కూడా ఉపయోగపెట్టుకుంటూంటాను- నేను.

అతను పెద్ద. వయస్సులోనూ, రచయితగానూ, ఆయన ఆంధ్ర దేశంలో ఎందరి కంటేనో చాలా పెద్దవాడు. రచయితగా అనేక సంవత్సరాలుగా మీా అందరికీ సుపరిచితు డైన రాఘువను ఈ నాడు రచయితగా కాదు సుమండీ— 'వ్యక్తి'గా మీాకు పరిచయం చెయ్యాలనిపించింది. ఆయన అను భవాలను, అనుభూతులను, ఉద్రేకాలను మీా ముందు పరిచి చూపించాలనే నా యీ తాపత్రయం.

రాఘువను చూడగానే అంత మంచి నవలాకారుడు, ఉత్తమ శ్లోకుడైన రచయిత 'రాఘువ' ఈయనేనా అనిపించి, ఆశ్చర్యాం వేస్తుంది. పల్చని పచ్చని విగ్రహం, పిడికట్టు బెంగాలీ లాల్చీ, చాలీ చాలని పొట్టి కళ్లజోడు [చిన్నప్పుడు

చదువుకునే రోజుల నాటిది] పంచెకట్టు, కొండొకచో లుంగీ కట్టు- చక్కటి విగ్రహానికి వ్యంగంగా గీచిన కార్టూనులా వుంటారాయన.

మా పరిచయమైన రోజులలో "నా పుస్తకాలేమైనా మీరు చదివారా?" అన్నాడు రాఘువ.

"లేదు" అన్నాను నేను.

"చదివి మీ అభిప్రాయం చెప్పండి!" అన్నారాయన.

తెలుగు సారస్వతంలో మంచి నవలలు రావడంలేదని విసుగుచెందిన నాకు రాఘువ రచనల్లో మంచి 'స్పార్క్' కని పించింది. అతని 'దిగంతాల కవతల', 'జనని', 'పరిమళించిన పున్నమి', 'త్రివేణి' వగైరా నవలలు చదివిన తరువాత, చక్కటి నవలలు వ్రాయగల దిట్ట 'రాఘువ'- అనే అభి ప్రాయం పాతుకపోయింది నాలో. కథ వ్రాయడంలోగానీ, నవల వ్రాయడంలోగానీ, ఉదాత్తమైన సన్నివేశాలు, అందమైన శైలి, గట్లు త్రెంచుకుని పోయే ప్రవాహంలాంటి తీవ్రభావన- చక్కని భాషా ఆయన కలంద్వారా కొట్టవచ్చి నట్లు కనిపిస్తాయి- ఆయన రచనలలో. ఎన్నుకొన్న యితి వృత్తంలోనూ, పదప్రయోగంలోనూ, ప్రత్యేక ఒడుపులున్న వాడు రాఘువ. పాఠకుణ్ణి తనతోపాటు 'దిగంతాల కవతలి'కి నడిపించుకు పోగల సాహసం వుంది ఆయనకు.

పున్నమి వెన్నెలకు పరిమళం పూసి, వాసన చూపించి, మెప్పించగల నేర్పావుంది. మమతలు పెంచి, మాతృత్వాన్ని ప్రసాదించి, పాఠకులకు జననిని చూపించగల తాహతూవుంది. అంచె లంచెలుగా పేరుకున్న చీకటిని మెట్లువేసి ఎక్కించి పతి తని తిమిర సాధానికి నడిపించుకుని, దిక్కుతోచని స్థితిలో

పెట్టి తాను తృప్తిగా నవ్వుకునే వ్యంగ్యమూ దాగివుంది ఆయనలో— ఆయన రచనలలో— భావనల్లో— ఊహల్లో...

చిన్మలు చిదపలుగా కురిసిన వర్ష బిందువులను ఒకటి చేసి, శిఖరాలమీద పోసి, సెలయేళ్ళు చేసి, సరాసరి పఠితృ హృదయాలలోకి ప్రవహింపచేసి, మెప్పించగల శక్తి సామర్థ్యాలూ వున్నాయి రాఘవలో— సౌరదీపికల్లాంటి చురుకైన, ముట్టుకుంటే కాలేంత వేడైన సెక్సును చెప్పగల ధైర్యం వుంది చలంలాగా— దిక్కుల మొదళ్ళను ఒకిసిపట్టి దోసిట్లో చూపించగల ధీమా, శక్తీ వుంది మామ్‌గాలా. సర్పదష్టులను చూపించి, సగం విరిగిన వీనస్‌ని చూపించి భయపెట్టి గుండెల్ని బిగబట్టేటంత భయాన్ని సృష్టించగల పదునూవుంది ఆయన కలంలో.

సామాజిక వ్యవస్థలో ఎత్తు పల్లాలను సరళంగా, వరుణ ధారలలో కురిపించగలడు; సరిచేయు గలడు. మానవాభ్యుదయానికి పున్నాగవరాలను ప్రసాదించగల మంచితనం వుంది; టాల్‌స్టాయ్‌లా; గోర్కీలా; ప్రేమ్‌చంద్‌లా; రాఘవకు.

పెరుగుతున్న మేరువులాంటి మేధస్సుకు తొలిదశలో వున్న రాఘవ మలిదశలోకి అడుగుపెడుతున్నాడు. ఎవరూ అడ్డు పడకండి. నలిగిపోతారు. అతని రచనా ప్రవాహంలో కొట్టుకు పోతారు ఆ మహా ప్రవాహాన్ని తెలుగు సాహిత్య మాగాణిలోకి ప్రవహింప చెయ్యండి. తెలుగు మానవ హృదయంలోకి యింకి పోనివ్వండి. మూడు పూవులు— ఆరు కాయలుగా అతనినుండి మహోదాత్తమైన నవలలు ఉద్భవించబోతున్నాయి. అదిగో! ఎప్పుడూ ఆలోచనల గొడుగు క్రింద, బరువెక్కి పోయిన రాఘవ కనుదోయి నా వైపు చూస్తున్న

ట్టుంది. నా కలం కదలడంలేదు— భయంతో, గౌరవంతో— ఇంత కంటే నేనేమీ పరిచయం చేయ్యలేను రాఘవను. అయినా మధ్యనే నెందుకు— అతని 'పున్నాగవరాళి', 'వరుణధార' మీ ముందున్నాయి. మీరే చదవండి శ్రద్ధగా రాఘవను. చక్కగా అర్థమై సులువుగా మీ మనస్సులకు చేరువై, నేస్తుడై పోతాడు మీకు సర్వదా!

అయితే ఒక సూచన:

నిమ్నోన్నతాలను ఒకేదృష్టిలో చూడగల సమరసభావం వుంటే, —పరిమళించిన పున్నమి పిసాళించే ఘమఘమలు ఆస్వాదించ గలిగితే, దిగజారిన వ్యక్తి బలహీనతలు మన్నించ గలిగితే— కూలిన శిఖరాల ఫెళఫెళా రావాలను మీ చెవులు విని సహించగలిగితే— సౌరదీపికల వేడిమికి తట్టుకోగలిగితే ఈ పేజీదాటి ప్రక్క పేజీలో విస్తృతంగా పరిచి వున్న రాఘవ గుండెపై అడుగు పెట్టండి. ఎక్కడైనా అడుగు జారిపడ్డా, ముందుకే నడవండి. కానీ, వెనుతిరిగి పుస్తకం మూసెయ్యకండి. చదవండి. మళ్లీ చదవండి. లెక్కలేనన్ని పర్యాయాలు చదవండి. రాఘవలో రాఘవను చూడండి.

సెలవు

మీ

విజయవాడ

ఆచార్య చింతపల్లి హనుమంతరావు

25—8—65

(నాటక రచయిత)

# చి... కౌ... బు

తద్ధర్మార్థకార్ధక్కాలంలో బయలు దేరారువాళ్ళయిదుగురూ!

పత్రికాదేవి— వులిక్కిపడి, "ఎవరూ! బయలు దేరింది" అన్నది.

సర్కస్ సింహాంలాగా గంతులువేస్తూ, అటూ యిటూ తిరిగే యీదురుగాలి వాళ్ళ వాసనని మెలుగ్గొడ్డులాగా పీల్చి,

"వస్తున్నారు! యిటే వస్తున్నారు." అంది భయ కంపిత స్వరంతో—

పత్రికాదేవి సరోజ నేత్రాలు, స్వాతి వానచినుకులకు నోళ్లు విప్పే ఆలుచిప్పల్లాగా సాగిలి విచ్చు కొన్నాయి. గుమ్మడి పూపుప్పొడి రంగువంటి నుదురుమీద, తామరాకు మీద నీటి బిందువుల్లాగా స్వేదబిందువులు ముత్యాల్లాగా మెరుస్తున్నాయి.

ఈదురు గాలి తడారిపోయిన గొంతుకతో—

"దగ్గర కొచ్చేసారు, జాగ్రత్త దేవీ!" అంటూ కిటికీ గుండా శూన్యంలోకి దూసుకు పోయింది.

పత్రికాదేవికి ఉత్తర ధృవంలో ఉన్నట్లనిపించింది.

నాసికారంధ్రాల గుండా, ఉష్ణ రక్త కాసారంలోంచి వచ్చే సెగల్లాంటి పొగలు, వుంగరాల మాదిరిగా తిరుగుతూ వస్తున్నాయి. అప్పటికి కాలం కందగడ్డలా తయారైంది. వాతావరణం అంతా వాతం కమ్మినట్లు బిగుసుకు పోయింది.

వీటన్నిటిని చీలుస్తూ వాళ్ళయిదుగురి వింత వింత నవ్వుల మాటల మరకలు కనిపించాయి. వాళ్ళ వేళాకోళాలు-వేషభాషలు చూస్తుంటే శోషొచ్చినట్లయింది పత్రికాదేవికి.

లేచి కిటికీ పరదా తప్పించి చూసింది.

వాళ్ళయిదుగురూ మెట్ల దగ్గర కొచ్చారు.

"ప్రచండ ఝంఝూ ప్రభంజనంలో యెగిరే గాలిపటం తనకన్నా బలం గలదని వూహించుకొంది"- పత్రికాదేవి ఆ సమయంలో.

కిటికీ దగ్గరనుండి వాకిట్లోకి రాగానే—

"వాళ్ళయిదుగురూ" పంచభూతాల్లాగా కనిపించారు.

దేవి ప్రశాంత వాతావరణం కోరుకొంటూనికి ప్రయత్నిస్తోంది. నయాగరా జలపాతంలో నాగమణులు మెరుస్తున్నాయి. జలియన్ వాలాబాగ్‌లో ఘోరకృత్యాలు, మరఫిరంగుల ధ్వనులు; హాలాహలంలో కోలాహలాలు- కేరింతలు- ప్రేయసీ విరహగీతాలాపనలు- రాజహంసల నడకల చప్పుడులు- అగ్నిపర్వతంలోనుంచి ప్రవహించే 'లావా' కుతకుత ప్రలాపాలు దేవిని అయోమయం చేస్తున్నాయి.

ఎలాగో జాగృతి దశలోకి హృదయాన్ని జారవిడిచింది, దేవి. కళ్లు వాళ్ళయిదుగురి శరీరాల్ని- మనస్సుల్ని గౌరవించి నయ్ వుచితాసనాన్ని చూపిస్తూ.

వాళ్ళయిదుగురూ కొండమీద కొక్కిరాయిల్లాగా కూర్చున్నారు దేవి కెదురుగా.

వలిగాలి తెరలకు వణికి రెపరెపలాడే లేత రావి ఆకు లాగా— దేవి అరుణాధరాలు కదుల్తున్నాయి.

'నిశ్శబ్దం' మంచుగడ్డలాగా పది నిముషాలు కరగకుండా వుంది.

ఎడమ వైపునుండి రెండో వ్యక్తిని దేవి పరకాయించి చూసింది.

సిల్కు లాల్చీ—, గ్లాస్కో పంచె—, కళ్లద్దాలు— కారా కిళ్లీకి మెరుపెక్కిన నల్ల పెదవులూ— బ్రైల్ క్రీం, ఆమ్లా— స్నో స్టిక్— తాతా ఆయిల్స్— రీటా— సీపా, కొబ్బరినూనె, బాయ్ సిల్ మొదలైన పేర్లు కవచం లాగా తొడుక్కున్న వాసననూ నెల రుచిచూడక, కుంకుడికాయ పులుసుతో సంతృప్తిపడే వుంగరాలజుట్టు, బెండకాయల్లాంటి చేతివ్రేళ్లు, వంకాయ తొడిమలాంటి ముక్కు, వ్రేళ్ళమధ్య "జీవితం కూడా యింతే"— అన్నట్లు తార్కాణంగా కాలే విదేశీయ సిగరెట్ దేవిని పల్కరించమని ప్రోత్సహించాయి.

గొంతు సరిజేసుకోబోతూ మిగతా నలుగుర్నీ చూచాయగా చూసింది.

ఎడమనుండి మొట్టమొదటి అతను జేబురుమాలుతో మొగం తుడుచుకొంటూ విలన్‌లాగా కనిపించాడు.

రుమాల్ మీద "పిస్తోల్" గుర్తువుంది.

దేవి గుండె గతుక్కుమని పిడచకట్టుకొని పోయింది.

అయిదో అతను గోడపు వ్రేలాడుతున్న పటంవంక

చూస్తూ పెదవులు కదుపుతూ— మధ్యమధ్య డైరీలో యేదో వ్రాస్తున్నాడు.

మూడో అతను దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు.

నాల్గో అతను టేబుల్ మీదవున్న తెల్లకాగితంమీద యేవో గీతలు గీస్తున్నాడు.

ఎవ్వరూ యేమీ మాట్లాడటం లేదు.

వాళ్ళ పేర్లేమిటో తెలుసుకోవాలను కొంది దేవి.

కుతూహలం ఎవరెస్టు శిఖరం లాగుంది.

ఉత్సాహం సాగర తరంగాల్లాగా యెగురుతోంది.

ఇంతలో అయిదో అతను నిల్చున్నాడు.

దేవికి టి. బి. పేషెంట్ గుర్తువచ్చాడు.

"వ్రాసినంత వరకూ చదువుతా" అన్నాడు అందరి వంకా చూసి— ఎవ్వరూ జవాబివ్వలేదు.

దేవి మాత్రం చూస్తోంది అతని వాలకం.

అతను మొదలెట్టాడు— సిగరెట్ ముట్టించి—

"పిగిలి—రగిలి
నలిగి—తొలిగి,
నీల్గి—మూల్గి
పెగ పెగసిన హృద్వీథిలో
అరుణారుణ జయపతాక
కిరణాలను చిమ్మింది—
కాగితాల మడతలలో
కీచురాళ్ళ కలవరింత—
సిల్కుచీర కౌగిళిలో

వృక్కాలాల సలపరింత—
దిగజారిన వక్షోజమ్ముల నీడలలో—
పొగజూరిన కామోద్రేకపు మేడలలో—
నాణ్యం తిరుగాడుతోంది
ప్రావీణ్యం పొర్లాడుతోంది—
అంత్యం లేనిది గమ్యం—
సాంగత్యం లేని దగమ్యం—
రచన: "రుధిరోద్గారి"

అని చదివి వ్రేళ్ళమధ్య ఆరిపోయిన సిగరెట్టుని చూసి నిర్వేదించాడు.

దేవి హృదయంలో యీ రచన ఎగుడు దిగుడుగా పడుకొంది. మొదటతను "ఫిస్తోల్" గుర్తు జేబురుమాల టేబిల్ మీద వుంచుతూ, కుర్చీలోంచి క్రిందకు వంగాడు.

దేవి అతన్ని చూసింది. అతను సిగరెట్ కొడిని చేతిలోకి భద్రంగా తీసుకొని, దేవికి చూపిస్తూ—

"బ్రతికి సాధించలేని ముక్తి చచ్చి సాధించింది" అన్నాడు. నాల్గో అతను అందుకొంటూ—

"ఫిస్తోల్ శర్మగారూ! అలా అనకండి" అన్నాడు.

ఫిస్తోల్ శర్మ, "యేమిటీ!" అన్నట్లు బాయినెట్ లాగా మొగం పెట్టాడు. దేవికి నవ్వొచ్చింది.

ఫిస్తోల్ శర్మకు ఆ నవ్వు చూడంగానే తల తీసేసినట్లనిపించింది.

"శాస్త్రిగారూ!" అన్నాడు.

"నన్నెన్నుశాస్త్రి", ప్రక్కనే కూర్చొన్న "ఫ్లాష్

రావు"ని పరిచయం చేస్తూ— "శ్రీ"గారికి ఆ మాటలు కూర్చొని వినిపించాడు. 'రుధిరోద్గారి' "ఏమిటీ!" అన్నట్లు కొండశిలువలాగా నోరు తెరిచాడు.

"మిట్టమధ్యాహ్న శ్రీ" రుధిరోద్గారి ఆదుర్దా గ్రహించిన వాడై:

"మిత్రులు— సహృదయులు అయిన ఫిస్తోల్ శర్మగారు ఒక క్షుద్రమైన విషయాన్ని, అపరాధ పరిశోధకుడిలాగా పరిశీలించి ఒక చక్కని మాటన్నారు. దానిలో సస్పెన్సు శాస్త్రిగార్కి నచ్చిన విషయం దాగివుంది. అట్టి దానికి ప్లాట్ రావుగారు తన మేధాసంపత్తి సామగ్రితో వన్నెచిన్నెలు కూర్చే ప్రయత్నాలు జరగబోతున్నాయి." అని యింకా చెప్పబోతూండగా, రుధిరోద్గారి "అన్న మాట్లేమిటీ?" అన్నాడు తిమింగలం లాగా—

"బ్రతికి సాధించలేని ముక్తి చచ్చి సాధించింది"... అని "చివర ప్రాసభాగం నీ కొదిలారు." నసిగాడు మిట్టమధ్యాహ్న శ్రీ.

రుధిరోద్గారికి సాగర మథనంలోనుంచి చందనం పూసుకొన్నట్లయింది.

అష్టదిక్పాలుర్ని ఆరాధించాడు.

యీ క్రింది విధంగా పూర్తి చేశాడు చివరకు.

"బ్రతికి సాధించలేని ముక్తి చచ్చి సాధించింది రక్తి"— అని చెప్తూతూ— "ఇంతకీ ఫిస్తోల్ శర్మగారికి యెలా వుంటుందో యీ ప్రాస సొగసు" అన్నాడు రుధిరోద్గారి.

వాళ్లూ— వాళ్లూ పిల్చుకునే ధోరణిలో డొల్లిన

మాటల్నిబట్టి, వారివున్న సాంకేతిక నామాలేమిటో దేవి అర్థం చేసుకొంది.

ఒక్కసారి తనలో తాను వాక్చిత్రం చదువుకొంది.

"ఫిస్తోల్ శర్మ"— "మిట్టమధ్యాహ్నశ్రీ"— "ఘాటు రావు"— "సస్పెన్సుశాస్త్రి"— "రుధిరోద్గారి"—

దేవి గుండె ముసిముసి నవ్వులు నవ్వుకొంది.

రాల్చిన సిగరెట్ కొడిని గురించి బయలుదేరిన ధర్మ సందేహాల్లో వాళ్ళవాళ్ళ మనస్తత్వాలు యెలాంటివో గ్రహించుకో గలిగింది దేవి.

ఇంతలో పత్రికాదేవి టేబుల్ మీద టెలిఫోన్ మ్రోగింది. దేవి చెవి దగ్గర పెట్టుకొంది.ఎవరో యేమో అడిగి వస్తున్నారు.

"త్వరగా రావాలి"— దేవి జవాబిచ్చింది. సస్పెన్సు శాస్త్రి యీ సమయంలో దేవిని మాట్లాడిద్దామను కున్నాడు.

"వస్తానన్నారా!" అన్నాడు చివరకు.

"ఎవరూ?" అందా మనుకొంది దేవి. కాని సస్పెన్సు అవమానపడి పోతుందేమోనని వూరుకొంది.

"బూటు చప్పుడుని బట్టి వ్యక్తిని గ్రహించవచ్చు—"

మనిషి కనిపించకపోయినా మాటనుబట్టివయస్సు చెప్పొచ్చు—

"మనస్సు యెటువంటిదో తెలుసుకోవాలంటే, చేసే చేష్టలు చూస్తే చాలు—"

ఇట్లా ఫిస్తోల్‌శర్మ, ఘాట్‌రావుకి వక్కపొడి పెడుతూ కాస్త, కాస్తగా చెప్పుకొస్తున్నాడు.

"ఇంతసేపూ కూర్చోబెట్టి వుంచినందుకు యేమిటీ

లాభం. ఏదో కూర్చుని, పత్రికా కార్యాలయంలోనే, తన ప్రతిభను చూపి, ఒక గేయం వ్రాసి దేవదత్తంలాగా చదివినా, అప్పుచేసిన సిగరెట్లు అయిపోయినా, కాసిని కాఫీ నీళ్ళయినా తెప్పించి యివ్వలేదే!" నని—

"సింధూరం"— "రక్త చందనం"— "బంధూకం"— "సంధ్యారాగం"— "పులిచంపిన లేడి నెత్తురూ"

ఇత్యాది నవ్యకవితా సామగ్రికి వుదాహరణగా, తయారై వూరుకొంది రుధిరోద్గారి వదనం.

పిస్తోల్ శర్మ, ఫ్లాటురావు వంక అపరాధ పరిశోధకుడిలాగా చూస్తున్నాడు. సస్పెన్సుగా చూస్తున్నాడు శాస్త్రి. రుధిరోద్గారికి సిగరెట్లు అయిపోయినయి. కాఫీ కషాయంకోసం గిజగిజలాడుతున్నాడు.

మిట్టమధ్యాహ్నశ్రీకి అప్రాప్త మనోహారీ సౌందర్య లావణ్యాం జ్ఞాపకమొస్తోంది.

ఇంతలో కందిరీగల అందలంలోంచి దిగివచ్చినట్లుగా వచ్చాడు పత్రికాదేవిని ఆధారంగా పెట్టుకొని బ్రతికే "వూసరవెల్లి" గారు. వాళ్ళయిదుగురూ వూసరవెల్లిగార్ని చూసి నిల్చున్నారు.

దేవి కూడా నిల్చుని వాళ్ళని పరిచయం చేసింది. వూసరవెల్లి రంగు మారుస్తూ— మందహాసంతో—

"ఫరవాలేదు కూర్చోండి."

అందరూ కూర్చున్నారు.

"మీ పేర్లు వినడమే గాని, స్వయంగా చూడగలిగే భాగ్యం నేటికి కుదిరింది. చాలా సంతోషం" అన్నాడు.

తరువాత మాట "కాఫీలు తెమ్మని" చెపుతాడేమో అనుకున్నాడు రుధిరోద్గారి.

ఇంతలో పిస్తోల్ శర్మకి చిరాకెత్తింది. "ఇటువంటి సంభాషణలవల్ల లాభం యేమిటీ! ఎందుకొచ్చాం యిక్కడికి?" అని చాణక్యుడిలా ఆలోచించాడు ఒక్కసారి.

పగబట్టిన త్రాచులాగా లేచాడు.

అతన్ని చూసి 'పూసరవెల్లి' అదిరి పడ్డాడు.

"ఇప్పటికి మీకు—

"గంధకంలో సుగంధం"—

"కాళరాత్రిలో కత్తినవ్వు"—

"చెలికత్తె రొమ్ముమీద చెరగని నిశాని"—

"శశిరేఖలో సారాయి రుచి"—

"రూపాయిలో నిరూపారాయ్" అనే అయిదు అపరాధ పరిశోధక రచనలు మీ పత్రికకు పంపాను. వాటిగతి యేమైనట్లు? యెన్ని వుత్తరాలని వ్రాయడం? రచయితల్ని యిలాగేనా ఉత్సాహపరిచేది. ఎనిమిది సంవత్సరాలు దాటినా వాటి అంతు తెలియదయ్యే" అంటూ పిస్తోల్ గుళ్ళలాంటి మాటలు పూసరవెల్లి మీదికి వదిలాడు.

దేవి గజగజ లాడింది.

పిస్తోల్ శర్మ- రుధిరోద్గారిని లేవమని చెప్పి, రొప్పుతో కూర్చున్నాడు.

రుధిరోద్గారి లేచీ లేవడంతోనే మొగం చించుకొన్నాడు. మొసలి నోరులాగా పళ్ళు బయటికి పెట్టాడు. కిళ్ళీ నమిలిన నాలుక కత్తిలాగా తిరుగుతోంది—

"వజ్రాయుధంలాంటి కలంతో వ్రాసిన, అపూర్వ ప్రతిభా సంపత్తితో మేళవించబడే పదాలతో, నిత్యమూ జరిగే సంఘర్షణలో, ప్రగతికి పురోగమించడంలో, ప్రజాస్వామ్య యుగంలో, కాలచక్రాల గమనంలో, శ్మశానవీథిలో యెగిరే జీవాల వికటాట్టహాస రోషాలలో, నలిగిపోయే బీదసాదల గుండెల రుధిరస్రావాన్ని రుచి చూస్తున్న రాబందుల మనస్తత్వాన్ని చిత్రీకరించుతూ, దీపావళికి రెండు సంవత్సరాల క్రిందట పంపుకొన్న "మండ్రగబ్బ డెక్కల్లో మరులుగొన్న మస్తిష్కం" అనే నా గేయం ఏమైంది? ఎక్కడుంది? కాళరాత్రి కౌగిలిలో కమిలిపోయే నీలిరంగుని తీసి, అధివాస్తవికత్వాన్ని నిరూపించా నా గేయంలో. అటువంటి రచన యింతకాలానికే ప్రపంచంలో ప్రచారానికి- ప్రకాశానికి- ప్రభావానికి రాకపోతే, యింకా నా సాహిత్యసేవ దేనికి? నా కీ పేరువుండి లాభం యేమిటీ" అంటూ అలసిపోయి కుర్చీలో కూలబడిపోయాడు- పత్రికాదేవివంక చూస్తూ.

'పూసరవెల్లికి' చింత నిప్పులమీద కూర్చున్నట్లనిపించింది.

మొగంలో రంగులు మారుతున్నయి. ప్లాట్ రావు సావకాశంగా చూస్తూ, లేచి—

"ఊహించినా అందరాని విషయాలన్నీ ఏకరువుపెట్టి, అధిగమించలేని మార్గాలన్నీ అన్వేషించి, "ప్లాటు"కి సాహిత్యంలో ప్రధాన పాత్రనిచ్చి వ్రాసిన "మంగలిపిట్ట"- "దాలిగుంట"- "గొగ్గిపన్ను"- "కుక్కతల్లి" మొదలైన నా అధునాతన కథానికలను ఏ వుద్దేశ్యంతో ప్రచురించకుండా వున్నారు?

పోనీ యెందుకు త్రిప్పి పంపలేదు. చెప్పండి. భయంలేదు. ఫర్వాలేదు" అంటూ బాధనంతా నెమరు వేసుకుంటూ ఫ్లూటురావు అడిగాడు.

పూసరపల్లికి నవ్వొచ్చింది.

సస్పెన్సుశాస్త్రికి వొంటిమీద దురద గోండాకు సోకి నట్లనిపించింది.

"పిస్తోల్ దెబ్బ- గుండె పగిలి కారిన పాలలో సేమ్యా తీగెలు కిలకిలమని నవ్వుతున్నాయి.-"

"దూరంగా గులాబిరంగు జాకెట్ నవయౌవన యువతి సిగ్గుపడుతూ-, దానిమ్మ కొమ్మమీద దాక్కొంది."

"ప్రేయసీ! లైలా!" అని పిల్చాడు మజ్నూ! సినిమాలో- ఇసుక తుఫానులో- ఎడారిలో గుడారం లేచిపోయింది. ఆ హోరుగాలి ధ్వనిలో మజ్నూ విలాపం ప్రేక్షకులికి రాజేశ్వరరావు సంగీతమైతే బాగుండే దనిపించింది-"

"అనార్కలీ, సమాధిలోంచి—

అల్విదా... అల్విదా అంటూ సలీమ్‌కి జిలేబీ- రసగుల్లాలు తామరాకుమీద పంపింది."—

"గుడ్లగూబ కోయిల్లాగా కూసింది. సెలయేరు మునిసిపాలిటీ మురుగు కాల్వ మాదిరిగా విషాదగీతాలాపన చేస్తోంది"—

"ప్రియురాలిని కలుసుకున్నా డొకడు. ఎదురుగా సాలెగూడు గుండ్రంగా కనిపించింది. ఆమెను హృదయానికి ముందు హత్తుకొన్నాడు. తరువాత బిగియార కౌగిలించుకొన్నాడు. తేలిగ్గా ముద్దుపెట్టుకొన్నాడు- యింతలో అగ్నిపర్వతం

బ్రద్దలైంది. మెరుపులు– వురుములు– జాకెట్‌లో పేలిందొక రాకెట్– తరువాత ప్రళయం– మళ్ళా నవ్యసృష్టి"—

యిలా రకాలుగా– డైలాగ్సుపెట్టి, యింత సస్పెన్సుగా వ్రాసి పంపుకొన్న "బూడిదలో భూకంపం" అనే నా 'నవల' యెక్కడ దాక్కొంది? గుండుదెబ్బ తగిలి యెండిపోయిన నా హృదయానికి అదొక్క రచనే ముక్తిదాయకం. ఇంతకీ ఏమైంది?" అంటూ సస్పెన్సుశాస్త్రి కలవరిస్తూ కూలిపోయాడు కుర్చీలో.

పత్రికాదేవి కుర్చీలో కూలిపోయింది. కాసేపటికి స్పృహవచ్చి మామూలు మనిషైంది. ముక్కుమీద వ్రేలుంచుకొంది.

ఊసరవెల్లి నవ్వుతూ—

"మీ వేం లేవా!" అన్నాడు మిట్టమధ్యాహ్నశ్రీని చూసి.

ఆ మాట ఆకురాయిలాగా రాసుకొంది హృదయానికి.

చ్యూయింగ్ గమ్ తింటున్న వాడిలాగా నోరుపెట్టి– గోడకు ఎదురుగా తగిలించివున్న "ఊర్వశీ" చిత్రాన్ని చూస్తూ– తేటగీతిలో—

"ఆమె నులి వెచ్చ కౌగిలి అంతులేని
మృదు సుఖాల తరంగాలు ముంచుకొచ్చి,
మేను మరపించి జీవితమే, వసంత
ఋతువు గావించు సుమమాల
బ్రతుకు నెపుడు"—

అని అపరపురూరవుడినై వ్రాసికొన్నాను తొలి రేఖలో.

పిండారబోసిన పండు వెన్నెల శారద రాత్రులు- ఉజ్వల తారకల వెలుగులో- సన్నజాజి పూలపందిరిలో- తూగుటుయ్యాలలో- కప్పురపు విడెము సేవిస్తూ- కలువ మొగ్గలా వున్న నా అప్రాప్త మనోహరీ సౌందర్యలావణ్య సుకుమార, సుందర, స్వరూపాన్ని తల్చుకుంటూ- కలలు గంటూ- "సిగలో మొగలిరేకు" అనే ప్రబంధ కావ్యానిక సీరియల్ గా ప్రచురించమని ప్రార్థింపపడుతూ పంపాను రెండేండ్ల క్రిందట. తరువాత అలాంటి కావ్యం వ్రాయడానికి నా మనస్సు తూగలేదు. నా ప్రియురాలి వయసులో వసంత ఋతువు వెళ్ళిపోయింది. నా కలంలో నిర్ఝరిణీ ప్రవాహం లాగా పారే జీవధార సన్నగిల్లింది. సడలని కౌగిలింతలు- ముద్దులు జాజిమల్లెల సురభిలాలు- సెలయేటి రొదలు- తుమ్మెదపాటలు- ఆనంద రసైకఘని- మొదలైనవన్నీ నాలో తడారిపోయినట్లనిపించింది. అయ్యా! ఒక్కసారి నా కావ్యం లోని 'తొలిరేఖ' అని పేరు పెట్టుకొన్న పద్యాల్ని చదువు కోవాలని వుంది. యెక్కడుందో తీసివ్వండి. వ్రాతప్రతిని చూసుకొని, అచ్చుప్రతిగా తృప్తిపడతాను. సెలవివ్వండి. ఎక్కడుంది?" అని మిట్టమధ్యాహ్న(శ్రీ) దీనవదనుడై గాద్గది కంగా పల్కాడు.

దేవి గుండెలో జాలీ- కరుణ ద్రవించాయి. ఊసర వెల్లికి వికృతమైన నవ్వొచ్చింది. వాళ్ళయిదుగురి మొరలూ- మొక్కుబడులూ విన్నాడు వూసరవెల్లి.

దేవివంక చూసాను.

ఆమె ముఖంలో విషాదచ్ఛాయలు దృగ్గోచర మవు

తున్నాయి- కనుకొలకుల్లో అమృతధార లూరినయి. బాధను వ్యక్తం చేయలేక సతమత మవుతోంది.

ఊసరవెల్లికి వూపిరి సలపలేదు. అందరూ తనవంకే ఖూనీకోరుల్లాగా చూస్తున్నారు.

దేవి మొగంలో సానుభూతి అలుముకొంది. ఆమె వాళ్ళమాటలు నమ్మింది. గాద్గదికంగా వూసరవెల్లితో అంది.

"ఎందుకిలా చేస్తున్నారు. మిమ్మల్ని ఆధారంగా పెట్టుకొని, పేరు తెచ్చుకుందా మనుకొంటే, యిటువంటి పనేనా చేసేది! ఇలాగేనా నా మొగానికి కళంకం తెచ్చేది! "సాహిత్యాన్ని పోషించాలి. రచయితల్ని ప్రోత్సహించాలి" అని సంపాదకీయాలు- వుపన్యాసాలు చెప్పిందీ- వ్రాసిందీ మీరేనా! ఏమిటిదంతా!" అంటూ పత్రికాదేవి వూసరవెల్లిని గట్టిగా నిలబెట్టి అడిగింది.

వూసరవెల్లికి మెదడులోనూ- గుండెలోనూ 'ఉషా' వంకాలు తిరిగినయి- కెనడా క్రైలింజను యీల వేసింది. ఫ్యాక్టరీ పొగగొట్టం మసిబొగ్గులు రవ్వలు చిమ్మింది- పసిపిల్ల పాలకోసం యేడ్చింది- ప్రియురాలి వక్షస్థలంలో త్రిశూలం దిగబడింది- ప్రియుడి నెత్తిమీద వజ్రాయుధం దెబ్బ టంగ్ మని మోగింది. అమాంతంగా లేచి ముందున్న టేబిల్ లేపి ప్రక్కకు పడత్రోశాడు.

"చి...కా...బు" కనిపించింది.

"పిస్తోల్ శర్మ" కళ్లు గుండ్లు రాల్చాయి.

"మిట్టమధ్యాహ్న(శ్రీ)"- హృదయారవిందం పుష్పాడి రాల్చింది.

# నవ్వేన పువ్వు

కింగ్సువే గుండా వెడుతుంటే నాలుగంతస్థుల ఒక పెద్ద మేడ కనబడుతూ వుంటుంది. అందులో ఏడెనిమిది కుటుంబాలు నిత్యమూ చస్తూ— బ్రతుకుతూ వున్నవి. కుముదిని కూడ ఆ మేడలోనే నాలుగో అంతస్థులో ఒకగదిలో వుంటోంది. ఆమె టెలిఫోన్ ఎక్స్చేంజులో పని చేస్తూవుంది. పాతికేళ్ళుంటాయి. సన్నగా— జాజి పువ్వులాగా వుంటుంది. తరచు పచ్చపూవులాంటి చీరెలు కడుతూ వుంటుంది. నిడుపాటి వాల్జడ బెత్తెడు మందాన నడుం దాటి వూగుతూ వుంటుంది. చాలా నాజూకుగా— ఆకర్షణీయంగా వుంటుంది. బుచ్చిబాబుగారి సుశీలకూ— కుముదినికీ మాటల్లోనూ— ముఖకవళికల్లో— వాలు చూపుల్లోనూ ఏమీ తేడా వుండదు. ఇంకా పెళ్ళి కాలేదు, శ్రీరామమూర్తిని ప్రేమిస్తోవుంది. అతను రైల్వేపార్శెల్ సెక్షనులో పని చేస్తున్నాడు. ఎర్రగా వుంటాడు. ఎగదువ్వే వుంగరాల క్రాపు ముచ్చట గొలుపుతూ వుంటుంది. దయ, సానుభూతి, సహకారమూ ఎల్లప్పుడూ తన పట్ల వుంటే చాలని భగవంతుణ్ణి సదా ప్రార్థిస్తో వుంటాడు.

దాదాపు రెండు సంవత్సరాల క్రితం, కుముదినికి శ్రీ రామమూర్తి ఒకపెళ్ళిలో పరిచయమైనాడు. చాలా హృదయం ఇచ్చి మాట్లాడే స్వభావం గలవాడవటంతో ఆమె అతణ్ణి ఆకర్షించుకో గల్గింది. యుక్త వయస్సులో యువతీ, యువకులకు స్నేహపురస్సరంగా పరిచయం లభిస్తే అది క్రమేపీ ప్రేమ సూత్రానికి కట్టుబడి పోతుంది. అలాగే వాళ్ళిద్దరిపట్ల ప్రేమ బంధం ఏర్పడింది. అంతమాత్రంచేత సహజోద్రిక్తమైన కక్కుర్తి చేష్టలకు వారు లొంగి పోలేదు. తమతమ నైతిక జీవిత సరిహద్దుల్ని కొలిచి చూసుకున్నారు. ఇరువురు సమానులైనారు. హృదయాలు అంగీకరించినవి. పెళ్ళి చేసుకుని, హాయిగా కాపురం చేసుకుందామనే ఉద్దేశ్యం కుముదినికి ముందు కల్గింది. ఆమె కెవ్వరూ 'నా' అనేవాళ్లులేరు. ఉన్న ఒక్క మేనమామ దుర్మార్గుడు. త్రాగుబోతు. ఆయన కొడుకులు పేరు పొందాలని ఆ యింటి సంసారమంతా శతవిధాలా ప్రయత్నించి పరాజితులైనారు. అప్పటికి ఆమె చదువూ—సంధ్యాలూ పూర్తి కావడంతో ఈ ఉద్యోగం అదృష్టంవల్ల దొరికింది. శ్రీరామమూర్తి చేసుకుంటానికి "ఊ" అని ఎప్పుడంటాడా! అని ఎదురు తెన్నులు చూడసాగింది. శ్రీరామమూర్తికీ కుముదినికంటే ఎక్కువ తొందరగానే వుంది. కాని అతనికి తన అన్నయ్యగారంటే భక్తి శ్రద్ధ లెక్కువ. తల్లి దండ్రులేమో వైముఖ్యులు. చనువులేదు. సాహసించి ప్రయోజనం లేదనుకుని, అన్నగారి మాటకై అహర్నిశలూ తపస్సు చేయసాగాడు. "పెళ్ళి ఎప్పుడు చేసుకుందాం మూర్తీ!" అని రోజూ కుముదిని మాట వరుసగా అంటుంది. ఆతను సిగ్గు

పడుతూ, తల వంచుకొని నవ్వుకుంటూ, ప్రతిజవాబు ఇవ్వ కుండా మానుకుంటాడు. ఆమె సరదాగా రెట్టిస్తో కవ్విస్తుంది. మాటలతో పన్నీటి జల్లులు కురిపిస్తుంది. నవ్వులతో పువ్వులు విరిసి పరిమళాలు వెదజల్లేలాగ చేస్తుంది. వాల్గన్నుల వలపు చూపులతో, ఆతని ప్రేమ హృదయాన్ని ముకిపించి, పుల కరింప జేస్తుంది. శ్రీరామమూర్తి, రంభ చేరువలోవున్న నల కూబరుడిలా నవ్వి వూరుకుంటాడు. ఏం చేయగలడు? చెప్ప టానికి వీలుపడేది గాదు. నిజంగా అంతేగా జరిగేది. మనసిచ్చిన మగువ మధురభాషిణియై, మన్మథాకృతి దాల్చి, మరులుకొని, మందమందంగా చూస్తూ, మర్చిపోలేని సౌందర్యాన్ని ప్రదర్శి స్తుంటే, ఏ మగవాడు మాత్రం సూటిగా చూసి, మాట్లాడ గలడు? చాలా కష్టం. ప్రేమను వర్ణించడం కంటే, అప్పుడు పడే అవస్థను తల్చుకోవటం చాలా సుఖంగా వుంటుంది. అంతే గాదు; ఏ ప్రేమికుడూ, తిన్నగా ప్రేయసి ముఖం వంక చూసి భాషించలేడు. అలాగే ప్రేయసి కూడా చేస్తుంది. అసలు గంటల తరబడిగా ఎంతసేపు కూర్చున్నా అంత ముఖ్యంగా మాట్లాడవలసిన వేవో వాళ్ళకే తెలియవు. సమాగమానికి వెళ్లేంత వరకూ ఇరువురి మనస్సులోనూ త్రవ్వి పోయలేనన్ని ప్రేమ భావాలు కుప్పలు కుప్పలుగా వుంటవి. తీరా ఏ తోట లోనో, ఏ కొండ మలుపులలోనో— ఏ సాగర తీరానో— యెక్కడో అక్కడ నానా అవస్థపడి కలుసుకుంటారు. అంత వరకు బాగానే వుంది. తరువాత, వాళ్లు పడిన కష్టాల్ని పున శ్చరణ చేసుకుంటారు. ఆ ప్రకరణమూ త్వరలోనే అయి పోతుంది. తరువాత ఏం చెప్పుకోవాలో ఇరువురికీ తెలియ

కుండా పోతుంది. మూగ హృదయాలై పోతవి. చుట్టూ చూస్తారు. ప్రకృతి మనోహరంగా వుంటుంది. దాన్ని ఇరువురూ అభినదిస్తూ, 'ఆహా' అనుకుంటూ వుంటారు. సంగీత పాఠకులైతే, ఇరువురూ కలిసి 'డ్యూయెట్' కూడా పాడతారు. తప్పు లేదుగా! కాని, ఏదో ఉత్కృష్టావస్థ వాళ్ళపట్లా ప్రవర్తింప చేయుటకు ప్రేమయొక్క పారిభాషిక భావ మనిపిస్తుంది. ఈ భావంలో శ్రీరామమూర్తి కుముదినీ చాలవరకు బాధ్యతను వహించారు.

ఇరువురూ సాయంత్రమయ్యే సరికల్లా, పెరేడ్ మైదానంలో ఉల్లాసంగా కలుసుకుంటారు. అచ్చటా ముచ్చటా చెప్పుకుని హాయిమంటూ చల్లగాలిలో విహరిస్తారు. అతను తేలిపోయే మబ్బుల్ని అలసాలసంగా గాలికి వూగే గడ్డిపువ్వుల్ని చూసి కుముదినికి ఆహ్లాదకరమైన, ప్రణయపూరితమైన కబుర్లు చెప్తాడు. ఆమె గాలికి రేగిన ముంగురుల్ని పైకెగ త్రోసుకుంటూ, 'ఊ' కొడుతూ వింటుంది. ఇంతలో సంధ్యా తమస్సు ఆవరిస్తూ వుంటుంది. ఇద్దరూ లేస్తారు. నడక సాగిస్తారు. డ్రీంలాండ్ వరకూ, ఆ విశాలమైన రోడ్డుమీద, చెట్లక్రింద నీలి నీడల్లో సరదాగా కాలంచేత కట్టబడిన రంగుల గాలి పటాల్లాగా వెళ్ళి మళ్ళా తిరిగొస్తారు, ఇలా అయ్యేసరికి బాగా చీకటి పడుతుంది. పెరేడ్ మైదానంలో ఆసీనులైన జనం క్రమక్రమంగా లేచి గృహాభిముఖులవుతూ వుంటారు. వాళ్ళతో బాటు ఈ ప్రేమికులు కూడా నడిచి-నడిచి కింగ్సువేలోకి ప్రవేశిస్తారు. కొంతదూరం నడక సాగుతుంది...

ఆ నాలు గంతస్తుల మేడ దగ్గరగా వస్తుంది. కుముది

నికి వినుగోస్తుంది. శ్రీరామమూర్తికి గుండె పిడచ కట్టుకు పోతుంది. 'మరి నేను వెళ్ళిరానా...' అని కుముదిని యెక్కడంటుందోనని, అతను వణికిపోతూ వుంటాడు. నిముష నిమిషానికీ భయకంపిత స్వరంతో, ప్రాణాలు యెగిరి పోతున్నట్లుగా వుంటాడు. ఆ మాట రాకుండా తప్పించడానికీ, అది గుర్తుకి తెచ్చుకోనీయకుండా కప్పిపుచ్చడానికీ, శ్రీరామమూర్తి చేసే ప్రయత్నమూ— శ్రమ ఎంతో ముదావహంగా వుంటుంది. నవ్వూ వస్తుంది. వాస్తవంగా కుముదినికి కూడా, ఆ మాట ఫెళ్లున అనటానికి మనసొప్పదు. అయినా తప్పుతుందా? ఎప్పుడో అప్పుడు అనవలసిందే! అప్పుడనిపిస్తుంది! "పెళ్ళయితే ఈ మాట యెందుకు అనవలసి వస్తుంది?" అని. నిజంగా కూడా అంతేగా! అందుకని, చాలాసేపు క్రింద ఫుట్‌పాత్ మీద నిలబడి, టెలిఫోన్ ఎక్స్‌ఛేంజి ఆవరణలో పూసిన పూల వాసనలని ఆఘ్రాణిస్తూ, కబుర్లాడు కుంటారు. పొద్దు పోతూ వుంటుంది. శ్రీరామమూర్తి గడియారం ఆ సమయంలో ప్రపంచంలోని మంచి గడియారాలకంటే ముందుగా యెక్కువ కాలాన్ని చెపుతుంది. ఇంతలో కుముదిని "వెళ్లిరానా," అని నోటితో చెప్పలేక, కళ్ళతోనూ చేతుల్తోనూ— చెపుతుంది. అతను నీళ్లు కారిపోతూ "కుముదినీ! అప్పుడే వెళ్ళి ఏం చేస్తావ్ చెప్పు? కాసేపు యిక్కడే నిలబడి, తియ్యగా మాట్లాడు కుందాం" అని ఆమెను జాలిగా చూస్తాడు. ఆమె కదల్లేక, నవ్వు పూయుస్తుంటుంది. ఆ నవ్వుని తీరికగా వుండి గుర్తుకి తెచ్చుకున్నప్పుడల్లా, లోకంలో తీరని బాధలతో, ఆరని వ్యధలతో వుండే హృదయాలకు, శాంతినీ, హాయినీ,

సంతోషాన్నీ, ఆనందాన్నీ, ఉత్సాహాన్నీ కల్గించే దివ్యౌషధ మేమోనని శ్రీరామమూర్తి ప్రగాఢ నమ్మకం. అదే చమత్కారం. ఒక్కొక్క స్త్రీయొక్క మధుర దరస్మిత వదనారవిందం, చూసినప్పుడల్లా శ్రీరామమూర్తికే గాదు, చాలమందికి ఇలాంటి భావాలు కల్గుతవి. అప్పుడు ఎవరికున్న ఆత్మ సంస్కారాన్నిబట్టి వాళ్లు, ఆ నవ్వుకి ఒక ప్రత్యేకతను కల్పించి, రచయిత కన్నా మిన్నగా, రుచిగా నిర్వచిస్తారు. అందుకే శ్రీరామమూర్తి అలా అనుకోగల్గాడు. వాళ్ళిద్దరూ అలా నిలబడి లక్ష నక్షత్రాల మాటలు చెప్పుకుంటారు. శత కోటి జలపాతాల పాటలు శ్రవణానందకరముగా పాడుకుంటారు. అభ్యంతర మేముంది? కీ. శే. నండూరి వారు చెప్పినట్లు— "ఒక్క నేనే నీకు వేయి నీవులు" అని, శ్రీరామమూర్తి ఆమెపట్ల చెప్పుకుంటాడు. ఎంత మధురంగా వుందా భావం! ప్రేమయొక్క శాశ్వత స్థితికి, మహోన్నతమైన లంచు అదేనేమో!? కావచ్చు!!' ఇలా దాదాపు ఈ రెండు సంవత్సరాల నుంచీ కాలక్షేపం జరుగుతూనే వున్నది.

ఆ వేళ శ్రీరామమూర్తి బొత్తిగా నల్లపూసయి పోయాడు. చిమ్మచీకటి ఆవరిస్తున్నా కనబడలేదు. కుముదినికి ఏమీ తోచలేదు. పైగా ఆ రోజు 'నైట్ డ్యూటీ' వెళ్ళ బుద్ధి కాలేదు. వేవేల యోచనలు ఆమెను ఉక్కిరి బిక్కిరి చేసి కలవరపరచినవి. చిరాకు, విసుగూ శివమెత్తించినవి. కుముదిని తాళుకోలేక పోయింది. ఆమేగాదు, ఏ స్త్రీ గూడా ఆ తరుణంలో వుండబట్టలేదు. పురుషుల్ని నమ్మకూడ దనుకుంది. సహజంగా ప్రతి స్త్రీ, తన అభిలాషకీ, అభిరుచికీ చేదోడు

వాదోడుగా వుండే పురుషుడు రివాజుగా సమయానికి కనిపించక పోతే అలాగే అనుకుంటుంది. పురుషుడూ అలాగే అనుకుంటాడు. అంతేగాక, పురుషుడు స్త్రీని, స్త్రీని పురుషుడూ నమ్మకూడ దనుకుంటూనే, పూవుల్లో తావి లాగా నమ్ముతారు. చూస్తూ చూస్తూనే పాటలో మధురిమ లాగా ప్రేమించుకుంటారు. పెళ్ళి చేసుకొని సంతానవతు లౌతారు. చిత్ర మేమిటో! మరి, కుముదిని మాత్రం ఆ రోజున పురుషుడంటే కేవలం అబద్ధీకుడనే నిర్వచనం చెప్పుకుంది. నిన్నటి వరకూ శ్రీరామమూర్తిని, ఆమె తన వాడనే అనుకున్నది. పురుషులంతా అతనిలాగే ఎంతో మంచివాళ్ళనుకున్నది. మరి యివ్వాళ్ళింత మార్పేమిటి? కనిపించక పోబట్టేగా! ప్రేమ ఎంత చంచలమైంది. పురుషుడే లేకపోతే స్త్రీ దేనికి? అనే ప్రశ్న కలిగిన రోజునే, ఆ వివాహ సందర్భంలో కుముదిని శ్రీరామమూర్తిని చూసి, పరిచయ భాగ్యంతో ఆకర్షించింది.

పాతికేళ్ళ ప్రణయ హృదయాన్ని సమర్పించింది. అతను ఆమెను తన గుండెలో భద్రంగా దాచుకున్నాడు. అలాంటి స్థిత ప్రజ్ఞుడైన శ్రీరామమూర్తి నేడేడీ? ఇంతవరకూ కనిపించ డేమి? మనసిచ్చినట్టే యిచ్చి యెక్కడికి మాయమైనాడు? ఇలా లక్ష ప్రశ్నలు కలిగినవి. సమాధానాలు లేవు. ఆకాశం మేఘాలతో ఉద్ధృతంగా ఆవరించుకు పోతోంది. కరుళ్లుగా కరుళ్లుగా చీకటి అలుముకుంటున్నది. వీధుల్లో విద్యుద్దీపాలు వెలిగినవి. గాలి విసురుగా వీస్తోంది. వర్షం వచ్చే సూచనలు నిక్షేపంగా కనబడుతున్నాయి. కుముదిని ఎక్కడికైనా వెడదామనుకున్నది? ఎక్కడికని? వెళ్ళబుద్ధి కాలేదు. తనగది ముందు

చెప్పరానన్ని పర్యాయాలు పచార్లు చేసింది. వీధుల్లో వచ్చే పోయే జనాన్ని చీకటి ఆవరించేవరకూ వెదికింది. అప్పటికే రెండు మూడుసార్లు పెరేడ్ మైదానంలోకి కూడా వెళ్ళి వచ్చింది. ప్రయోజనం లేకపోయింది. పాదాలరుగుతున్నవే గాని శ్రీరామమూర్తి కనిపించటంలేదు. స్త్రీ పదిసార్లు ఒక వీధినే అదే పనిగా తిరిగితే, చూసేవాళ్లు వాళ్ళ సొమ్మంతా పోయినట్లుగా తేలిగ్గా అనుమాన పడతారు. అందుకని యిక తిరగడానికి కుముదినికి మనస్కరించలేదు. వర్షం పాటలు, పాట లుగా రాలుతోంది. ఆకాశం ఉరుములు మెరుపులతో దద్దరిల్లి పోతోంది. వీధిలో జనసంచారం పల్చబడింది. శ్రీరామమూర్తి యిక యివ్వాలిటికి రాడు, కనిపించడు' అని గట్టిగా నిర్ధారణ చేసుకుంది. పోనీ తను వెడితే? అతను తన గదిలో వుంటాడని నమ్మక మేమిటి? అంత వుండటానికి తనేం చేసింది? రోజూ వచ్చే మనిషి యివ్వాళెందుకు రాడు? ఏమిటో? అటు వంటప్పుడు తనెక్కడికి వెళ్ళటం? కుముదిని లోలోన మథన పడింది. హోటల్ నుంచి వచ్చిన క్యారియర్ అలాగే వుండి పోయింది. "ఎప్పుడూ తినే మామూలు తిండేగా!" విసుగు జనించింది. ఆడదాని మనసు పురుషుడికి లొంగనే లొంగదు. అలా జరగడమే గనుక నిజంగా అదృష్టవశాత్తూ జరిగిందో, నిత్యమూ, అనుక్షణమూ ఆ పురుషుడి కోసం ఒక తేయావ కలుగుతూనే వుంటుంది. గడియారం ముల్లు చకచక తిరుగుతున్నాయి. హృదయం శ్రీరామమూర్తి కోసం పరితపిస్తూ వుంది. కళ్లు చీకటి తెరలు తీసి వెతుకుతున్నాయి. ఆ రాత్రి పది గంటల వరకు కుముదిని వరూథిని కన్నా మిన్నగా బాధ

పడింది. ఈ ఆదుర్దా కంగారు— బాధ— తగ్గటానికి తరుణో పాయ మేదైనా చూడాలనిపించింది. వెంటనే బట్టలు మార్చు కుని సినిమాకు పోదామని పించింది. కాని వేళ దాటిపోయింది. పెదవి కరుచుకుంది. ఏం చెయ్యటం? ఇంకా ఆ మేడలో ఎవ్వరూ నిద్ర పోతున్నట్లుగా లేరు. చాలామంది కుముదినికి తెలుసు. వెళ్ళి తన బాధను మర్చి పోవటానికి, ఎవరితో నైనా పిచ్చాపాటీ కబుర్లు చెప్పకుందా మనిపించింది. కాని వాళ్ళకి నిద్రాభంగం అవుతోందేమో నని బాధ పడతారేమోనని ఆమె సందేహించింది. కాని, కుముదిని బయలుదేరింది. వియుక్తాలోచనలు ఆమెను మభ్య పెడుతున్నాయి. అడుగులు పడుతున్నాయి. ఒక్కొక్క మెట్టే పైకి వెడుతున్నాయి... బ్రతుకు భారంకన్నా, ప్రణయావేదనకన్నా, ఆమె వేసే అడుగు ఎక్కువ భారంగా తోచింది మెట్లకి... ఇంతలో 'కెవ్వు'మని ఒక చావు కేక ప్రక్క వాటాలోంచి భయానకంగా విని పించింది. కుముదిని ఉలిక్కిపడింది. శరీరం వణికింది. "తనను చూసి, ఎవ్వరూ భయపడి, కంగారుతో, దొంగనుకుని, కేక వేయలేదు గదా!" భుజాలు తడుముకుంది. ఎవ్వరూ తనకు కనిపించడం లేదు, చెమటలు క్రమ్మినవి. గాలి వీస్తూనేవున్నది. వర్షం ధారగా కురుస్తూనే వున్నది. నెమ్మదిగా కుముదిని కది లింది. చూసింది. అదొక పెద్దగది. దానిలో భార్యా, భర్త లిద్దరే వుంటున్నారు. భర్త ఉద్యోగం ఒక కంపెనీలో. భార్య చూడ ముచ్చటగా వుంటుంది. ఆమె పేరు కిరణాల. కుముది నికి, ఆమె తరచు ఇష్టురాలు. ఈ భావన కుముదినికి, నిము షంలో పటా పంచలై పోయింది. వింటోంది. చూస్తోంది.

"నువ్వు, ఇష్టం వున్నా లేక పోయినా నే చెప్పినట్లు చెయ్యాల్సిందే! ఏం?"

"ఎందుకు చెయ్యవు? నా సుఖం కోసం నువ్వు ఏదైనా సరే చేయాలి. లేకపోతే నిల్చున్న పాళాన గుండెలో పొడి చేస్తాను" పెద్దపులి లాగా భర్త గర్జిస్తున్నాడు. లేడిపిల్ల లాగా కిరణబాల చూస్తోంది. ఆమె శరీరం మీాద బట్టలులేవు. అతను— కాదు. ఆ రాక్షసుడు చించి, లాగి పారవేసి వుంటాడు. ఆమె నిస్సహాయ స్థితిలో వుంది. భర్త కఠిన హృదయంతో, తన స్వార్థం కోసం, డబ్బుకోసం, భార్యను అవినీతిగా ప్రవర్తించ మంటున్నాడు. చేతిలో పేష్‌కప్ మెరుస్తోంది.

అతను జడిపిస్తున్నాడు. ఆమె భయ విహ్వాల కంఠంతో ప్రార్థిస్తోంది. ప్రౌఢ వయస్సును గుప్పిట్లో పెట్టుకుని "నే నా పని చేయను" అని బ్రతిమాలు కుంటోంది. ఆతను బాగా త్రాగి వున్నాడు. "చెయ్యి, చెయ్యవే"— అని ఒత్తిడి చేస్తూ చావ బాదుతున్నాడు. ఆమె యౌవనం అతని కఠిన హస్తాల్లో నలిగి, నలిగి ముద్ద కట్టుకుని పోతుంది. "నా త్రాగుడికి డబ్బు చాలటం లేదు. చెయ్యాపని" అని గాండ్రిస్తున్నాడు. ఆమె తల కట్టంతా వూడిపోయి చిందరవందరైంది శరీరమంతా ఆ విద్యుద్దీపపు వెలుగులో వాతలు తేలినట్లు ప్రస్ఫుట మవుతోంది. ముఖమంతా కందిపోయింది. నును్పైన చెక్కిళ్లు కన్నీటి చారికలతో మరకలు పడినయి. ఏడుస్తోంది. దిక్కేమిటి?

కుముదిని కిటికీగుండా చూసింది. గుండె చెదిరింది. పురుషు డెంత మూఢుడు? అవును. పురుషుడు కఠినుడు. వాళ్ళది మనస్సు కాదు. రాయి. వాళ్లు మానవులు కారు.

మనిషి చేసిన రాతి బొమ్మలు. ఛీ! ఛీ!! స్త్రీ జీవితానికి చిచ్చు పెడుతున్నారు. తన వ్యసనాలకు, ఆనందాలకు భార్యను అవినీతిగా ప్రవర్తించి డబ్బు సంపాదించ మంటున్నాడు. ఎంత ఘోరం? ఎంత నీచం? పురుషుడిలో దాగివున్న నగ్న సత్యమిదేనా? కుముదిని వణికిపోయింది. కిరణబాల ఆత్మఘోష ఇంకా చెవుల్లో గింగురు మంటూనే వుంది. తిరిగి చూడలేక పోయింది. పురుషుని దృక్పథంలో స్త్రీకిగల ఉన్నతమైన గౌరవం— అభిప్రాయం— ప్రేమ ఇవ్వేనా? కడకు స్త్రీ బ్రతుకు ఇంతటి పతనావస్థకు దిగజారి పోక తప్పదా? సముద్ధరణ లభించదా? ఎంత అవమానం? ఎంత కఠోరం? అబ్బ! ఊహించిన కొద్దీ గుండె రంపపు కోతగా వుంది. కుముదిని మనస్సు కకావికలమై పోయింది. ఆలోచనలు ఉరిత్రాళ్ళయి తలను బిగబెట్టినయి. చర్రున కదిలింది. "చివరికి పురుషుడి చేతిలో స్త్రీకి లభించే స్వర్గం సుఖం ఇంతేనన్న మాట." నిర్వేద పూరితమైన హృదయంతో శ్రీరామమూర్తిని తలుచుకుంది. వెంటనే అదొక తప్పుగా భావించి, 'ఎందుకు పనివేళా తల్చుకున్నానా?' అని లోలోన తిట్టుకుంది. అతను మాత్రం అలా చేయడని నమ్మకం ఏమిటి? లోతుగా— దీర్ఘంగా యోచించింది. చుట్టూ చూస్తూవుంది. గదుల్లోంచి రకరకాలైన మాటలూ— వింత వింతగా ప్రవర్తించే వ్యక్తులు— దృగ్గోచరమవుతున్నారు. కుముదినికి అన్నీ కనిపిస్తున్నవి. తన బాధనూ— ఆలోచనల్నీ— కనిపించే వాళ్ళంతా దయా— సానుభూతులతో పాటు పంచుకొంటున్నా రేమో! నని భ్రమపడింది. క్రింద క్రిందకు దిగి వస్తున్న కొద్దీ— చంటివాడికి పాలు చాలక ఏడు

స్తుంటే, పోతపాలు పోస్తూ ఒక తల్లి కసురుకుని, చావబాదు తోంది. డబ్బు విలాసాలకు తగలేస్తున్నారని, ఒకామె భర్తను మందలిస్తోంది. తనకు మల్లేనే, ఒక ఆఫీసరు గారమ్మాయి- భారతి- 'తనకు పెళ్ళి కాలేదేమా?' అనిఅహర్నిశలూ ఆ కిటికీ దగ్గర కూర్చొని, దీర్ఘంగా యోచిస్తోంది. కుముదిని కూడా కొన్నాళ్ళు అలాగే చేసింది. ఆ రోజులు వెంటనే జ్ఞప్తి కొచ్చినవి. భారతికీ- కుముదినికీ కొంచెం పరిచయ ముంది. అందుకే భారతి అహర్నిశలూ పడే శ్రమను కుము దిని ఇట్టే గ్రహించింది. ఒకామె సంసారం చెయ్యలేక చస్తా నంటోంది. ఆమె ఎవ్వరో గాదు. కుముదినికీ దూరపు చుట్టం. వెళ్ళితే కావలించుకుని గావురుమని ఏడుస్తుంది. మరొక గదిలో స్త్రీ జనాభ్యుదయ మాసపత్రిక సంపాదకురాలు వజ్ర మణి, మరొకామెతో స్త్రీ స్వాతంత్ర్యాన్ని గురించి ఉప న్యాసం చేస్తూవుంది. ఒకాయన పోర్టికాలో నిలబడి, రాజ కీయాలు చెప్పుతున్నాడు. ఆయన ఎవరో కాదు. ప్రముఖ రాజకీయ పత్రికకు విలేఖరి. ఒకామె ఏదో వ్రాస్తోంది. భర్త ఇంకా వూరు తిరిగి వచ్చినట్లు లేదు. ఆమె పేరు కుముదినికి గుర్తు రాలేదు. క్రొత్తగా పరిచయమైనారు. ఏమిటో వ్రాసేది? కుముదిని, ఆఖరి మెట్టుమీద నిలబడి చూస్తోంది. ప్రేమ లేఖ కాదుగదా! అవును ప్రేమలేఖే! లేకపోతే, చేతిలో వున్న గులాబి పువ్వుని, వాసన చూసి గుండెకు హత్తుకుంటూ "హా! ప్రియా!"- అని కుర్చీలోంచి లేచి, ఆ పరుపుమీద ఎందుకు వాలిపోతుంది? నిజంగా ప్రేమలేఖే! లేకపోతే తన ప్రేమగాథన్నా అయి వుండాలి. లేకుంటే ఆ మధుర పార

వశ్య విభ్రమం ఎందుకు సంభవిస్తుంది? కుముదినికి ఈర్ష్య జనించింది. తన కట్టి భాగ్యం శ్రీరామమూర్తి ఎందుకు కల్గించకుండా తప్పుకుంటున్నాడు? ప్రేమించానని భ్రమపడి నందుకేనా ఇన్ని అగచాట్లు? కుముదినికి నిలువెల్లా తేళ్లూ-జెర్రులూ ప్రాకినవి. దిగులుతో తల తిరిగింది. నిలద్రొక్కుకో లేక పేవ్మెంటుమీద కొచ్చి నిలబడి చుట్టూ చూసింది. అంతా నిర్మానుష్యంగా వుంది. ఒక్క నిట్టూర్పు బరువుగా వదిలి ముందుకు కదిలింది. ఎదురుగా ఒకతను ఇంతలో సైకిలుమీద బాగా తడిసి ముప్పందుమై వస్తున్నాడు. కుముదిని చటుక్కున కళ్ళల్లో జ్యోతుల్ని వెలిగించుకుని చూసింది. శ్రీరామమూర్తి! అవును. అతనే! ఎన్నాళ్ల క్రిందటో చూసిన వ్యక్తిని పరకాయించి చూపినట్లు చూసింది. ఇది పెద్ద వింతేమీగాదు. ప్రేమికులు నిత్యమూ చూసుకుంటున్నా క్రొత్తగానే వుంటూ వుంటారు. అతను దగ్గరగా వచ్చాడు. ఆమె ఆగిపోయింది. యిరువురూ అపరిచితుల కన్నా మిక్కుటంగా ప్రవర్తించసాగారు.

"ప్రేమించట మంత బుద్ధి తక్కువ పని మరెన్నటికీ చేయకూడదు" అని మనస్ఫూర్తిగా అనుకున్న కుముదిని, క్లాక్ టవర్ వంక చూస్తూ మూగజీవంలా నిల్చుంది. ముఖంల్లో ముఖం పెట్టి శ్రీరామమూర్తి—

"ఏమిటీ పరధ్యానం కుముదినీ! యిలా చూడు" ఆమె ముఖాన్ని తనవైపుకి త్రిప్పుకుని అన్నాడు. ఆమె చూస్తూ మౌనం దాల్చింది.

"ఏమిటలా పిచ్చిగా చూస్తున్నావ్? నేనే"

"కానచ్చు."

"అదేమిటి కుముదినీ! నీ కోసం తడిసి తడిసి మరీవస్తే"- సైకిలు దిగాడు.

"నా మనస్సేమీ బాగుండలేదు. నన్ను పోనివ్వు మూర్తీ"—

"ఎక్కడికి?"

"నాకే తెలియదు."- ఇరువురూ వర్షంలో తడుస్తు న్నారు... పాపం!!

"అదేమిటి?"

"అవును."

"నువ్వనే దేమిటో నాకర్థం కావటం లేదు."

"ప్రేమించటం- ముఖ్యంగా నీ వంటి పురుషుల్ని బుద్ది తక్కువ పని అని నమ్మాను."- అతను నిలువునా కరిగి పోయాడు.

"కుముదినీ ఏమిటో నీ మాటలు నాకర్థం కావటం లేదు."

"చెప్ప మంటావా?"

"ఊ..."—

ఆమె సాకల్యంగా చెప్పింది. వర్షం మంచులాగా రాలుతోంది.

"అందుకని యేం చేయదల్చు కున్నావ్ కుముదినీ?"

"నా హృదయంలో పురుషు లెవ్వరికీ, ప్రేమ పూర్వ కంగా, తావు లేకుండా చేద్దా మనిపించింది."

"ఇంత కఠోర దీక్ష నీ కెలా కల్గింది?"

"నీ మూలంగానే!"

"నువ్వు పొరబడ్డావ్ కుముదినీ!"

"లేదు. నాకీ మార్పును కల్ల చేద్దామనే నువ్వు యివాళిట్లా ప్రవర్తించావు."

"కాదు కుముదినీ. అపార్థం చేసుకున్నావ్. నేను ఈ రోజున మా అన్నయ్య కబురంపితే వెళ్లాను."

"అదృష్ట వంతుడివి. నీ కన్నగార్లైనా వున్నారు. నాకెవరున్నారు? చెప్పడం దేనికి? తెలుసుగా నీకు, అటువంటప్పుడు యిక నా గురించి యెవరికాఁవాలి?"

"నాకు." ఆమె ముఖారవిందాన్ని తన చేతుల్లోకి తీసుకుంటూ అన్నాడు.

"ఎందుకు మూర్తీ!" అరమోడ్పు కళ్ళతో అంది కుముదిని.

"పెళ్ళి చేసుకునేందుకు. ప్రేమించుకున్నాంగా మరి."

"ఈ మాట వెల్లడి చేయడానికి, నన్నింతకాలం వూరించి, వూరించి వుద్ధరించావన్న మాట."

"అక్షరాలా కుముదినీ." అంటూ ఆమెను దగ్గరకు చేర్చుకున్నాడు. వర్షం కురుస్తూనే వుంది. ఆమె కళ్ళు ఆనందాతిరేకంతో మెరిసినవి. హృదయం, మన్మదావేశంతో ఉప్పొంగింది. పెదవులపై యిరువురికీ నవ్వులు చిందినవి. అతనికి నవ్వుకన్నా, ఆమె నవ్వులే, పువ్వుల కన్నా మిన్నగా బాసించినవి. అతని ప్రేమ పూరిత సరోవరంగా కుముదిని ఎప్పుడూ నవ్విన పువ్వే....

# ఆమె మనసు

శ్రీధరం చెట్టుక్రింద వకీలు వృత్తి చేయడానికి బి. ఎ. బి. యల్. ప్యాసయినాడు. కాని దానిమీద జీవనం గడపడం ఒకరకంగా అవమానమనిపించిది. పగలల్లా ఆ చెట్టు క్రిందా-పడి గాపులుపడి కలంలో సిరా అయ్యేదాకా తెల్లకాగితాల్ని నల్లబరచి- పదిమందితో అబద్ధాలాడించగా- వచ్చేముష్టి ముప్పయి రూపాయిల్లో యిద్దరు బ్రతకాలి. తను గాకుండా అదైనా వారానికి రెండుసార్లో ఒకసారో. అంతే నలభై యేళ్లు ముంచుకొచ్చేసరికి స్వేచ్ఛగా బ్రతకాలనిపించింది. ఈ స్వేచ్ఛను చిన్నప్పటి నుంచీ కోరుతూనే వున్నాడు. కాని దక్కింది యీ నాటికి. చేస్తూ- చేస్తూ వకీలు వృత్తికి స్వస్తి చెప్పాడు. పోనీ తనకు చిన్నతనం నుండీ 'లలిత కళల'మీద అభిరుచిగదా' దాని మీద కృషిచేసి ప్రపంచానికి 'కళ'యొక్క విశిష్ఠత చూపు దామా అంటే, 'కళ' పేరు చెప్పితేనే ప్రతివాడు హేయ పడ తాడు. తనకు 'కళ'ను గురించి తెలుసుకోవాలనీ- దానిలో ఆరి తేరాలనీ- వున్నమాట వాస్తవమే. అందులో ముఖ్యంగా అభి మానమైన 'సాహిత్యం'లో బాగా కృషిచేసి యేదో రకంగా

పేరు ప్రతిష్ఠలు— సమయానుకూలంగా ధనసంపాదన చేయాలని 'నవలా— గేయా' సాహిత్యంలో నానా విధాలుగా ప్రయత్నించాడు. ఫలితాన్ని చూపెట్టాడు చివరకు నాల్గయిదు నవలల్లో— రెండు సంపుటాల గేయాల్లో.

పెద్దకూతురు వివాహంచేసి కాపురానికి పంపాడు. రెండో కూతురు 'సుధ' విషయం విచారిస్తే కాళ్ళు లేవు పుట్టుకతోనే. త్రోపుడుబండిలో కూర్చొని యిక్కడకు— అక్కడకు ఆ యింట్లో తిరగాడగలదు. కాని తెలివితేటల్లో మాత్రం శ్రీధరం కన్న యెక్కువే. తండ్రి ఛాయల్లోనే కవితా వీధిలో తిరగాడ నారంభించింది. రజస్వలయిన నాటనుండి శ్రీధరం ఆమెకు పెండ్లి చేయాలని తహతహ లాడుతున్నాడు. కాని చేసుకునే దెవరు? తెనుగు సాహిత్యంలో తనతో బాటు రాణిస్తోంది. ప్రతి రోజూ తనకు వచ్చినట్లే పత్రికా సంపాదకులనుండి కథలు పంపమని వుత్తరాలు వస్తూనే వున్నాయి. వాటితో యెలాగో ఫలితం దక్కేంచేది. దయదల్చి పంపే పారితోషికాలే ఆమెకు ఒక రకంగా జీవితానికి ప్రోత్సాహమిచ్చేవి. దాంతో యింట్లో గడవటానికి కూడా వీలవుతుండేది.

ముఖ్యంగా శ్రీధరంకి పట్టుకుంది మొండితనం ఒక్కటే. మొదట్లో యీ మొండి తనం లేదు. తరువాత పరిస్థితుల మార్పుల్లో యీ మొండితనం మొన తేలటం మొదలెట్టింది. ఎంతకాలం బట్టో తన కుటుంబానికి ఆదుకుంటున్న మేనల్లునికిచ్చి 'సుధ'ను పెళ్లి చేయాలని కాని అంతలో తగిలే గడ్డు సమస్య మనస్సుకు తృప్తి కలిగించటంలేదు. "అంగవికలాంగురాలైన తన కూతురుకు వివాహమే చేస్తే— ఆ వ్యక్తివల్ల

మానసికానందం అతనెల్లా పొందగలడు?" ఇదే సమస్యమీద అతనెన్నో కథానికలు నవలా రచనలు చేసాడు. అదే సిద్ధాంతం తన స్వంతానికి వచ్చేటప్పటికి 'సంఘం' అనేది అడ్డువచ్చింది. సంఘాన్ని కాదనలేడు. సంఘాచారాల్ని తప్పనలేడు. వ్రాతల్లో చూపే వుద్దేశ్యాలు చేతల్లో కొచ్చేటప్పటికి విముఖత్వం చెందు తున్నాయి. మేనల్లున్ని సంప్రదించాడు. పిల్లతరఫున వచ్చే 'రెండు కుంటలభూమి కోసం మేనల్లుడు శంకరం' రూపు రేఖలు- విలాసాలు- వినోదాలతో నిమిత్తంలేదు. తల్లి మాటదాటలేని శంకరం వ్యక్తిత్వం విడిచి పెట్టి అమ్మకు చెప్పుకొని 'సుధ'ను వివాహం చేసుకుంటానికి ఒప్పుకున్నాడు. ఆస్తి పిల్లవైపున తరుముకొస్తోంది గదా అని శంకరానికి ఆనందం ఆగడం లేదు. శ్రీధరంకి స్వయంగా వెళ్ళి చెప్పుకున్నాడు- "మా అమ్మ ఊ"..." అందని. శ్రీధరం తబ్బిబ్బయి పోయాడు. సంతోషం పట్టలేక పోయాడు. పోతే పోయింది రెండు కుంటలు, ఉన్న భారం తీరుతోంది గదా అని కన్న కుమార్తె మనస్సు కూడా తెలుసుకోకుండా వివాహం చేయ నిశ్చయించాడు. యీ నిశ్చయం యెంతవరకు తన గౌరవానికి- తన సిద్ధాంతాలకు- వ్యతిరేకమో గ్రహించుకోలేక పోయాడా? తండ్రి మాటకు ఎదురు చెప్పటం చేతకాని 'సుధ' శంకరంతో మిథునలగ్నంలో మాంగల్యాన్ని కట్టించుకొంది. కాని వెక్కి- వెక్కి- ఒక్కసారి యేడ్చింది పెళ్ళయిన తరువాత, తండ్రిని తల్చుకొని.

ఒకనాడు 'సుధ' ఉదయం పదిగంటల వేళ 'వ్యథిత హృదయం' అనేకథ వ్రాస్తోంది. శ్రీధరం అప్పుడే భోంచేసి వసారాలోకి వచ్చాడు. చుట్ట వెలిగించి పడక కుర్చీలో జార

గిల పడ్డాడు. చుట్ట సగం కాలేటప్పటికి 'సుధ' కథ పూర్తి చేసింది. తండ్రివైపుకు తిరిగింది. శ్రీధరం చుట్ట పారేసి గ్లాసుడు చెరువు మంచినీళ్లు గటగట త్రాగి—

"సుధా! యేమిటో వ్రాసినట్టున్నావ్" అన్నాడు.

"ఆ... ఏముంది నాన్నా! ఏదో కథ వ్రాశాను."— అంది.

"పేరేం పెట్టావ్?" శ్రీధరం.

"వ్యధిత హృదయం"— సుధ. శ్రీధరం కథ పేరు ఫెళ్లున వినేటప్పటికి ఒక్క నిట్టూర్పు విడిచాడు. ఆ నిట్టూర్పులో యేవో ఆశలు విఫలమైనట్లు పొడచూపాయి. కళ్లు జేవురు మన్నాయి. పట్టిన చెమటను పై టర్కీ తువ్వాలుతో అద్దాడు.

"నాన్నా"— అందామె.

'ఉ'...!— అన్నాడు. ఆలోచనల్లోంచి మేల్కొని.

"ఏమిటో ఆలోచిస్తున్నార్లాగా వుంది"- అంది సుధ.

"ఆ... యేముంటాయి-" కథ పేరు వినంగానే కొంచెం పిచ్చి తలపులు రేకెత్తాయి... అంతే" అన్నాడు. శ్రీధరం.

"ఎందుకని నాన్నా!"—

శ్రీధరం జవాబివ్వ లేక పోయాడు.

"సుధా! కథ చదువూ—" అన్నాడు వెంటనే శ్రీధరం.

రెండు ముక్కల్లో కథను తీర్చేసింది. శ్రీధరం నిర్విణ్ణుడై పోయాడు. తను చేసిన వెధవ పనికి యిప్పుడు సిగ్గుపడ్డాడు; లాభం?

ఇల్లా కథ వ్రాసి తనకు పశ్చాత్తాపం కలిగించ తల్చు కుందా? లేక మా నాన్నారు యిలా నా జీవితం పాడుచేశా రని ప్రపంచానికి తెలియజేయాలనుకుందా? అలా ఎదురుగా ప్రవర్తించడానికి ఎప్పుడూ తన మాటకు ఎదురు చెప్పలేదే? మరి యేమిటిది!

సుధయొక్క వ్యక్తిగత జీవితం ఒక్కటే ప్రతిబింబింప చేసిందా కథలో. "సమాజంలో వ్రాతలు ఎంత హాయిని గొల్పుతాయో— చేతలో అంత బాధను చేస్తాయి. శ్రీధరం కన్న కూతురుకు ద్రోహం చేశాడు. సమాజానికి వెరచి సుధకు స్వేచ్ఛ లేకుండా చేశాడు. ఒకవేళ చేసినా ఆమె వలన మానసికానందం ఎలాగైనా లభించదు గదా! కాకపోతే శ్రీ ధరానికి తీరింది కూతురు భారం. ఇదే విధంగా అయితే శ్రీ ధరంకి కూతురు బదులుగా కుమారుడే వుంటే కుంటిపిల్లను తీసికొచ్చి చేస్తాడా? అందువలన యెందుకు యింత పాడుపని చేయాలి?" అంటూ యింకా కొన్ని విషయాలు ఆ కథ లోనే స్పష్టపరిచింది. చివరకు కథలోనే, "కన్న కూతురు హృదయం తెలుసుకోలేని మూఢులు యింకా చాలామంది వున్నారని–" 'స్త్రీ' అంటే యేమిటో తెలుసుకోకుండా— ఆమె ప్రత్యేకంగా వంటయింటి కుందేలుగా విలాస కృత్యానికి వుపయోగించే ఆట బొమ్మగా– స్వేచ్ఛలేని బానిసగా తల్చా రని వ్రాసింది. స్త్రీలకు కూడా విజ్ఞాన తృష్ణ వుంటుందని– వ్యక్తిగత జీవితాలపై ఎంత బాధ్యత వుండి వున్నదో– ఏది మంచో– చెడో– యే విషయం అంగీకరించాలో– యేది కూడదో యిటువంటి విషయాలలో హక్కువుందని కన్న

దం(డులం గదా అని అంగవికలాంగులైన కుమార్తెలకు యిష్టం వచ్చినట్లు, ఎటువంటి సం(పదింపులు లేకుండా యెవ రికో ధనం గల వాడికి అంటగట్టటం- భారం తీర్చుకోవాలని (ప్రయత్నించడం వివేకులయిన వారికి తగిన పని కాదంటూ" కథను ముగిస్తూ- కథలోని కథానాయికచేత "ఆస్తి కోసం నన్ను వివాహమాడారు- నేను యే విధంగా కూడా మానసి కంగా ఆనందాన్ని యివ్వలేను- పొందలేను- అందువలన మీరు పరోక్షంగా (ప్రవర్తించ వచ్చు- కాని అదే చనువు మీద నా జీవితాన్ని నాశనం చేసి- నన్ను మరచిపోయి వేరుగా భావించవద్దు" అంటూ భర్తకునివేదించుకున్నట్టు తన మనవిని కథా సంపూర్ణం చేసింది.

సుధలేని వేళ ఆ కథ చదివి శ్రీధరం యేడ్చాడు. దాని ఫలితంగా "తప్పునాదే" అనే కథానిక (వ్రాసి, కూతురుతో కూడా 'తప్పునాదే' అని నోటితో అన్నాడు సుధ కన్నీళ్లు కార్చింది. శ్రీధరం ఖిన్న వదనుడై యెంతపని చేసానని ఖేద పడ్డాడు. లాభం?

# మా అమ్మగా ఏడవకూ!

"త్రాతయ్యా! తాతయ్యా!"

చిట్టి చేతుల్తో చప్పట్లు కొడుతూ, చెంపకు చారెడేసి కళ్ళతో ఆశ్చర్యంగా చూస్తూ శార్వాణి ఆగి, ఆగి పిలవటం గోవిందయ్య పరాకుగా విన్నాడు. తల తిప్పి చూడనూ చూశాడు. ఏముంది? శూన్యం...

"ఎంచక్కా నుంచుందో చూడు.

తాతయ్యా! కదలటం లేదూ!"

మళ్ళా రెట్టించింది గోవిందయ్యను...... చిరునవ్వు నవ్వుతూ కనబడుతున్నట్లు నటిస్తూ—

"వూ...వూ... భలేగా నుంచుంది గదూ"— అన్నాడు.

ముక్కు పచ్చలారని మూడేళ్ళ శార్వాణి ముద్దు లొలికిస్తూ—

"నిజంగా తాతయ్యా! చూశావా! యిందాకట్నుంచి మా బొమ్మని నుంచోమంటుంటే నుంచుటం లేదు."

శార్వాణి విజయగర్వాన్ని సూచిస్తూ అంది.

"అలాగా! మొత్తానికి ఎట్లాగొట్లా

నిలబెట్టా నంటావు... అంతేనా!"— అంటూ గోవిందయ్య అస్పష్టంగా— అలికినట్లుగా— కూడా లేనట్టి నిల్చున్న బొమ్మవంక చూడసాగాడు.

ఏముంది...? శూన్యం... చీకటి...

గోవిందయ్య వీటిమధ్య బ్రతుకుతున్నాడు. ఎన్నాళ్ళీ జీవితం యిలా గడవాలో జాతకం కూడా సూచించడం లేదు. ఇలాంటి స్థితి తన కేర్పడుతుందని గోవిందయ్య ఏనాడూ అనుకోలేదు.... ఇంతలో తప్పటడుగులు వేసుకొంటూ శార్వాణి గోవిందయ్య దగ్గరకు వచ్చి—

"రెండుసార్లు క్రిందపడి మూడోసారి కదలకుండా నుంచుంది... తాతయ్యా!"— ఆనందంలో కేరింతలుకొడుతూ బుల్లి, బుల్లిగా చెపుతోంది. గోవిందయ్యకు ఎవరో వచ్చి వీపు చరిచినట్లయింది. ఉలిక్కి పడ్డాడు.

"భలే దానివే" అని శార్వాణిని మెచ్చుకొంటూ అన్నప్పటికీ, మనస్సులో మరుగుపడిన పాతబాధ తలెత్తి, గత స్మృతుల స్థితిని గుర్తు చేసింది.

గోవిందయ్యకు యింతకు ముందు రెండుసార్లు పక్షవాతం వచ్చి తగ్గిపోయింది. రెండుసార్లూ కుడిచెయ్యి, కుడికాలూ, చివరకు ఆ భాగమంతా అవిటిదై పోయింది. "ఇక బ్రతకననే" నిశ్చయించుకొన్న గోవిందయ్యకు ప్రకృతి వైద్యంతో కాస్త నయమై, తుదకు పునర్జన్మ ఎత్తినట్లుగా భావించుకున్నాడు.

తన యింట్లో రెండుసార్లు పక్షవాతంతో పడిపోయా

నని, మూడోసారి ఎలాగో నిలబడ్డానని ఒక విధమైన తృప్తి గోవిందయ్యకు మనస్ఫూర్తిగా వుంది.

తన యింట్లో తన మనుమరాలు ఆడుకునే బొమ్మ రెండుసార్లు పడి, మూడోసారి నిల్చుంది— ఆ బొమ్మ కన బడక పోతున్నా, నిల్చున్నందుకు సంతోషంతో—

"భలే దానివే"— అన గల్గాడు శార్వాణిని... ఆ మాటకి శార్వాణి—

"మరేం టనుకున్నావ్ తాతయ్యా ఎలా నుంచుందో చూడు... కనబడుతోందా!..." అంటూ చేతుల్తో చూప సాగింది. తన కెంత సంతోషం! శార్వాణికి తెలియదు. గోవిం దయ్యకు తెలుసు... కాని చూడలేడు. చూసినట్లు చెప్పాలి. శార్వాణి గోవిందయ్యను ఎలావుందో చెప్పమని రెట్టిస్తోంది. తన స్థితి గుర్తించలేక తనే బాధ పడుతున్నాడు. తనకు ప్రాణ మున్నా ప్రాణంలేని బొమ్మ నిల్చున్నందుకు ఆశ్చర్యపడ్డాడు. వచ్చిన పక్షవాతానికి చచ్చిపోతానని, అప్తులంతా విచార పడ్డారు... బ్రతికించడానికి వైద్యులంతా చాలా పాటుపడ్డారు. ఒక్క ప్రాణంకోసం అనేక ప్రాణాలు శ్రమ పడినయి. ఫలితం తను నిల్చోగలిగాడు. కాని, ప్రాణంలేని, శార్వాణి ఆట బొమ్మ కూడా తనకు మల్లేనే నిల్చుంది. వేదాంతులకు అది ప్రాణంలేని బొమ్మ. కాని, భగవంతుని దృష్టిలో ప్రాణమున్న బొమ్మ. తనకన్నా, మూడేళ్ళ శార్వాణి నిల్పిన ప్రాణంలేని బొమ్మకు భగవంతుని దృష్టిలో విలు వెక్కు వుందని గోవిం దయ్య దృఢంగా నమ్మాడు... భగవంతుడనే వాడు శార్వాణి దృష్ట్యా తనకు కనబడకుండా వున్నాడనివాపోయాడు.

శార్వాణి గోవిందయ్యను వూపిరి సలప నివ్వకుండా చేస్తోంది.

అమాయకంగా అల్లరిచేసే పిల్లలకు హద్దూపద్దులు వుండవు. వాళ్ళ మాటలలో గత స్మృతుల్ని కదలించి వూపే భావాలు అనూహ్యంగా వుంటాయి—

"చూడవేం తాతయ్యా!"— శార్వాణి బుంగమూతి పెట్టి ప్రశ్నించింది— కోపం వచ్చిందని గోవిందయ్య గ్రహించాడు.

"చూశానమ్మా!"— గోవిందయ్య పరితప్త హృదయంతో— గాద్గదిక స్వరంతో అన్నాడు.

అతని హృదయానికి తనిచ్చిన జవాబు పూర్తిగా అబద్దంతో కూడినదని తెలుసు. ఏం చేస్తాడు...?

ఊరడింపుకి అంతకన్నా వేరే గత్యంతరం లేదు...

ఆ స్థితిలో అంతకన్నా ఏమీ చెప్పలేక పోయాడు...

"ఎలావుంది?"— శార్వాణి మళ్లా అడిగింది.

"ఎలా వుందో?"— గోవిందయ్యకేం తెలుసు. ఎంత దగ్గరికి జరిగినా, ఎలా నుంచుందో కనిపించటంలేదు. గోముగా, మారాముగా శార్వాణి అడుగుతుంటే గోవిందయ్యకు గుండె తరుక్కుపోతోంది. మనుమరాలితోపాటు వుత్సాహాన్ని పొందలేక పోతున్నాడు. ఆమె పారవశ్యంలో ఏ మాత్రమూ పాలు పంచుకోలేక తికమకలు పడిపోతున్నాడు.

శార్వాణికి కనిపించినట్లు తనకు కనిపించదు. అందరికీ కనిపించినట్లు తన కంతకన్నా కనిపించదు. తనకు కనబడకుండా వున్నట్లు ఎవ్వరికీ కనిపించకుండా వుండదు. చివరకు ఎంత

తర్కించుకున్నా, ప్రయోజనం లేక, శార్వాణికి తృప్తికోసం మాత్రం— ఆత్మవంచన చేసుకుంటూ "చక్కగా నుంచుంది కదూ" అన్నాడు.

ఇదీ పచ్చి అబద్ధమని తెలుసు. రెండోసారి కూడా యిలా అంటే వూరుకొంటుందేమోనని ఆత్మ విశ్వాసమూ- నమ్మకమూ- పరిత్యప్తిస్నీ.

శార్వాణి కొంచెం సేపు ఏం మాట్లాడకుండా వూరుకొని, గోవిందయ్య వళ్ళోకి ఒరుగుతూ—

"తాతయ్యా! నువ్వాట్లా నుంచో పెట్టగలవూ" ధీమాగా ప్రశ్నించింది.

గోవిందయ్య గతుక్కుమని అంతలోనే సంబాళించుకొంటూ—

"అబ్బే! నాకేం చేతవును. ముసలాడికి... మీ అమ్మ అయితే నీకు మల్లే చక్కగా నుంచో పెడుతుంది. నాన్నయితే యింకా బాగా నుంచో పెడతాడు" అన్నాడు. ఇక తనకు తాను యీ వ్యాసంగం నుంచి తప్పుకోవటం మేలనిపించింది— గోవిందయ్యకు. "అవును. తప్పకుండా తప్పుకొని తీరాలి. లేకపోతే శార్వాణి, ఆ బొమ్మని నిలబెట్ట మంటుంది. ఇంతవరకూ కనబడని వస్తువుని త నెలా నిలబెట్ట గలడు? శార్వాణికి కోపం యిట్టే వస్తుంది. కొట్టినట్టు గుక్కపట్టి ఏడుస్తుంది. ఆ ఏడ్పుని కళ్ళారా చూసి సహించడానికి వీలులేక పోయినా, చెవులలో మాత్రం ఆ జన్మాంతం ఆ ధ్వని మార్మోగుతూనే వుంటుంది. గుండె ద్రవీభూత మవుతుంది. తనలోవున్న బలహీనతకు, అసమర్ధతకు, తార్కాణం శార్వాణి ముఖం జేవురిస్తుంది. మనుమ

రాలు చేసిన ఘనకార్యం తను చేయలేడు. తనకు షష్టి పూర్తయింది. ఇంత వయస్సొచ్చిన తను మూడేళ్ళ శార్వాణి ఆనందం కోసం ఒక ప్రాణంలేని బొమ్మని నిలబెట్టలేడు. ఏం లాభం? ఈ దశలో పిడుగురాళ్ళుకి కళ్ళు పోయినయి. మరో రెండు పదులొచ్చి, వయస్సులో కలిసినట్లయింది.

డాక్టర్లు తన దౌర్భాగ్యపు స్థితికి చేసేదేం లేక పెదవులు విరిచారు. కాని ఫీజు మరచిపోలేదు.

చివరలో తనకు సృష్టి దిష్టి తీసేసింది. శాపగ్రస్తుడికన్నా హీనంగా జీవితం గడుస్తోంది.

గోవిందయ్య తన స్థితిని యింతకన్నా ప్రస్తుతం ఏమని తలపోసుకో గలడు—

ఇంతలో శార్వాణి కాలి అందెల ధ్వని గోవిందయ్య భావుకతను భగ్నపరుస్తూ—

"తాతయ్యా!"— అంది— తీయగా.

గోవిందయ్యకు ఆ మాటలో అమృతం చవిచూసి నట్లయింది. దగ్గరకు తీసుకుంటూ—

"ఏమమ్మా?"– అన్నాడు, బుజ్జగింపుగా... ముద్దుగా... లాలనగా.....

"నా కీసారి మంచి రబ్బరు బొమ్మ కొనిపెట్టవూ!"

"అలాగే. అనిక్కో కొందాం... ఏం"– అన్నాడు. శార్వాణి వెంటనే సంతోషంతో కిల కిలమని నవ్వింది. గోవిందయ్యకు ఆ నవ్వు కనబడదు. నవ్వినట్లు ధ్వని వినబడుతుంది. తన చేతుల్తో శార్వాణి ముఖాన్ని అల్లనల్లన మృదువుగా నిమురసాగాడు.

సొట్టలు పడిన మెత్తని బుగ్గలు... అవి పాలబుగ్గలని గుర్తు కొచ్చింది—

త్వరత్వరగా క్రిందకూ పైకి కదిలే కనురెప్పలు...... అవి ఏవో తీయని భావాలను వ్యక్తం చేయలేని అమాకయి మైన చూపుల్ని కలిగిన కన్నులని తెలుసుకున్నాడు.

గుండ్రని ముఖం... కార్తీక పౌర్ణమినాటి చంద్రు డున్నట్లుగా—

చిట్టి పెదవులు... మంకెన పూవులు విరగబూసినట్లు—

తీరైన ముక్కు... పున్నాగ పూవు పులకరించి నట్లుగా— గోవిందయ్య మనస్సులో శార్వాణి ఎంత సౌందర్య వతియో రూపొంద సాగింది.

"అలాంటి 'సౌందర్య శార్వాణి' వదనారవిందాన్ని కళ్లారా చూసి, పరవశుడయ్యే యోగ్యత తనకు లేకుండా పోయిందే!" అని బాధ పడ్డాడు.

అందుకే, తెల్లవారిందంటే శార్వాణితో ఆడుకోవటం అన్నా— మాట్లాడట మన్నా— గోవిందయ్యకు ఏదో భయమూ— ఎందుకో దిగులూ— ఏమిటో బాధ ముప్పిరిగొని నిలువెల్లా వణికిస్తూ క్రుంగతీస్తూ వుంటయి.

"ఈ బ్రతుక్కి ఇంతకన్నా అదృష్టం వేరే లేదేమో!" అని ఒక్కొక్కమారు నిర్ధారణ చేసుకునేవాడు.

శార్వాణి ఆటల్లో గనుక తాను పాల్గొనకపోతే వుషా రుగా ఆడుకోదు. సంతోషంగా కేరింతలు చిలిపిగా అల్లరి చేయదు. సరిగా అన్నం తినదు. ఇక ఎవ్వరితోనూ మాట్లా డక మునగ తీసుకొని వుంటుంది.

తల్లి మాట వినదు. తండ్రి వంక చూడదు. ఎవరెత్తు కుంటా నన్నా చంక ఎక్కదు చివరకు తన దగ్గరకూ రాదు. ఏదీ పగలగొట్టి నట్టుండదు. ఏ పుస్తకమూ చింపినట్టుండదు. ఇవన్నీ లేకపోతే యింట్లో సందడే వుండదు. ఏ సందడీ లేక పోతే యేమీ తోచదు.

లాలిస్తూ పిలిస్తే- "ఏడుస్తుంది."

"ఎందుకే ఏడ్పూ?"- అని ఎవరైనా అడిగితే తనని చూపుతుంది. బుల్లి బుల్లి మాటల్లో తన్ను నిందిస్తుంది. నే నేదో దుర్మార్గపు పని చేసినట్లు- తిడుతున్నట్టు వేలెత్తి చూపుతుంది.

"మా అమ్మగా ఏడ్వకే!" అంటే వినదు.

కొండమీది కోతిని తెమ్మన్నట్టు కోరికల్ని కోరు తుంది. తెచ్చేదాకా ఆ సమయంలో వూరుకుని వుండదు. ఉక్రోషంతో అందరిపట్ల విముఖత్వంతో వుంటుంది. ఆ స్థితిలో ఎవరైనా నోదారుద్దామనుకుంటే- పెద్ద పెట్టున ఏడుపు లంకించు కుంటుంది.

"ఊరుకోవే! మా అమ్మగా యేడ్వకూ! ఏం కావాలో చెప్పు. నే తెస్తాగా" అని ఎంత వూరడింపు కల్గించినా విని పించుకోదు. యేం చేయాలి? యేదో పాట పాడాలనిపించి పాడతాడు. వినదు. తన ఏడుపుని ఎక్కువ చేస్తుంది. ఇక తాతగావుండే శార్వాణికి ఏం చేయాలో తోచదు.

భగవంతు డిచ్చిన కళ్లు కాస్తా పోయిన తరువాత యే తాత మాత్రం తన మనుమరాలికి ఆట పాటల్లో చేదోడు వాదోడుగా వుండగలడు? యే విధంగా సరదా తీర్చగలడు...?

ఏ రూపంలో తృప్తిని కల్గించగలదు? గోవిందయ్య యింత వయస్సులోనూ సుఖాన్నే పొందుతున్నా, శార్వాణి విషయం తలపురాగానే రెట్టింపు బాధ హృదయాన్ని పిశిచి వేస్తుండేది.

శార్వాణి సౌందర్యవతే, కాని తనకు ఆ సౌందర్య శార్వాణి ఎలా వుందని నిర్ణయించుకోవటం? పోలికలన్నీ తన కుమారుడివేననీ, కోడలు కమల పురుడు పోసుకున్న నాటి నుండి చెపుతూ వస్తోంది. నిజమే కావచ్చు. లేకపోతే, తన కబద్ధం చెప్పవలసిన గతేం పడుతుంది కమలకి? తనకు కనిపించ నంత మాత్రాన సౌందర్యవతి కాకుండా వుంటుందా? శార్వా ణిని చూసిన ప్రతివాడూ యీ నాటివరకూ తన దగ్గరకొచ్చి నప్పుడు "మీ మనుమరాలు చాలా బావుంది. అన్నీ రఘు నాథం పోలికలే గోవిందయ్యా!" అంటూ వుంటారు. నిజమే... సౌందర్యవతిని అనకపోతే యింకొకర్ని ఎందుకంటారు?

గోవిందయ్యకు యిలా విన్నరోజుల్లో పట్టరానంత సంతోషాన్ని అనుభవిస్తూ.

"నా కలాగేమీ కనిపించదుగా! నా మనుమరాలు" అని తనలో తాను బెంబేలు పడేవాడు. ఒంటరిగా వున్నప్పుడు మనుమరాలి సౌందర్యం గూర్చి విన్న మాటలన్నీ ఆకళింపు కొచ్చి బావురుమని యేడ్చేవాడు— చంటివాడిలాగా. ఎవ రైనా చూస్తే ఏమన్నా అనుకుంటారేమోనని, మామూలు స్థితికి గబుక్కున వచ్చి, పై వుత్తరీయంతో కళ్ళొద్దుకునేవాడు.

మూడేళ్ళ మనుమరాలితో యీ ముసలి తనంలో ముద్దుగా— ముచ్చటగా కాలక్షేపం చేయలేక పోతున్నాననే

బాధ పడే పడే పరీక్షిస్తూండేది గోవిందయ్యను.

దృష్టిలేని నేత్రాంచలాలనుండి విలువ గల్గిన ఆనంద బాష్పాలు, ముడతలు పడి, గరుకుగా వున్న చెక్కిళ్ళ మీదుగా జాలువారుతూ వుండేవి.

శార్వాణికి, గోవిందయ్య హృదయాంతర్భాగంలో కడలి అలల్లాగా లేచి పడే మధుర మమతల పర్యవసానం ఆవేదనా విపంచికాస్వరగతులు అర్థం కాని స్థితిని కల్గి వున్నాయి.

అతని పరిస్థితి, శార్వాణికి అనూహ్యం- అనవసరం- అనన్యం- అగోచరం- అంతే. ఎంతగా ఎవరు ఆలోచించినా తేలనిది కూడా అంతే. వాస్తవంగా కూడా అంతే...

శార్వాణి కోరికను తీరుస్తూ, గోవిందయ్య రఘునాథం చేత ఒక రబ్బరు బొమ్మను తెప్పించి యిచ్చాడు.

క్రొత్త బొమ్మను చూడగానే, పాత బొమ్మలా లాగా నిల్చుంటుందో లేదో చూడమని గోవిందయ్య దగ్గరకొచ్చి—

"ఆ బొమ్మలాగా యీ బొమ్మనూ నుంచో పెట్టవూ తాతయ్యా"- అని దీర్ఘం తీస్తూ అడిగింది.

గోవిందయ్యకు యిలా మళ్ళీ బెడదవచ్చి పడతుందను కోలేదు. ఎలాగైనా సరే శార్వాణిని మభ్యపెట్టుదామని ఎంతో ప్రయత్నించసాగాడు. అంతలోనే చూపున్న తాతయ్య లాగా నటించి బొమ్మను నిలుపుదా మనుకున్నాడు— ఆశ చివురాకు తొడిగినట్లయింది.

యేదీ... బొమ్మన్నాడు.

శార్వాణి యివ్వకుండా వెనక్కి లాక్కొని—

"నేను ముందునుంచో పెడతా. తరువాత నువ్వు తాతయ్యా"- అంది- కళ్ళు పెద్దవిచేస్తూ. కాస్త తీరుబడిగా శ్వాస పీల్చుకున్నాడు. ఇదే సమయ మనుకొని, శార్వాణిని మరిపిద్దా మనుకున్నాడు.

"నువ్వాడుకో అమ్మా! నేను యిలా కూర్చొని చక్కగా నీ కిష్టమైన పాటలు పాడుతా" అని గొంతెత్తాడు... తీయగా... మధురంగా... శార్వాణి ఆ పాట వింటూనే, యింకో బొమ్మ చేతి కిచ్చింది గోవిందయ్యకు—

చేతికి బొమ్మ తగలంగానే, కంఠంలోని గానానికి వణు కొచ్చింది. పాటకు మెలికలు యేర్పడ్డయి.

గుండెకు దిటవు తనం తగ్గింది, అయినా పాడుతూనే వున్నాడు గోవిందయ్య.

శార్వాణి చటుక్కున తన చిట్టి అరచేతుల్ని గోవిం దయ్య నోటికి అడ్డు వుంచుతూ—

"ఎప్పుడూ పాత పాటలేనా తాతయ్యా" అంది విసుగ్గా.

ఆ మాటకి గోవిందయ్య హతాశుడైనాడు. నిజమే తను పాడే పాట పాతది కాకపోతే ఎందుకలా అంటుంది. సత్యం తెలుసుకుంది.

శార్వాణిపట్ల అన్యాయం చేశానను కున్నాడు. అమా యకమైన అభిలాషను మభ్య పెట్టాలని ప్రయత్నించా నను కున్నాడు. తన తప్పు తనకి తెలిసి, ఎదురు తిరిగింది. గోవిం దయ్య వోడి పోయానని నిశ్చయించుకున్నాడు. జీవితపు ఒడు దుడుకుల్లోనూ— బ్రతుకు భారంలోను తల మున్కలువేసి అనుభవించిన ఎన్నో అనుభూతుల్ని పొందిన తను, ఒక పసి

పాప హృదయాకాంక్షను తీర్చలేక, తప్పుకుంటానికి దారి చూసుకోవటం తనపట్ల ఎంత అవమానమో! గోవిందయ్యకు తిట్టుకుంటున్న కొద్దీ వూరుతోంది.

శార్వాణి ఆ రోజల్లా యేడుస్తూనే వుంది. గోవిందయ్య క్రొత్త బొమ్మని నిల్చోబెట్టలేక మంచంమీద పడుకున్నాడు. అతని చెవుల్లో—

శార్వాణి మాటల మాధుర్య ధ్వనులూ- అల్లిబిల్లి పాటల తీయని స్వరమూ- కోపంతో చేరిన రోదన రాగమూ- కిలకిల నవ్వుల స్వరమూ- విరామ మెరుగకుండా మ్రోగుతున్నవి. అలాంటి శార్వాణిని చూడలేక యేడ్చేవాడు—

ఇంతలో కమల వచ్చి- "ఎందుకూ యివాళల్లా యేడుస్తూన్నావ్? యేం కావాలే"— అంది ఆ నాడు. పడుకొని వున్న గోవిందయ్యకు కళ్ళు చెమర్చినయి. కమల చూస్తే కుంగిపోతుందేమోనని చిటికెన వ్రేలితో రాలిన నీటి బిందువుల్ని తుడిచేసుకున్నాడు. అంతలో రఘునాథం వస్తే, తన స్థితికి విచారపడతాడేమోనని ముఖాన్ని గోడవైపుకి తిప్పుకున్నాడు. తన బాధలో కొడుకు కోడలికి భాగం యివ్వటం యిష్టంలేక గుండెలోనే రేగిన గాయాన్ని అదుముకొంటున్నాడు.

అన్ని సుఖాలూవున్న గోవిందయ్య జీవితంలో అభిప్రాయాలకూ— అభిలాషలకూ అంతస్థులు యేర్పడే వున్నాయి.

అన్ని అనుభూతులుగా గోవిందయ్య హృదయానికి ఆనందంగా హాయిని యిస్తున్నాయి. కాని... యేం లాభం?

మూడేళ్ళ ముద్దుల మనుమరాలి ముఖం చూడలేని దురదృష్టం తాను కల్గివున్నప్పుడు... యేం వుపయోగం?

శార్వాణి చిలిపి చేష్టలకీ, చిన్నారి పొన్నారి చిట్టి మాటలకి బదులు పల్కుతూ— సరదాగా వుంటూ— పారవశ్యం పొందలేనప్పుడు......

ఎందుకు యివన్నీ... అవును... నా కెందుకూ? గోవిందయ్య నిరాశాపూరిత హృదయంతో— శార్వాణిపట్ల బెంగతో— యిప్పటికి దాదాపు పదిహేను రోజుల్నుంచి మనో వ్యాధితో మంచానికి అతుక్కుపోయి వున్నాడు.

కొడుకూ— కోడలూ శక్తి వంచన లేకుండా ఉప చారాలు చేస్తూ వస్తున్నారు...

హృదయ పూర్వకంగా ఓదారుస్తున్నారు. గోవిం దయ్య వాటిని వింటూ— ఒకనాడు కమలతో—

"చూడు కమలా! ఆ భగవంతుడు నాకు చూపు లేకుండా చెయ్యటం యీ స్థితిలో మెచ్చుకోవలసిందే సుమా! తల నెరసింది. లోకం మారిపోయింది. ఈ ప్రపంచంలో చెడుకి శీర్షికలు అనేకం. ఈ లోకం బొత్తిగా పాడైంది. నీచానికి తావున్న యీ జగత్తులో నే నిలా వుండటం నా హృదయా నికి ఎంత హాయిగా వుందో తెలుసా. మా కాలంలోవున్న నీతి- న్యాయం- ధర్మం- పరువూ యిప్పుడు లేవు. పూర్తిగా నశించి నయి. అందుకనే కళ్ళున్న వాడికన్నా కళ్ళు లేనివాడు వాస్త వికతగల జీవితాదర్శాన్ని- ధర్మాన్ని నమ్మడానికి ఎంతో ఆస్కారముంది."

మామగారి మాటలు వింటున్న కమలకు సరోజ

నేత్రాలు చెమ్మగిల్లినయి. చరమదశలో సత్యాన్ని చెప్పు తున్నట్లుగా వుంది- ఓపిగ్గా వింటోంది. శార్వాణి మాత్రం తల్లి ఒడిలో కూర్చొని తాతగారి మాటలు ఎంతవరకు వాస్త వికమో అన్నట్లు వినసాగింది. మధ్యమధ్యా చిరునవ్వులు- బుల్లి బుల్లి మాటలు ఆ గదికి కాంతినిస్తున్నయి.

"కమలా! నే నిలా అంటున్నానని నీ కేం భయం లేదుగా. ప్రాచీన కాలాన్ని నమ్ముకున్న నా హృదయం యీ నాటి నాగరికతను అర్థం చేసుకోలేదు. జీవితం ఎంతవరకు మిథ్యా వాదాన్ని బలపరుస్తుందో యీ కాలంలో నిర్ణయించు కోవచ్చు. తేలిగ్గా నిర్వచించ వద్దు.

అసలు నా జీవితానికీ దశ భగవంతుణ్ణి సేవించటం కోసం మిగల్చబడి వుంది. కళ్లుంటే, అరి షట్వర్గాలకు అంకిత మవుతుందేమోననీ, తన్ను మరచి తనలో తాదాత్మ్యం పొందకుండా పోతానేమోననీ, భగవంతుడు యీ పాడు లోకాన్ని చూడనివ్వకుండా నన్ను గ్రుడ్డివాణ్ణి చేసి, తాను చంటిపాపై, నా ఒడిలో ఆడుకుంటూ వుంటోంది. నా గుండెలో ఏదో తేజస్సు, ఒక అద్భుతమైన రూపం వెనుక కాంతిని విర జిమ్ము తోంది" ఆ మాటకి కమల, శార్వాణిని గుండెకు హత్తుకొని ముఖంలో ముఖంపెట్టి ఆనంద బాష్పాల్ని రాల్చింది.

"నన్ను అద్వైతంగా మారుస్తోంది. ఏదో ఒక మమ కారమైన భావం. దాన్ని విడమర్చి నోటితో చెప్పలేను. కమలా! నా 'శార్వాణి' ఆ భగవంతుని రూపు రేఖా విలా సాలు. తెలుసా!" ఇలా- గదిలో గోవిందయ్య బృందావన సంచారిని స్తుతిస్తున్నాడు తనలో తాను. శార్వాణి హృద

యంలో కిలకిలమంటూ నవ్వి ఎత్తుకో మంటోంది. బొమ్మని చూడ మంటోంది.

శార్వాణి పిల్చి, పిల్చి, విసుగెత్తి లేచి, గోవిందయ్య వద్దకు వెళ్ళి— మంచానికి జారగిల పడుతూ—

"తాతయ్యా"— అంది. గోవిందయ్య "వూ" అంటూ చేతుల్తో తడిమి శార్వాణిని దగ్గరగా తీసుకొని, "శార్వాణీ!"— అన్నాడు ముద్దుగా.

కమల ఆ దృశ్యాన్ని చూసి కన్నులొత్తుకుంటూ,

"తాతయ్య పిలుస్తున్నారు... వూ అను శార్వాణి" అంది.

"శార్వాణి" అన్నాడు గోవిందయ్య మళ్లా కొంచెం సంతోషంతో— తడారిపోయిన పెదవులతో... శార్వాణి, గోవిందయ్య గుండెలమీదకు వాలుతూ—

"తాతయ్యా! బొమ్మ నుంచుంది. వచ్చి చూడవూ" అంది. ఎంతో వుత్సాహం ఆ మాటలో మూట కట్టబడింది.

"తప్పకుండా వస్తాగా" అన్నాడు.

కమల ఒక్కసారి ఆ బొమ్మకోసం వసారాలోకి చూసింది.

"బొమ్మ నిల్చునే వుంది. మహారాజైన ఒక చందనపు బొమ్మ పురుషాకృతిలో నిల్చుని వుంది."— రఘునాథం యింకా రాలేదు.

కమల సంధ్యదీపం వెలిగించింది. చీకటి పురి విప్పతూ వుంది. శోకం తిరుగాడబోతోంది. అప్పటికి గోవిందయ్యను శార్వాణి నాల్గుసార్లయినా పిల్చి వుంటుంది"— వచ్చి నిల్చున్న

బొమ్మని చూడమని.

గోవిందయ్య వినిపించుకున్నా ప్రయోజనం లేదుగా.

అందుకని, "తాతయ్య రావటం లేదని" ఏడవటం మొదలెట్టింది శార్వాణి.

సౌందర్య శార్వాణి మారాముచేస్తూ ఏడ్వసాగింది. కమల సముదాయిస్తూనే వుంది— "వద్దని"

"మా అమ్మగా యేడ్వకూ!" అంటూ గోవిందయ్య అనగల్గుతున్నాడే గాని, లేచి రాలేక పోతున్నాడు.... లాభం లేదని తెలుసు కాబట్టి.

సంధ్య దీపపుకాంతిలో నిల్చున్న మహారాజు చందనపు బొమ్మ నీడ పొడుగ్గా పడుతోంది. దాని వయస్సు ఎనభై సంవత్సరాలు వుంటయ్యేమో!

గోవిందయ్య శార్వాణిని సముదాయించటంలో ఎన్ని సార్లన్నా "మా అమ్మగా యేడవకూ!" అనేదే ధ్వనిస్తోంది. బలహీనతవల్ల దగ్గుతెర కూడ వచ్చింది.

కమలకు గుండెలు జలదరించాయి.

రఘునాథం ఆదరా బాదరాగా వస్తూ వసారాలో నిల్చున్న మహారాజుని ఫెడీమని తన్నాడు. 'మహారాజు చందనపు బొమ్మ వెళ్ళి ఎక్కడో మట్టిమీద దొరిగి పడింది.

"నా బొమ్మని నాన్న తన్నాడే" అని యింకా దగ్గరకు తీసుకొని రొమ్ముకి హత్తుకొంది.

రఘునాథం వచ్చిరావటంతో ఆ వాతావరణాన్ని అర్థం చేసుకొని, గోవిందయ్యకు దగ్గరగా కూర్చొని, "నాన్నా" అన్నాడు.

గోవిందయ్యకు అప్పటికే గొంతు బిగుసుకొని పోయింది.

రఘునాథం ఆదుర్దాగా "నాన్నా" అన్నాడు.

పిచ్చిగా అతని గొంతుని ఆ గదిలోని మహారాజు గోవిందయ్యా జీవితం వినిపించుకోలేదు.

శార్వాణి మాత్రం గోవిందయ్యని యింకా చూడమంటోంది. "మహారాజు చందనపు బొమ్మని"

ఒక్కసారి రఘునాథం శార్వాణిని చంకలోకి తీసుకొని 'శార్వాణీ!' అని గుండెకు అదుముకున్నాడు.

కమలకు కన్నీరు ధారా వాహినిగా స్రవిస్తోంది. ఆ గదిలో మాత్రం యింకా గోవిందయ్యా శార్వాణిని ఓదారుస్తూ—

"మా అమ్మగా యేడ్వకూ!" అన్నట్టుగా వుంది. ఆ నాటితో, ఆ గదికి గోవిందయ్యా జీవితపు తెర జాలిగా— దీనంగా— మెల్లగా పడింది.

# తనలో తాను

"చచ్చి పోయింది."

"ఎవరూ?"

"జానకి చచ్చిపోయింది."

"చచ్చి పోయిందా!"

"అవును, జానకి వెధవ చావు చచ్చింది!"

"వెధవ చావు చచ్చిందా!"

"వూరి బయట మోటబావిలో పడిచస్తే, వెధవ చావు గాక మరేమవుతుంది."

"జానకి చివరకు యిలా వెధవచావు కోరుకొన్నదా!"

"యేం చేస్తుంది? చావక- యింకా నయం, అసలు యింట్లోనే దూలానికి వురివేసుకొని చద్దామని ప్రయత్నించింది. ఎందుకో ఆగిపోయి, తుదకు మోటబావికి దారి తీసింది."

"నా కేమో నమ్మకంగా లేదు సుమా!"

"యింకా చావలేదనా?"

"జానకి యెంత మంచిపిల్ల. యిర్వైయేళ్లు కూడా దాట

లేదు. పట్టుమని పది సంవత్సరాలు కూడా కాపురం చేయ లేదు. సంసార సుఖం అనేదే మాత్రం పొందలేదు. అటువంటి జానకికి యిలాంటి చావు సంప్రాప్తించిందంటే, నా కెందుకో నమ్మకం కుదరటం లేదు."

"నాకు మాత్రం మొదట్లో అలా లేదంటావా! చాలా సేపటివరకూ యెవరీ మనిషన్నది గుర్తుకే రాలేదు. యెంతో సేపు ఆలోచించాను. యెక్కడో చూసినట్లు జ్ఞాపకం బుర్రలో మెదలడం మొదలు పెట్టింది. పరీక్షలో చూస్తూనే, నా కర్తవ్యం ప్రకారం నేను చికిత్స చేసాను. అప్పటికీ వ్యక్తి యొక్క సహజ స్వరూపం, నీళ్ళు త్రాగడం చేత పూర్తిగా మారిపోయింది. కాని, నా విధి నేను చేసిన తరువాత జానకి శవం వెళ్ళిపోయింది. వెళ్ళిన గంటదాకా యేదో సన్నిహితత్వం నా హృదయంలో మెలికలు తిరగటం మొదలు పెట్టింది. చివరకు 'జానకి' అనే నిర్ధారణ చేసుకొన్నాను."

ఈ కళ్ళతో యెన్నోసార్లు చూస్తూ జానకికి బ్రతికి వున్న రోజుల్లో మందు లిచ్చాను. ఆమెను చూస్తూంటే నా కేదో ఆమె రక్త సంబంధమైన వ్యక్తిగా భావన కల్గేది. అందరి రోగులకంటే, జానకిని ముందుగా చూసి, సరియైన మందు యిచ్చి, పంపేదాన్ని. ఆమె నవ్వుతుంటే తన కామె కానుకగా యిచ్చేది యీ లోకంలో ఆ నవ్వొక్కటే నేమో అనిపించేది."

"ఇప్పుడా జానకిని నువ్వూ, నేనూ యెంత స్మరించినా యేమిటే లాభం! చచ్చిపోయిన జానకి మళ్లా వస్తుందా చెప్పు! ఆమెలాగా నవ్వుతూ, నీ హృదయానికి ఆనందాన్ని

యిచ్చేది యిక యెవ్వరూ లేరని నువ్వు యెన్నిసార్లు అనుకొన్నా జానకి బ్రతికి రాలేదుగా!"

"జానకి నూతిలోపడి చచ్చిపోయినా, ఆమె సౌందర్య రూపం నా హృదయంలో అచ్చుగుద్దినట్లుగావుంది. ఆ చివర్నవ్వు నా హృదయాంతరాళంలో యింకా కిలకిలమని మసలుతూనే వుంది."

"జానకిని గురించి నాకు తరువాత, తరువాత తెలిసింది. ఎవరీ జానకి? అనేది క్రమేపీ నాకున్న ప్రశ్న కరిగిపోయింది. జానకిలాంటి యువతులు యెంతమంది యీ లోకంలో అష్టకష్టాలనుభవించి, జీవితంమీద రోతపుట్టి, ఆత్మహత్యలకు గురి అవుతున్నారో తెలియక పోలేదు. తెలిసినా వాటిని గురించి విని, యేదో కాసేపు సానుభూతిగా విచార పడటమే సంభవిస్తుందిగాని, పదేపదే తల్చుకొని, బాధపడటం జరగదు. జానకి విషయంలో అలా వుండరేం ఆమె కన్నుల్లో నవ వసంత విరికన్నెలు విచ్చుకొనేవి. ఆమె మాటలో తేనెవాక లూరి, స్రవించేవి. ఆమె నవ్వులో– ఆమె నడకలో– యేదో నాదం నినదించేది– జానకి జీవితం నన్ను కలచివైచినంతగా మరేదీ యింతవరకూ కలత పరచలేదు."

"జానకి బాగా ఆస్తిపాస్తులున్న జగన్నాథం యింట్లో పుట్టింది. చదువుకూడా ఒక మాదిరిగా నేర్చుకొంది. జగన్నాథానికి జానకి పెద్దకూతురు అవటంతో, పెళ్ళీడు కొచ్చేటప్పటికి, మంచి సంబంధం కోసం వెతకసాగాడు. చివరకు యెలాగైతేనేం, పాతికెకరాల భూమివున్న ఒక కుటుంబంలోని శ్రీనివాసరావుకి, జానకిని యిచ్చి మహావైభవంగా వివాహం

చేసాడు.

శ్రీనివాసరావు, జానకియొక్క సౌందర్యానికి వెల కట్టలేక కట్నం- కానుకలు వొద్దని చెప్పాడు. శ్రీనివాసరావు తల్లిదండ్రులు కూడా పెద్దగా కట్నం గురించి పట్టించుకోక వూరుకుండి పోయారు.

కొన్నాళ్ళు రోజులు బాగానే దొర్లి పోయాయి. జానకి శ్రీనివాసరావుతో కాపురం చేయడానికి వచ్చింది. శ్రీనివాస రావు, తన జీవితమంతా జానకిదే అన్నట్లు భావించి, యెప్పుడూ ఆమెతో కాలక్షేపం చేస్తూండేవాడు. జానకి వచ్చిన రెండో సంవత్సరంలో ఆ వూరికి కలరా అంటువ్యాధి వచ్చి, శ్రీనివాసరావు తల్లిదండ్రుల్ని యే లోకాలకో తీసికొని పోయింది. శ్రీనివాసరావు చాలా రోజులు, జీవితంమీాద విరక్తి పుట్టి, దిగాలుపడుతూ అదోలా ప్రవర్తించుతూ, జానకితో యెక్కువగా కాలక్షేపం చేయకుండా వుంటూ వుండేవాడు.

జానకి యెన్నోసార్లు శ్రీనివాసరావుని ఓదార్చింది. తాత్కాలికంగా శ్రీనివాసరావు వూరుకోగలేవాడు.

ఆ సంవత్సరం శ్రీనివాసరావు చేస్తున్న వ్యవసాయం కుంటుపడి, ఆదాయం తగ్గింది. ఆ సంవత్సరమే గొడ్లపాక తగు లడి రెండు పాడిగేదెలు, ఒకయెద్దు చచ్చిపోయాయి. ఆ దెబ్బతో శ్రీనివాసరావుకి తల తిరిగి పోయింది. సంసారమంటే విసుగు పుట్టింది. వున్న పొలంలో చాలావరకు అమ్మి తల్లి దండ్రులు చేసిన అప్పులు- తను చేసిన అప్పులు తీర్చాడు. పోతే ఒక్క యెకరం మాత్రం శ్రీనివాసరావు మొగంచూస్తూ

వుండి పోయింది.

ఒకనాడు జానకికి తన కుటుంబ పరిస్థితి మరీ దారుణంగా కనిపించింది. యిదివరకటి మాదిరిగా శ్రీనివాసరావు యింటికి రావడంలేదు. పనులమీద అశ్రద్ధ ప్రబలి పోయింది.

ఆ రోజు అర్ధరాత్రి దాటింది. శ్రీనివాసరావు, దగ్గరగా వేసివున్న యింటి తలుపుల్ని త్రోసుకొచ్చి, ప్రక్కనేవున్న మంచంమీద కుప్పలా కూలిపోయాడు.

అప్పుడే పడుతూ పడుతూవున్న నిద్రను ప్రక్కకుత్రోసి జానకి చివాల్నలేచి, శ్రీనివాసరావు దగ్గర కొచ్చింది.

అతను మూల్గుతూ, చెరిగిన తలతో చెమటూరిన బట్టలతో, జిడ్డుగారుతున్న మొగంతో, వెలుగుతున్న చిమ్నీ వెలుగులో జానకికి భయంకరంగా కనిపించాడు.

మంచం క్రిందవున్న మంచినీళ్లు కాసిని మొగంమీద చల్లి— "యేమండీ! అలా వున్నారు" అని మెల్లిగా అడిగింది.

శ్రీనివాసరావు యేమీ జవాబివ్వలేదు.

దగ్గరగా కూర్చొని, అతని మొగంమీద పడ్డజుట్టుని ప్రక్కకు త్రోస్తూ—

"యేమండీ! మిమ్మల్నే! యేమిటలా వున్నారు" అంది.

శ్రీనివాసరావుకి కొంచెం స్పృహవచ్చి కళ్ళుతెరచి చూశాడు. జానకి, తనమీదకు వాలివుంది. దొడ్లో పూచిన మల్లెపూవులు ఆమె తల్లో తెల్లగా నవ్వుతూ, మత్తుగాలిపే వాసనను వెదజల్లుతున్నాయి.

శ్రీనివాసరావు చటుక్కున లేచి, "అచ్చంగా బోగం పిల్లలాగా తయారయ్యావ్! యీ పూట యేమిటే విశేషం?"

అని కర్కశంగా అడిగాడు.

జానకి త్రుళ్ళిపడింది. అతని చూపుల్లో అగ్నిజ్వాలలు, సెగలు చిమ్ముతున్నయి- నోటినుండి దుర్గంధ భూయిష్టమైన వాసనవచ్చి, శ్రీనివాసరావు చేసిన పనిని తెలియపర్చింది.

జానకికి ఒక్కసారి ముచ్చెమటలు పోసినయి. యేం మాట్లాడలేక పోయింది. దగ్గరగా జరిగి- "అన్నం తినరూ"- అంది.

"నువ్వు తిన్నావ్‌గా! చాల్లే! నా కాకలిలేదు. కడుపు నిండా కమ్మని చుక్కవుంటే యింకా అన్నం దేనికీ!" శ్రీనివాసరావు ముద్దుగా మాట్లాడుతూ, జానకిని కలవరపెట్టాడు.

జానకికి ఒక్కసారి గుండెలోంచి దుఃఖం పొర్లివచ్చింది. "యేమిటీపని"- అని అడగలేక పోయింది. స్నానం చేసి వుదికిన బట్టలు కట్టుకోమని చెప్పడానికి కూడ జంకు పడింది.

ఆ రాత్రి శ్రీనివాసరావు అలాగే నులక మంచంమీద పడుకొన్నాడు.

జానకికి మాత్రం నిద్రపట్టలేదు. యేదో విషయాన్ని పునశ్చరణ చేసుకుంటూ యేడ్వసాగింది. తల్లో మల్లెపూవులు, తలదిండు వొత్తిడికి వసివాడి, నలుపెక్కినయి.

ఆ సంవత్సరమంతా శ్రీనివాసరావువల్ల హృదయానికి శాంతిలేక, యెదురు చెప్పలేక వూరుకుండి పోయింది. వున్న ఆ ఒక్కయెకరం అమ్మేసి, త్రాగుడికి, చీట్లపేకకి తగలేశాడు.

జానకికి శ్రీనివాసరావు పరిస్థితి భరించలేనంత ఘోరంగా కనిపించింది.

ఒకసారి శ్రీనివాసరావు ఒంటరిగా కూర్చొని, చుట్ట

కాలుస్తుండగా, జానకి దగ్గరగా వెళ్ళి నిల్చుని, దీనంగా, సంసారాన్ని గురించి చెప్పటం మొదలెట్టింది.

శ్రీనివాసరావు విన్నట్లే విని, వుగ్రుడై, "నీ మూలంగానే నా జీవితమంతా నాశనమై పోయింది. తల్లిదండ్రులు నువ్వు పాదం పెట్టంగానే చచ్చిపోయారు. ఆస్తి అంతా చెల్లా చెదరైంది- నా శరీరమంతా అనారోగ్యంతో తయారైంది- నువ్వు యేదో నన్ను బాగుచేస్తావు గదా! అని వూహించి పెళ్ళి చేసుకున్నా- కట్నం కానుకలు లేకుండా!" అని దెప్పి పొడిచి మాట్లాడాడు.

జానకి ఒక్కసారిగా పిడచకట్టుకొని పోయింది. యింతటి అభాండం తనమీద పడుతుందని యెన్నడూ వూహించలేదు. కట్నం కానుకలు తీసుకోక ఆదర్శవాదిగా వున్న శ్రీనివాసరావు చటుక్కున, తీసుకోవాలనే భావనకు దాసుడై పోయాడని గ్రహించింది. కుటుంబ పరిస్థితియొక్క వాస్తవాన్ని తెలిసికొన్న జానకికి, శ్రీనివాసరావు కోరిక తేటతెల్లమైంది.

"పోనీ అలాగే మా నాన్ననడిగి కట్నం యిప్పించుతాన్లెండి" అంది.

జానకి ముఖంలోకి శ్రీనివాసరావు అదోలా చూస్తూ- "యిప్పుడివ్వాకేం మీ నాన్న! అంత తెలివి తక్కువవాడా! ఒకవేళ యిస్తే నన్ను వెళ్ళి తెచ్చుకోమంటావా! మొదట్లో వొద్దన్నవాణ్ణి, యే మొగం పెట్టుకొని వెళ్ళి, మళ్ళా కట్నం తెచ్చుకోను... నీకు సిగ్గులేకపోతే, నాకు లేదంటావా!" అని వుక్రోషంతో యెడాపెడా అనేసాడు. జానకి బిత్తరపోయింది.

"మిమ్మల్ని వెళ్ళి తెచ్చుకోమంటానా! మీరు కావాలని అంటే నేనే వెళ్ళి తెచ్చిపెడతా. మన కష్టాల్ని చెప్పుకొని యెలాగైనా తెస్తా. యివ్వననే వ్యక్తి కాదు కాబట్టి మా నాన్న తప్పకుండా యిస్తాడు. నిజంగా తెమ్మంటారా!" జానకి అనునయంగా అడిగింది. శ్రీనివాసరావు, జానకిని పరీక్షగా చూస్తూ, "నేను కావాలని అనకపోతే, సంసారం స్థితిగతులు తెలిసినదానివి, కావాలో- అక్కర్లేదో నీకు తెలియదా! నీ యిష్టం వచ్చినట్లు చెయ్యి! నేను మాత్రం కాదనను." అని గోడమీద పిల్లి వాటంగా మాట్లాడాడు.

జానకి ఆ మాటకే తృప్తిపడి జగన్నాథానికి మర్నాడు కబురు పంపింది.

ఆ కబురు విన్న జగన్నాథం కంగారుపడి- కొంతసేపటికి తమాయించుకొని అయిదువందలు ప్రస్తుతానికి పంపాడు.

శ్రీనివాసరావు ఒక మాదిరిగా తృప్తిపడి "యింతేనా" అని జానకి మొగంలోకి చూసి, మూడువందలు తీసుకొని గవర్రాజు పాకలోకి వెళ్ళి చీట్లపేకలో తగలేసి, ఒకచుక్క వేసి వచ్చాడు ఆ రాత్రి రెండు గంటలకి.

మిగతా రెండువందల్లో కొంతవరకు యింట్లో దినవెచ్చపు సరుకుల్ని కొన్నది జానకి.

మర్నాడు మళ్లా డబ్బు కావాలన్నాడు శ్రీనివాసరావు.

జానకి వెర్రి మొగంవేసి, మిగతాది కూడా చేతిలో పెట్టింది.

శ్రీనివాసరావు చివ్వున లేచిపోయి, ఓడిపోయిన రాతులాగా ఆ మర్నాడు గంటవేళ వచ్చాడు.

జానకి పెట్టిన అన్నం తిన్న తరువాత "మల్లా! డబ్బు కావాలి" అనడిగాడు.

జానకికి ఆశ్చర్యం వేసి "నిన్న- మొన్నా యిచ్చింది యేం చేసారు" అనడిగింది.

యిలా అడగడమే తప్పొచ్చింది శ్రీనివాసరావుకి.

ఆ పళాన చడామడా తిట్టాడు. జానకి రెండు మూడు సార్లు ఎదురు జవాబు లిచ్చింది.

దానికి మహోగ్రుడై శ్రీనివాసరావు ఆమెను కొట్టాడు. తీవ్రంగా కొట్టాడు. జానకి తాళుకోలేక యేడ్చింది.

రోజు రోజుకి శ్రీనివాసరావు పోరు యెక్కువ వటంతో, జానకి మనసు కల్లోలితమై, శరీరమంతా దెబ్బలకు గురవుతూ వుండేది.

జగన్నాథానికి తన బాధను వ్యక్తం చేద్దామని కొన్నాళ్ళు ప్రయత్నించింది.

కాని తనలో తానే యెందుకో భయపడి "మొగుడు కొ ట్టే పుట్టింటి వారికి తెలియచేయడం చాలా తెలివితక్కువ తన మనిపించు కొంటుందని" భావించికొని శ్రీనివాసరావు చేసే ప్రతి కార్యానికి గురికాక తప్పటం లేదు.

శ్రీనివాసరావు శ్రుతిమించి రాగానపడి, మానవత్వాం నశింప చేసుకొని, స్వార్థపరుడై- జానకిని నా నా హింసలు పెట్టసాగాడు.

జానకి వాటనిటికి తలవంచి అనుభవించ సాగింది. ఒక నాడు శ్రీనివాసరావు విపరీతంగా పెచ్చరిల్లి పోయి, డబ్బు తెమ్మని గోల చేసాడు. జానకి చెప్పుకొంది-

"మా నాన్న దగ్గర ప్రస్తుతంలేదుట- కొన్నాళ్లాగిన తర్వాత పంపుతా నన్నాడు." అని.

శ్రీనివాసరావు ఆ రోజున జానకి శరీరం రక్తం కక్కేటట్లు కొట్టాడు. యిదివరలో కొట్టిన దెబ్బలకి ఆస్పత్రిలో మందు వేయించుకొంటూ వుండేది. ఈ సారి తగిలిన దెబ్బలికి జానకి స్థిమిత హృదయం కదిలింది. గడచిపోయిన రోజుల్లోని బాధల్ని తల్చుకొంది. బోరుబోరున యేడ్చింది. తన పెళ్ళయిన కొత్త రోజుల్లోని మాధుర్యాన్ని పదేపదే తల్చుకొంది. అప్పటి శ్రీనివాసరావుకి తేడా తల్చుకొని యేడుపుని దిగమ్రింగలేక పోయింది.

మనసులోనూ- మనిషిలోనూ వ్యత్యాసం బాగా కనిపించింది. భర్తకు దడిసి, పుట్టింటికి పారిపోదామని కాసేపు అనుకొంది. అది తనపట్ల భావ్యం కాదని నచ్చచెప్పుకొంది.

ఆ రోజు మళ్లా శ్రీనివాసరావు యేదో అభూత కల్పన వొకటి చేసి, జానకిని మరింత నిరాశా భావానికి తోడ్పడేలాగు చేసాడు.

"ఇంటి పాలేరుతో సరసాలాడుతోందని, శ్రీనివాసరావు ఆ దృశ్యం చూసానని" అనటంతో జానకి హృదయం మరింత గగ్గోలుపడి జీవితంమీాద విరక్తి సృష్టించుకొంది. యీ యింట్లో తన కెలాంటి స్థానం లేదని ఖచ్చితంగా తేల్చుకొంది. శ్రీనివాసరావువల్ల యావజ్జీవితం సుఖపడనని నమ్ముకొంది.

దెబ్బలవల్ల శరీరమంతా నొప్పులతో వేధించుతోంది. యే పని చేయడానికి ప్రయత్నించలేక పోతోంది. యిలాంటి

స్థితిలో, "పాలేరువానితో తను చేసినపని జ్ఞాపకం వచ్చింది." యిందులో నిజం భగవంతుడికే తెలియాలి. అన్యాయం-అక్రమం యెల్లకాలం నిలబడవని తెలుసు. తనకీ- పాలేరుకి సంబంధం యే విధంగానూ లేదు. యీ మాట జానకి చెప్పితే యెవరు వింటారు? లోకం యెలా నమ్ముతుంది.

జానకి ఆ రాత్రి కుమిలి కుమిలి యేడ్వసాగింది. సగం రాత్రి జరిగింది. శ్రీనివాసరావు వూళ్లోనుంచి యింకా యింటికి రాలేదు. ఒక్కసారి యిల్లంతా కలయచూసింది. కొత్తచీర, కట్టుకొంది. నుదుట కుంకుమ పెట్టుకొంది. దొడ్లో పూసిన రెండుమల్లె మొగ్గల్ని తల్లో తురుముకొంది. వసారాలోవున్న దేవుళ్ళ పటాలకు వంగి నమస్కారం చేసి, మళ్లా ఒక్కసారి యిల్లంతా కలయ తిరిగి మనస్సులో శ్రీనివాసరావుకి భక్తి వినమ్రురాలై నమస్కరించి, అతని ఘోరబాధలకు, లోకపు నిందలకు స్వస్తి చెప్పుతూ, వూరిబయట మోటబావికి దారి తీసింది. బావి సమీపిస్తున్న కొద్ది, జీవితం విలువ పెరగ సాగింది. ఆ విలువకు గౌరవం యివ్వకుండా జానకి శరీరం-హృదయం- మానవత్వం- నీళ్ళ అడుగుకి మునిగి పోయినవి.

తెల తెలవారు తూండగా తేలిన జానకి శరీరం చూస్తూ, వెలుగుని దాచుకొంటున్న నక్షత్రాలు కడసారిగా నిర్వేదించి, సూర్యుని కిరణాలకు మటుమాయమైనయి. ప్రాణాలు మాత్రం మరో జీవిలోకి ప్రవేశించినయి. ఒక స్త్రీ పురుడు పోసుకొంది. ఆ రోజు సాయంకాలానికి జానకి శవం ఆస్పత్రికి 'పోస్టుమార్టం'కి వచ్చింది. యథావిధిగా శస్త్ర చికిత్స పూర్తయిన తరువాత జానకి శవం ఆస్పత్రి ఆవరణ

దాటి వెళ్ళిపోయింది.

వెళ్ళిన తరువాత జానకి యెవరో డాక్టరు పద్మకి బాగా గుర్తుకొచ్చింది. జగన్నాథంకి గుండెలో పెద్ద కూతురు పిల్చి "నాన్నా" అన్నమాట కలుక్కుమంది. జానకి మరణానంతరం పద్మ తనలో తాను వాక్చిత్రం చెప్పుకొంటూ, ఆ నాటిరాత్రి నీలి నీలాకాశంలో, మినుకు మినుకుమంటూ మెరిసిపడే నక్షత్రాల్లోకి చూస్తూ, "పాపం! జానకి కూడా అలా నక్షత్రాల్లో ఒక్క నక్షత్రమై వుండిపోతే యెంత బాగుంటుంది"- అని నిర్వేదించింది.

అంతరాత్మ "తప్పకుండా అలా అయింది"- అంది. పద్మ, జానకియొక్క నక్షత్రం ఆ నక్షత్రాల్లో యెక్కడుందో నని పరీక్షగా వెతకసాగింది- ఆమె నక్షత్రం కనిపించక ముందే జానకి సౌందర్య స్వరూపం, నవ్వు ఒక్కసారి తన అంతరాత్మలో ప్రతిబింబించి పద్మను సానుభూతిరాల్నిగా చేసినయి.

నిశ్శబ్ధ వాతావరణం...

తల విరబోసుకుని, ఒంటి కాలిమీద నిలబడి, యెవరి కోసమో, దేని కొరకో, నిరీక్షిస్తున్నట్టుగా నిలబడివున్న తురాయి చెట్లవరుస, సిమెంటు రోడ్డుకి యిరువైపులా, వున్నాయి... వాటి కొమ్మల రాపిడికి, ఎత్తైనా మేడలకు సున్నం రాలి పోతూంది... విద్యుత్ తీగలు చెట్ల సందు ల్లోంచి, చొచ్చుకు పోతున్నట్లుగా వుంటాయి....

గతాన్ని వదులుకుని, భవిష్యత్తుని చేరలేక పోయిన వాడి మనస్సు పడే వేదనలాగా ఆ రాజవీధి, ఆ నాటి రాత్రి కుపితంగా మేల్కొని వుంది.—

ఆకాశమంతా పొగ మబ్బులతో ఆవరించుకొని పోయింది. క్లాక్ టవర్ ఒకటి కొట్టింది...

హోటల్ మూన్ లైటులో- వెనక ప్రక్క- వూదా రంగు అద్దాల గదిలో- ఓ మూలగా- రౌండ్ టేబుల్ ముందు చిరాకుగా కూర్చొనీ దత్తు కుతిదీరా సిగరెట్ మీద సిగరెట్ పెగ్ మీద మోజుగా మరో పెగ్ వైట్ హార్సునీ త్రాగుతున్నాడు...

అర్ధరాత్రి దాటినా, హాయికోసం- ఓ చుక్క- వేసుకు పోవటం కోసం- జంటలు జంటలుగా తుమ్మెదలూ- సీతా కోక చిలుకలూ వస్తూ- పోతూనే వున్నారు... దత్తు వాళ్ళని యెన్నో కోణాల్లోంచి పరిశీలిస్తున్నాడు... రక రకాలుగా అతణ్ణి యెన్నో ఆలోచనలు, యేవో కోర్కెలు వుసిగొల్పి రేగగొట్టి, వేడెక్కించ సాగినయి ఆ జంటల నవ్వులూ- చెట్టా పట్టీలుగా వచ్చి సరస సల్లాపాలాడుకుంటూ చేసే చిలిపి

పనులూ- అల్లరీ- కేరింతలూ- మాటలూ- పాటలూ- నృత్యాలూ-బిగికౌగిలింతలూ- పూసుకు తిరగటాలూ- రాసుకు నడవటాలూ- ఒకరి ముఖాల్లోకి ఒకళ్లు మాదకత్వంతో చూసుకొని, పెదాలు తడుపుకోవటం- ఒక టేమిటి- యిలాంటి వ్యసన చేష్టల్ని చూస్తుంటే దత్తు చలించక తప్పలేదు.... చలించాడు... తరువాత, చలించి నందుకు ఏం చేయాలో దత్తుకు అర్థం కాలేదు...

ప్రకృతినీ- స్త్రీ సౌందర్యాన్ని- చూస్తో చలించటమే పురుషుడి జీవితాశయమైతే, యిక వేరుగా అతను దేని కోసమో పరితపిస్తూ- నిరీక్షిస్తూ బ్రతికివున్నంత కాలమూ, బడభాగ్ని శిఖలాంటి కోర్కెలతో దహించుకు పోవటం అనవుసరం...

ఆ సమయంలో దత్తుకి-ఒక్కటి ఆశ్చర్యంగా తోచింది. "అధమం-ఏరకపు ఆడదొచ్చినా చాలును. కాసేపు సరదాగా- యెదురుగా కూర్చొ బెట్టుకొని కబుర్లాడు కోవచ్చు... యీ విసిగి వేసారిన జీవితానికి రవ్వంత వసంతకాలం వచ్చినట్లు భ్రమ పడటానికి అవకాశం లభిస్తుంది. ఆడదానిమాటలు-చూపులు- నవ్వులూ ముఖ్యంగా ఆమె దేహ సౌందర్యం నాలాంటి జీర్ణ గతుడికి- యిలాంటి సమయంలో ఎంతో హాయి నిస్తవి. వసంత ఋతువువచ్చినట్లూ-నందనోద్యానం వికసించినట్లూ శరశ్చంద్రి కలు మత్తుగా ప్రకాశిస్తున్నట్లూ- వూహించుకోడానికి ఆవశ్య కము యేర్పడుతుంది. అప్పుడు నిజంగా మనస్సు ఎంతఉల్లాసంగా వుంటుంది. వ్యక్తపర్చటంకష్టం... ఒకోసారి తీరినా, తీరక పోయినా, ఊహాగానాలూ-కల్పనలూ ఆశలూ-ఆకాంక్షలూ-

మనస్సుకి- యెంతో హాయిని కల్గిస్తూ వుంటవి. అవే పరమావధిగా యెంచుకుని, యెల్లవేళలా సౌందర్యోపాసన చేసే రాగమూర్తులు యెందరో వున్నారు... కొన్ని అభిరుచులు జన్మాంతం వరకూ అలాగే- చిగిరించకుండాను- ఫలించకుండాను వుంటవి," -ఇలా దత్తు తనని తాను సమంజ స్ఫూర్తిగా పరిశీలించుకొంటున్నా- ఏ అందగత్తెకూడా యెంతకీ రాలేదు. అదే చమత్కారం! తలబోస్తున్న పర్యంతం యే తామరసనేత్రి రాదు... దత్తుకి తెలుసు యీ జీవితం ఉత్త చచ్చురకపు విలువగలదని అతని నమ్మకం. కొందరు జీవితాన్ని చూస్తూ తలబోసుకోవటంలో యెంతో సంతృప్తి పడుతూవుంటారు.... మరికొందరు తేలికగా లెఖ్ఖించి, వేళాకోళంగా జమకడతారు. జీవితమంటే కొందరికి భయం.... అదో చిక్కు- సమస్యగా యెంచుకుంటారు.... నిత్యమూ ఆలోచిస్తారు.... చివరకు ఆలోచిస్తూనే అంతమొందుతారు.... అదే వాళ్ళు జీవితాన్ని గూర్చి తెలుసుకుంది. చివరకు మిగిలేదికూడా అదే!! ఒకప్పుడు దత్తుకూడా, తన జీవితానికి యెంతో విలువ నిస్తూ తల దిమ్మెక్కే దాకా ఆలోచించాడు.... దేన్నిగూర్చి?.... దత్తుకూడా తన పాతజీవితాన్ని తల్చుకోవాలనుకున్నాడు... "ఛీ!" అనిపించింది.... అంతలో, వ్యాపించిన లాలస వాతావరణం అతణ్ణి కుదుపుతోంది. త్రాగి-మత్తెక్కిన వాళ్ళు, తాము వెంట తెచ్చుకున్న ఆడా- మగతో- మూన్ లైటు విడిచి కార్లెక్కి- వెళ్ళిపోతున్నారు... కర్మేపీ——...

వాళ్ళకు తను చాలా సేపటినుంచి ఒంటరివాడిలాగా- కనిపించడం, దత్తుకి యెంతో చిన్నతనంవేసింది. సహించలేక

పోయాడు.... పోదామని లేచాడు.... ఎటువైపుకైనా.... ఒళ్ళు తూలింది.... కళ్లు కై పెక్కినయి.... మళ్ళా కూర్చుండి పోయాడే గాని, మతి సరిగ్గా లేదు... యెదురుగా వున్న టేబుల్ మీదకు తల వాల్చి, నేలచూస్తూ వూరికే సిగరెట్లు పీకుతున్నాడు.

కాలం మందకొడిగా గడుస్తోంది...

తలెత్తి చూచాడు.... అప్పటికే చాలామంది వెళ్ళిపోయారు. ఏమీతోచక మథనపడుతున్నాడు. జీవితాన్ని గూర్చి ఇంతలో చుక్కరాలి నేలపడ్డట్టు, ఓ చక్కనిచుక్క తడీ-పొడీగా తడిసి, మూన్‌లైటులోకి ప్రవేశించింది. క్యాషియర్, కుర్చీలోంచి, వుషారుగా లేచివచ్చి, చిరునవ్వుతో లోనికి ఆహ్వానిస్తూ కూర్చుండేచోటు చూపాడు. ఆమె ధన్యవాదాలు చెప్తూ, పూదారంగు అద్దాల గదిలోకి తొంగి చూసింది.... పులకరించింది... దత్తు, స్పష్టంగా కనిపించాడు.... సగం కాల్చి పడేసిన స్టేట్ యెక్స్‌ప్రెస్, యాష్‌ట్రేలో సన్నగా- పొగను వదుల్తోంది. అతని కెదురుగా వైట్‌హార్సు సీసా సగంపైచిలుకు ఖాళీ అయివుంది. రెండు మూడు గాజు గ్లాసులు త్రికోణాకారంలో వుంచబడి వున్నయి.... టేబుల్ మీద, సిగరెట్ దూగర, అక్కడక్కడా పడివుంది... అతని జుట్టంతా చిందర వందరగా ముఖంమీద పడివుంది. బట్టలన్నీ బాగావున్నాయి.... నిట్టూర్చింది... ఆమె అలా తనవైపే చూస్తోందనీ, క్రమ పేతనను గుర్తు పట్టడానికి ప్రయత్నిస్తోందనీ, దత్తుకి తెలియదు- వెలుగుతున్న మెర్‌క్యురీ కాంతిలో అతనో బాధితుడిలా అగుపిస్తున్నాడు... గత జీవితం గుండెలో కలుక్కు-

మంది. "ఏమిటిలా చూస్తోంది?"

క్యాషియర్ ఆశ్చర్యపడుతూ, అడగబోయాడు....

"అతను యెంతసేపట్నుంచీ యిక్కడున్నారు?"

–ఆమె అడిగేసింది.... వింతగా చూస్తో....

–అతను చెప్పాడు... ఆమెవంక చూస్తో– తిన్నగా నడిచి వెళ్ళి– యెదురుగా కూర్చొంది... దత్తు మెల్లిగా తలెత్తి చూస్తో– మరో పెగ్ వేయటానికి గాజు గ్లాసునీ, సీసానీ తాకాడు... ఆమె కలగచేసుకుని, చిన్ననవ్వు విసిరింది... దత్తు జలదరించాడు...

"మీకు వైట్ హార్సంటే బాగా యిష్టమా?"

–ఆమె తియ్యగా అడిగింది... దత్తు ఒక చిన్న నిట్టూర్పు విడిచి– "ఊం.... మీకూ యిదేనా!"– యెదురు ప్రశ్న అడిగాడు.... ఆమెకో గ్లాసు అందిస్తూ...

–"అసలు నేను యీ వ్యసనమంటే యిష్టపడను..."

"అయితే మీ రింకా నాగరికతకు దూరంగానే వున్నారన్న మాట...."

"ఆం... మీ లాంటివారి దయవల్ల...."

–ఆమె ముచ్చటగా జవాబిచ్చింది... దత్తు త్రాగమని మరోమారు ఆమెను కోరాడు... ఆమె నిరాకరించింది కానీ, దత్తు త్రాగుతుంటే మాత్రం, ఆమె చాలా వ్యాకులత పడినట్లు చలించింది.... దత్తు గ్రహిస్తూ, "మగవాళ్లు, యిలా– నా మాదిరిగా– అర్ధరాత్రిపూట– ఒంటరిపాటుగా– ఓ మూల– జల్సాగా హోటల్లో వృథాగా డబ్బు దుర్వినియోగ పర్చటం చూస్తే, నిజంగా మీ వంటి నవయువ్వనవతులు చాలా రకా

లుగా బాధపడతారు కదూ!”-

-ఆమె తెచ్చి కోలుగా నవ్వి వూరుకుంది. బాధ నాపుకుని—

“పైకి, మీ రిలా, నా వంటివాడి మనస్సుకి తృప్తి కల్గించటం కోసం, సమయస్ఫూర్తిగా చిరునవ్వులు చిలికిస్తారే గాని, లోపల్లోపల కుమిలి కుమిలి బాధపడుతూ వుంటారు. అవునా?”—

-ఆమె, యీ సారి నవ్వక, ముభావంగా చూసింది . . .

“స్త్రీ హృదయం చాలావరకు పువ్వులాంటిదనీ, నవనీతం కంటే, మెత్తటిదనీ, అవుసరం వస్తే, పాషాణమనీ, అగాధమనీ, యిలా యెన్నో రకాలైన భావనలు రచయిత, కంటే యెక్కువగానే తెలుసు . . . అర్థంగానిదీ, అర్థంలేనిదీ అయిన 'జీవితం' గూర్చి అహర్నిశలూ ఆలోచించటంకంటే, స్త్రీ హృదయాన్ని గూర్చి తలబోయటం యెన్నోరెట్లు సుఖవంతమైందని నా అభిప్రాయం . . . కాదా!”

-అతను విపరీతంగా త్రాగుతూ మాట్లాడుతున్నాడు... ఆమె చాలా యిష్టంగా వినసాగింది . . . కళ్ళప్పగించి . . . ఆమె చెక్కిళ్ళమీద నిండు యవ్వనం నిగనిగ లాడుతోంది... కళ్ళలో తళతళలు తరగక కామ ప్రేరేపితమైన కాంతిని విర జిమ్ము తెన్నాయి . . .

“నాకు మీ లాంటి వాళ్లు యెన్నడూ యిలాంటి చోట్ల తటస్థ పడలేదు . . . గుండె విప్పి స్త్రీలపట్ల నాకున్న అభిమానాన్ని వ్యక్తీ కరించాలనీ యెన్నోసార్లు ప్రయత్నించాను . . .”

–ఇంతసేపూ ఆమె ముఖంలోకి చూస్తూ మాట్లాడు తున్నాడు... ఆమె పెదవి కదల్పక చూస్తూవుంది... దత్తు వూరుకోలేక– యింకా పరిచయం చేసుకోవటం కోసం—

"మిమ్మల్నెక్కడో యిదివరకు చూశాను"– అన్నాడు.

"నన్నా...!"– ఆమె చిలిపిగా నవ్వుతూ అంది...

"ఆc... మిమ్మల్నే!"

"ఎక్కడ?"

"ఎక్కడో... గుర్తు లేదు... దాదాపు నాల్గు సంవత్సరాల క్రిందట..." అతను అనుమానిస్తూ అన్నాడు...

అబ్బో!... చాలాకాలమైంది... నన్నా!... నా లాంటి పోలికలున్న వారినా!... మీరు నిజంగా చూసింది!"

"మిమ్మల్నే" నమ్మకంగా చెప్పాడు...

"అయితే మీరు నాకు గుర్తు లేరు... క్షమించండి..."

"ఫరవాలేదు... యింత మాత్రానికి క్షమాపణ కోరడం దేనికీ?"

"సభ్యతకు... శ్రమనుకోక మాట్లాడినందుకూ!"

–దత్తు నవ్వాడు... ఆమె లేచింది వెడదామని హఠాత్తుగా, అతను బిత్తర పోతూ—

"అప్పుడే లేచారేం? వెడతారా!"

"వెళ్లొద్దు మరీ..."

"అవును, చాలా టైముకూడా అయింది..."

దత్తు యిలా అన్నాడే గానీ, ఆమె యిలా యింకా కాసేపుపుంటే బాగుండునని మనస్సులోవుంది... ఆమె వెళ్ళి

పోవటం అతనికి యిష్టంగా లేదు. వుండమని కోరటానికి తనకేం అధికారం వుంది? దత్తులో ఆవేదన కల్గింది. ఆమె పేరేమిటో యెంతకీ గుర్తుకు రాకుండా వుంది... ఎంతో ఆశాపూరితమైన జీవితాన్ని- యీ జగత్తులోని అనిర్వాచనీయమైన సౌంద ర్యాన్ని- యింతవరకూ యెంతగా అనుభవించినా, యింకా తీరని 'కుతి' ఆమె ముఖంలో కన్పిస్తూనే వుంది. అతణ్ణి, తమి దీరా ఆకర్షించుకోవాలని, ఆమె చేసే ప్రయత్నమూ- చేష్టలూ- దత్తుకు మరింత ఆవేశాన్ని రేకెత్తింప చేస్తున్నయి...

"ఆమె యెవరు?"

-యెన్నడూ యెరుగని స్త్రీ, యెరిగినట్లు చొరవ తీసు కుని ప్రవర్తించుతూ వుంటే, ప్రతి పురుషుడికీ మొట్టమొదట అర్థంగాని ప్రశ్న యిదే...

మరో పెగ్ వేసి పూర్వపరిచితుడి లాగా పల్కరించ బోయాడు..." మీరు... మీరు..." అంటూ... ముద్ద మాటగా... అతని కళ్లు మైకంతో మూసుకుని పోతూండటం ఆమె కనిపెట్టింది... ముఖమంతా నూనెగారుతో వివర్ణమై పోవటం జరుగుతోంది. శరీరం బాగా మొద్దుబారి తూలుతోంది.

"ఊరికే యెందుకిట్లా తప్ప త్రాగుతారు?... ఆరోగ్యం చెడిపోతుంది... మీ రిట్లా తెలిసి పాడై పోతుంటే నా కెంతో బాధగావుంది..."

ఇలా జాలిగా సానుభూతిగా- దీనంగా అంటుంటే దత్తు ముఖంలోనూ- కళ్ళలోనూ యెంతో బాధ పాతర లాడింది...

"నేను పూరికే త్రాగటంలేదు... త్రాగాలనే త్రాగుతున్నాను. ఆరోగ్యం చెడుతుందని తెలుసు... ఆయువుకూడా పోతుందని తెలుసు... అయినా త్రాగుచున్నాను... అదో సుఖం..." ఆమె ఒళ్లు ఝుల్లు మంది... "ఆయువు" మాట వినే సరికి, ఆమె శూన్యంలోకి చూస్తుండి పోయింది...

"తెలిసికూడా మరెందుకిల్లా త్రాగుడు?"

"ఒకానొక రకమైన జీవితానికి ఒక్కో కారణం భయ కంపితమైన వాతావరణాన్ని సృష్టించిపెడుతుందని దాన్ని తప్పుకోడానికి యిలాంటి చెడు అలవాట్లు చేసుకోవడం పరిపాటి... కేవలం భయమేగాదు... వేదన కల్గించేది యేదైనా, మనస్సుని గాయపరుస్తుంది... అప్పుడప్పుడు రాచపుండుని కెలికే సూక్ష్మ జీవిలాగా, ఆ కారణం హృదయాన్ని తొల్చి తొల్చి జిలపుట్టిస్తుంది... రంపకోతపెట్టే బాధ, విపరీతావస్థలో పడేస్తుంది. నిర్వేదావృతమైన పరిస్థితులు ఆ మనస్సుని వివిధ రీతుల్లో మారుస్తుంది... యిలా చాలావుంది చెప్పటానికి. మనస్సు మధన పడటానికి భారమైన కారణాలు అనేక రకాలు..."

–దత్తు ముగించాడు. ఆమె అతనిని మళ్లీ ప్రశ్నించ లేదు... ఒక వైపు విపరీతంగా త్రాగుతున్నా వారించలేదు– ఆపాదమస్తకం పరిశీలిస్తూ, తన సొమ్మేదో నాశనమై పోతున్నట్లు వ్యాకులపాటు చెందింది... ఆమె...

బెదురు బెదురుగా ప్రక్కకొచ్చి– ఓ చిన్న కాగ్గు ముక్క మనీపర్సులోంచి, తీసియిస్తూ. ఆమె...

"యీ అడ్రసు ప్రకారం.... ఒక్క గంటలో రాగలరా?

యీ రాత్రికే...! కనిపెట్టుకుంటాను... తప్పకరావాలి..."
అంటూ.

—పొడిపొడిగా అనేసి, చర చరా క్యాషియర్ దగ్గరకు పోయి, దత్తు బిల్లు చెల్లించి, హోటల్ మూన్ లైటునుంచి, నిష్క్రమించింది... క్యాషియర్ తెల్లబోతూ డబ్బు తీసుకున్నాడు...

"ఆల్ రైటు..." అనుకుని, తూలుతూ దత్తు లేచి, ఆమె నమసరించినట్లుగా— పది నిముషాల్లో— ఆ హోటల్ దాటి చీకటి గుండెలోకి ప్రవేశించాడు...

అతనంటే, ఆమె కేమిటి యింత అభిమానం?

"ఆడదానిముఖం బ్రతికివుండగా చూడకూడదు"— అని నాల్గు సంవత్సరాల క్రిందట శపథం పట్టిన దత్తు, ఒక్కసారిగా యిలా మారి పోవట మేమిటి?........

చినుకులు, చిరునవ్వుల్లాగా— మంచు తుంపురుల్లాగా— రాలుతున్నాయి... ఎడా-పెడాగాలి వీస్తోంది. కింగ్సు వే అంతా అబద్ధీకుడి ప్రణయంలాంటి అర్థరాత్రి చీకటిలో మసులుతోంది. బూచులు బూచులుగా మసక మబ్బులు— ఆకాశ మార్గంలో— యెక్కడికో తరలి పోతున్నాయి... చల్లని వెన్నెల లేక పోవటం దత్తు కెంతగానో వెలుపడింది... రోడ్లన్నీ తడీ పొడిగా వున్నాయి... కొంతదూరం నడిచాక— పేవ్ మెంటుమీద— ఆయాసం— తూలుడూ బాగా యెక్కువై, బురదలో ఒరిగి పడబోయి, తమాయించుకు నిలబడ్డాడు... కళ్లు బాగా ఒక సారి తెరిచి చూశాడు...

చీకటి పురివిప్పి నాట్యం బుస్తోంది... అంతా నీరూ!—

మెరదా! "ఛీ... పాడు వాతావరణం!"

తూలుతూ మళ్లా పేవ్‌మెంటు యెక్కి— ఓ రిక్షాని పిల్చాడు... వచ్చింది... ముద్ద మాటల్తో— తనలో తను గొణుక్కోవటం ఆపి— "పోనీ... త్వరగా... ప్యారడైజ్ వెనక్కి..." కసురుకున్నాడు. కదలిన రిక్షా— తిరగరాని సందుల్ని తిరుగుతూ పోతోంది... దత్తు స్మృతిలేని వాడిలా ప్రక్కకి ఒరిగి పడివున్నాడు... అతని మనస్సులో— ఆమె మోహనాకారం తాత్కాలికమైన సంతృప్తికి, తామరాకు మీద నీటి బొట్టులాగా మెరుస్తోంది—

రిక్షా— నీటి వరదని యీదుతూ పోతోంది. మధ్య మధ్యా తన మైకాన్ని నిగ్రహించుకొంటూ కళ్ళు తెరచి చూస్తున్నాడు. తురాయి చెట్లక్రింద— వీధి దీపాల కాంతి కిరణాలు మచ్చలు మచ్చలుగా పడివున్నయి...

అణచుకోలేని ఆవేశం అతనిలో కలుక్కుమంటూ వుంది. క్లాక్‌టవర్ అప్పటికి రెండుగంటలు కొట్టి పావుగంటైంది. ఆమె యిచ్చిన యింటి చిరునామా ప్రకారం, దత్తు ఒకవీధి మలుపు మొదట్లో రిక్షానాపి దిగి— నడక సాగించాడు. మసక నీడలు, అతణ్ణి దాటి దూరమవుతున్నయి— మాయ మాయగా... కొన్ని బురద కొంపలు వుండే వాతావరణం ఏర్పడింది. ఉండటానికి పురాతన కాలానికి చెందిన మేడలూ— డాబాలూ కట్టబడే వున్నయి... కాని, యేదో గవులు కంపు గాలిలో కలిసి వస్తోంది. ఎవరో గాలం వేసి, తన హృదయాన్ని కేంద్రీకరింపబడిన ఒకచోటుకు లాగుతున్నట్లుగా అతను నడుస్తున్నాడు... ఏదో ఆశ, గత జీర్ణజీవితాన్ని మరు

వున పడేస్తూ, అయస్కాంతం మాదిరిగా ఆకర్షిస్తున్నట్లు దత్తు భ్రమపడ సాగాడు.... క్షణ క్షణానికీ, ఒక రకమైన వుత్సా కక్తృ త్రి తనంగా అతణ్ణి దేనికో ప్రేరేపిస్తోంది.

ప్రసరిస్తున్న వీధి దీపం మసక కాంతిలో ఆమె చిరు నామాగల యిరుకు సందులోని ఒక పాతమేడని పెద్దగా వెత క్కుండానే గుర్తుపట్ట గలిగాడు.

మెల్లిగా- పడుతూ లేస్తూ- మెట్లెక్కి- తలుపు తట్టాడు...

ఒకటి... రెండు... మూడు... నాలుగు...

ఎవ్వరూ వచ్చి తలుపులు తెరువలేదు... పోనీ యెవ రైనా వున్నట్టుగా కూడా అలికిడి తగల్లేదు—

పరకాయించి చూశాడు... తడముతూ.

తాళం వేసివుంది. ఒళ్ళు మండింది.

"రమ్మనిమని- తాళం వేసిందేమిటి? ఓ చచ్చు వెధవ క్రింద జమకట్టి ఏడ్పించటంలేదుగదా; ఎంతో సభ్యతకలదని అనుకున్నాను. మొత్తానికి రకంబాపతు సరుకు అనిపించింది. అందుకే ఆడదంటే నాకు పరమ అసహ్యాం... నమ్మను... ఇంతకీ యెక్కడికి పోయింది...? ఇంకా వూళ్లో తిరగటం కాలేదు కాబోలు"

—అంత నిషాలో వున్నప్పటికీ దత్తుకి, ఆమెపట్ల కోపం భగ్గున మండింది, నెమ్మదిగా మెట్లు దిగుతూ ఆమెను నోటి కొచ్చిన రీతిగా విమర్శించి, వ్యాఖ్యాన పర్చాడు...

ఏం చేస్తాడు...? నిరీక్షిస్తూ- సిగరెట్లు చిరాగ్గా

కాలుస్తూ— కొంతసేపు ఆ వీధిలో ఆ వైపునుంచి యీ వైపుకి, యీ వైపునుంచి ఆ వైపుకి, విసిగి వేసారేవరకూ తిరిగాడు... కాదు తిరుగుతున్నాడు...

ఎన్నోసార్లు ఆ మేడముందు నిలబడి, క్రిందికీ, పైకీ చూశాడు. చాలా సేపటివరకు యెవ్వరూ ఆ మేడ భాగల్లో నివాసముంటూన్నట్లు ఆచూకీ తగల్లేదు...

సరిగ్గా అతనికి నిద్రొచ్చే సమయానికి, వీధివైపు భాగానికి మధ్యలో— ఓ కిటికీలోంచి, మసకగా దీపకాంతి ప్రసారమవుతూవుంది—

దత్తు రెండడుగులు వెనక్కివేసి చూశాడు...

ఒక స్త్రీ...! తలవంచుకొని యేమిటో చూస్తూ కూర్చొనివుంది. ముఖంమీద పొడుగాటి మంగురులు అడ్డదిడ్డంగా పడుతూ వున్నయి...

"ఎవరు?"—

దత్తుకి ప్రశ్న ఏర్పడింది—

"ఆమె యీమె కాదుగదా! ఏమో! కాదు. ఆమె యీమెకాదు. ఎలా అవుతుంది? ఆమె మంచి వయస్సుతో నిగనిగ లాడుతూవుంది. యీమె యేదో పాలిపోయి, చిక్కిపోయి, దీనంగావుంది?..."

—ఏమిటో వూహ దత్తు మనస్సులో తీవ్రగమనంతో సాగిపోతోంది.

"ఎవరోలే... పోదూ..."

—కలిగిన వూహను తుంచేసుకుని, మళ్ళీ మెట్లెక్కి వెళ్ళి

ఒక చదునైన చోట చతికిలపడ్డాడు...

క్రమేపీ శరీరం మత్తుతో— అలసటతో బరువెక్కి పోవటంతో, దత్తు, తెలీకుండా నిద్రకు లొంగిపోయి నేలమీదకు జారిపోయాడు...

ఒక్కోపర్యాయం, స్త్రీ కోసం— అది క్షణంసేపు యిచ్చే అమృత సమానమైన సుఖంకోసం, పురుషుడుపడే అవస్థ, అతనికి తెలియని యమయాతనల్ని గుర్తుచేస్తుంది. అయినా పురుషుడు భరిస్తూనే వున్నాడు...

ఒకప్పుడు, అంటే నాలుగైదు సంవత్సరాల క్రిందట వరకూ దత్తు జీవితం చాలా సుఖపూరితంగా వుండేది. తల్లి దండ్రులచేత యెంతో అల్లారుముద్దుగా పెంచబడి పెద్ద వాడయ్యాడు. ఉన్నత కుటుంబంలో జన్మించటం చేత వుదాత్తమైన భావాలు అతనికో క్రొత్త సంస్కారాన్ని కల్గించినవి. తన స్థితి గతులకు సరిసమానంగా తులతూగే ఒక పెద్దింటి ఆడపడుచుని అగ్నిసాక్షిగా వివాహం చేసుకున్నాడు... వివాహం అనేది ఒక్కొక్కరి జీవితానికి యెంతో మార్పుని తెచ్చిపెడుతుంది. దాంపత్య జీవితం స్త్రీ పురుషులకు క్రొత్త క్రొత్త ప్రక్రియల్ని కలగజేస్తుంది. 'రమణి' యేనాడయితే తనకు భార్యగా లభించిందో, ఆ నాటినుంచి దత్తు తన బ్రతుకంతా వెన్నెలతోట అనే భావనలో తన్మయత్వం చెందాడు. పెళ్ళి నాటికే అతను ఒక యింగ్లీషు కంపెనీలో ఆఫీసరుగా పనిచేస్తున్నాడు. క్రొత్త భార్య అంటూ తన అంతస్థుకి తగినట్లు రావటంతో, ఒక క్రొత్తకారు కొన్నాడు దత్తు...వస్తుతహా దత్తు హృదయం చాలా మెత్తనిది. అంత మాత్రంచేత ప్రతి

ఒక్కరి మాటకి గంగిరెద్దు లాగా తలఫూపే స్వభావం వున్న వాడనికాదు. తన అభిప్రాయాలకూ– ఆదర్శాలకూ– అభిరుచులకూ అనుగుణ్యంగా తన జీవితం నిర్విఘ్నంగా సాగిపోవటమే దత్తుకి కావలసింది. వాటికి యెప్పుడైతే ఆటంకం కలుగుతుందో, అప్పుడతను పాషాణ హృదయుడై పోతాడు. ఈ సంగతి పాపం రమణికి, కాపరానికి వచ్చిన క్రొత్త కాబట్టి తెలియదు—

స్త్రీ హృదయం పువ్వులాంటిదని దత్తుకి వున్న గాఢాభిప్రాయం... తనవల్ల, ఏ విషయంలోనైనా, క్రొత్తగా వచ్చిన తన భార్య రమణికి, లోటుగాని, కష్టంగాని, బాధగాని, ఆవేదనగాని, గబుక్కున కలుగుతుందేమోనని యెంతో జాగ్రత్తగా, ఆమెను పూలల్లో పెట్టుకుని చూసుకుంటూ వుండేవాడు దత్తు...

తన భర్త, తననో దేవతలాగా ఆరాధిస్తూ చూసుకోవటం రమణికి ఆశ్చర్యాన్ని కల్గించింది— తనపట్ల యింత శ్రద్ధ చూపుతూ మెలిగే భర్తను తను యే విధంగా పూజించి తరించాలని, నిత్యమూ రమణి ఆలోచిస్తూండేది—

దత్తు దృష్టిలో రమణి, ప్రకృతిలోని సౌందర్యాన్నంతా సృష్టికర్త తనకోసం ప్రోగుచేసి, ప్రాణంపోసి, అంకితం చేసి నిష్క్రమించినట్లుగా ఒక మధుర భావంతో గూడి వుండేది... కావచ్చునేమో? మరి ఎందుకంటే? తను వలచింది రంభ... కాదనటానికి ఎవరు? ఎవరి భావాలు వాళ్ళవి. ఎవరి ఆనందం– సంతోషం వాళ్ళది. అలాగే రమణికి కూడా తన భర్తంటే యెనలేని ప్రేమ– భక్తీ వుంది— భార్య భర్తను దేవుని

లాగా- అంతకన్నా గొప్పగా- పూజించితుంది. భర్త భార్యను, ఆమె సేవలకు మెచ్చి వివిధ కోణాల్లోంచి అర్థపూరితంగా చూస్తూ, లాలిస్తూ హృదయానికి హత్తుకుంటాడు. తియ్యగా యిరువురూ వెన్నెల్లో తడుస్తూ మలయమారుత వీచికలలో తేలుతూ మధుర ప్రణయార్ద్ర వూహాల్లో చరిస్తూ మాట్లాడు కుంటారు. ఇల్లా గనుక సాగకపోతే క్రొత్త కాపురానికి శోభ లేదు. ఆ దాంపత్య జీవితం భవిష్యత్‌లో రాణించలేదు— యీ సడింపులూ— ముఖాలు మాడ్చుకోటాలూ— చిట్లించు కోవటాలు— అయిన దానికీ— కాని దానికీ భార్య భర్తలు యెదుటబడి నోళ్లు చించుకొని పోట్లాడుకోవటాలూ— పంతాలూ- ఒకర్నిమించి మరొకరు గొప్పగా ప్రవర్తించ టాలు, యిలాంటివన్నీ యెక్కడ మెలకలెత్తు తయ్యోనని దత్తు చాలా భయపడుతుండేవాడు భార్య విషయంలో— నిజంగా కూడా అంతేగదా! క్రొత్త కాపరమంటే కోటి స్వర్గాల సుఖం- శతకోటి మధుర స్వప్నాల సౌభాగ్యం వరద వెల్లువలాగా వచ్చి భార్య భర్తల జీవితాల్ని నవ నవోన్మే షంగా చిగురింపచేయాలి. అంతవరకూ ప్రణయకోపాలూ— సరస సల్లాపాలూ— నిరభ్యంతరంగా— సాగవలసిందే! అప్పుడే గదా బ్రతుకనే దానికి క్రొత్తరూపం కొంతవచ్చేది- లేకపోతే యేముంది? క్షణక్షణానికి విషాదం తప్ప... ఇందతా దత్తుకి బాగా తెలుసు... అందుకే రమణిపట్ల తన జీవిత సర్వస్వమంతా ఏక ముడివేసి వుంచుకున్నాడు— దత్తు...

ఇలాంటి భావపరంపరలు ఒక్కోసారి అతని గుండెను గిచ్చి యేడ్పిస్తూ వుంటయి. తన స్థితిని తాను కోల్పోటంవల్ల,

యేమీ యెరుగని అమాయకుడిలాగా పడుకుని వున్నాడు..

కాలం మెల్లిగా గడుస్తోంది.

అంతకంతే, మెల్లగా ఒకామె, ఒక రిక్షామీద వచ్చి, ఒక వైపు తలుపు తట్టింది. ఆ చప్పుడు, బహుశా! మేడమీద వున్న ఆమెకు వినబడి వుండచ్చు. ఆమె లేచి, కిటికీ తలుపుల్ని వేసి, దీపం వుచ్చుకుని, మేడమీద నుంచి దిగివచ్చి తలుపు తీస్తూ—

"ఎవరూ?"— అంది...

"నేనే..." అంటూ, లోపలికి వెళ్ళబోయింది...

"అటు చూడు... ఎవరా పడుకుంది?" ఆమె నాపింది.

—ఇరువురూ కలసి, దీపంతో దగ్గరకు వెళ్లారు... చూసారు.

"ఇంకా రాలేదా అందామనుకుంటున్నా!"

—బయటినుంచి వచ్చినామె, అంది- లోపల్నుంచి వచ్చినామె దిగ్భ్రాంతవదనంతో— చూస్తూండి పోయింది...

"ఇంకా సందేహంగా వుందా రమణీ!"

"లేదు రజనీ! నా కళ్ళని నేను నమ్ముతున్నాను.... నా జీవిత సర్వస్వాన్ని మళ్ళా నా కప్పగించినందుకు నిన్నెట్లా అభినందించాలో అర్థం కావటంలేదు."

"సరే! నే వెళ్తొస్తాను... రేపు వుదయమే కనిపిస్తాలే!.." రజని వెళ్ళిపోయింది.

రమణికి, తరువాత యేం చేయాలో తోచక నిల్చుండి పోయింది. తన భర్త యిలా హఠాత్తుగా దర్శనమిస్తాడని, రమణి వూహించలేదు. తన గుండెలోని బాధను, భర్తలేని

లోటును, యెన్నో పర్యాయములు రజనికి చెప్పుకుంది, ఆమె, రమణికి చిన్ననాటి స్నేహితురాలు. భర్త తనని దిక్కులేని దానినిగా చేసి, యిల్లు వదలి సంసారాన్ని బజారు కెక్కించి, జారుకుపోయిన తొలిరోజుల్లో, దేవతలాగా రజని వచ్చింది-చూసిపోదామని. "తన కాపురం యిలా మంట గలిసింది"— అని చెప్పుకుని యేడ్చినప్పుడు, ఆమె తనని, ఎన్నో రకాలుగా ఓదారుస్తూ—

"నీ కేం భయంలేదు. నేనున్నాను. మా వారున్నారు. నీ భర్తని వెతికి తెచ్చి నీ కొప్పజెప్పే బాధ్యతమాది. క్షణక్షణా నికి స్త్రీయేగాదు, పురుషుడు కూడా మారుతూ వుంటాడు. ముఖ్యంగా స్త్రీకి సహనం కావాలి. పురుషుడికంటే గూడ...." -ఇలా యెన్నో చెప్పింది. నేటికి,తనమాట నిలబెట్టుకున్నందుకు.. రజనిపట్ల రమణికి నమ్మకం కల్గింది....

రకరకాలుగా, రమణి హృదయం జలదరించింది. "రజని యేమిచేసి, తన భర్తని మళ్ళీ యీ యింటిమెట్లు యెక్కేలాగు చేసిందో?"- రమణికి ఆలోచన కల్గింది. తను యిక ఆలస్యం చేస్తే, భర్తకు మెలకువ రావచ్చు. తీరా తనని చూస్తే, మున పటి స్థితి యావత్తూ గుర్తుకి తెచ్చుకొని మళ్ళా పరాన్ము ఖుడై వెళ్ళి పోవటం జరగచ్చు. అలాంటి వేమీ జరగకుండా, భర్త నిద్రనుంచి బాగా మేల్కొకముందే గృహ ప్రవేశం కావ టం యెంతో మంచిదనుకుంది రమణి. అంతే. ఆమె వెళ్ళి తలుపు తెరచింది. తాళం తీసి.

నాలుగు సంవత్సరాల తరువాత, సింహద్వారంకి వేసిన తాళం తీసింది. భర్త వెళ్ళిన నాటినుంచి, క్రిందభాగం

తాళంవేసి వుంచేది. యెవ్వరికి బాడుగ కూడా యివ్వలేదు. యివ్వాలని యెన్నడూ మనసు పుట్టలేదు కూడా. తన భర్త తనకు దూరమైన నాటినుంచీ, ఆమెకు యీ ప్రపంచం యావత్తూ నిరాశా పూరితంగా కనిపించుతూ వుండేది. లంకంత యింటిని సాకటానికి ఓపికలేక ఫూరికే వుంచేసింది. వీధి తలుపులు తాళంపెట్టి, పైభాగంలో ఒంటరిగా కాలక్షేపం చేయటం గత్యంతరమైంది. రావటం- పోవటం మేడ మెట్లుండే దక్షిణపైపు గదిలోంచి సాగుతూండేది. రమణి, మెల్లిగా చేతిలో దీపాన్ని చిన్నగాచేసి, భర్త దగ్గరకు వచ్చింది- మెల్లిగా అతన్ని కుదిపి- లేపి- లోపలకి తీసికెళ్ళింది. యిలా చేస్తున్నంత సేపూ రమణి పులకరించి పోయింది.

"ఎవరో వచ్చి, తనని ఆత్మీయంగా- ఆప్యాయంగా- లోనికి తీసుకుని పోతున్నారు ఎవరూ?- దత్తుకి యెంతకూ గుర్తురాలేదు. మైకంతో ఒళ్ళు బరువుగా ప్రక్కలకి తూలి పోతోంది. అరమోడ్పు నయనాలతో అర్థ రహితంగా- ఆమెను చూశాడు. తలెత్తి...

రమణి, అతని చూపులికి కాస్త దూరంగా తప్పుకుని వెళ్ళి, తలుపులు వేసి, దీపం ఎక్కించి, నిలబడింది. ఆమె ముఖం మసక మసకగా అతనికి క్రీనీడలో వున్నట్లు కనపడింది. ముఖంమీాదకు జారివచ్చి పడిన జుత్తు అతని కళ్ళకు అడ్డుపడి, ఆమెను సరిగ్గా చూడ నివ్వటంలేదు. తనెక్కడో వుండటం ఆశ్చర్యం కల్గించక పోయినా, యెదురుగా నిల్చున్న ఆమెకూ- మూన్ లైటులో దర్శనమిచ్చి, ఆహ్వానించి నామెకూ ఎంతో తేడా కనిపించటంతో- "ఏమిటీ? యెవరీమె?- అనుమానం

వేసింది. దత్తుకి- ఆ పాళాన, మెల్లిగా మంచంమీద నుండి లేచి,ఆమెవద్దకు వెడదామని, వుద్యమించాడు. అలా జరగటం- సంభవిస్తే, తూలి నేలమీద బోర్లగిలా పడతాడని రమణికి తెలుసుండటంతో, చటుక్కున వచ్చి భుజాలుమీద చేతులు వేసి—

గబుక్కున లేవకండి. పడతారు ఒళ్ళుతూలి.... కాసేపు నిద్రపొండి...." అంటూ పడుకునేలాగు చేసింది... రమణి అలా ఆదరాభిమాన స్వరయుక్తమైన కంఠంతో అనటంతో, దత్తు ఒక్కసారి ఆమెవంక చిరునవ్వు నవ్వినట్లు చూసి- "అలాగే"- అంటూ రమణిని దగ్గరకు చేర్చుకున్నాడు... ఆ దీపకాంతిలో- మెరిసిపోయే యవ్వన సౌందర్యం ఆమెనుండి జిగేలుమంటూ ప్రకాశిస్తోంది.

"మీరు... మీరు...?" అతనేదో, తనలోని అనుమానాన్ని- సందేహాన్ని- తీర్చుకోవాలనేమిషతో అడగబోయాడు....

"అవును... నేనే!... నేనే!... -ఒక్కసారిగా తన పేరు చెప్పకుండా తప్పుకుని, ముఖం చాటు చేసుకుంది. అతనికి ఆమెవరో తెలుసుకోవాలనే కాంక్ష యెక్కువైంది.

"మీరెవరు?.... నన్ను రమ్మని పిల్చిన వారేనా?"

"ఆ! నేనే రమ్మని పిల్చింది... అవును... మీ కోసం యెదురు చూస్తూ- కలలుగంటూ- తపస్సు చేస్తూ- నిరీక్షిస్తూ- తపించుతూ- వుంటున్నది నేనే! మీ దర్శనం కోసం పూజలు చేస్తోంది కూడా నేనే!!

"మీరు చాలా గొప్పవారన్న మాట...."

"నన్ను 'మీరు- మీరు' అనొద్దు... తప్పు.... పాపం....!!"

"ఏం?... ఎందుకనీ?"

"నాలాంటి వాళ్ళు అంత గౌరవానికి నిలబడటం కష్టం."

"అలాగా!... పోన్లే ప్రొద్దోయింది. యిక పడుకో!!"

-కాసేపటికి -తన్నుదాను మర్చిపోతూ అన్నాడు. కళ్లు మూతలు పడినయి.

వెలుగుతున్న దీపాన్ని రవ్వంత చిన్నది చేసి వచ్చి, అతని కోర్కె ప్రకారం ప్రక్కనే కూర్చుంది....

రమణికి అంతా ప్రపంచం లాగా వుంది... అతను బాగా నిద్రలో మునిగిన తరువాత, గుండెల మీదకు వాలి పోతూ- ముఖంలో ముఖం వుంచింది...

ఇంచుమించుగా వున్న ఆ చీకటి గదిలో- దూరాన యెక్కడో రాలిన నక్షత్రంలాగా- ఒక ఆలోచన ఆమెలో- మెరిసింది.

దత్తు, నిర్భీతిగా నిద్ర పోతున్నాడు.

మూతలు పడబోయే ఆమె కళ్లు, చీకటి అడవిలో చిచ్చు పెట్టినట్లు తెరచుకుని వున్నయి....

ఒక ఆలోచనలోంచి, లక్ష ఆలోచనలు వుద్భవిస్తున్నయి. "ఏం చేయాలి తను?"

-రమణికి యెంతకూ తోచటంలేదు... వెంటనే ఆమె అతని శరీరంనుంచి తన శరీరాన్ని- నిప్పులోంచి తీసిన బంగారు ముద్దలాగా- యివతలకు తీసుకుని, తిన్నగా వచ్చి, దీపాన్ని

ఎక్కించింది... వెలుతురు వెక్కిరించింది.

క్లాక్ టవర్ మూడు కొట్టింది...

తుంపరగా వర్షం కురవటం తగ్గింది...

తన భర్త, తనకు దైవికంగా ప్రత్యక్ష మవటంతో ఒళ్ళు పులకరించి పోయింది... మళ్ళా కోటి స్వర్గాల సుఖం అంది నంత పరవశత్వం కలిగింది.

నిగ్రహాన్ని ఆపుదల చేసుకోలేక వెళ్ళి అతన్ని చేరింది.. నరాలు- కోర్కెలూ వేడెక్కి పోతున్నయి. జారి పోనున్న సమయం ఆమెను గిలిగింతలు పెట్టుతోంది. సుఖమేదో హృదయాన్ని ప్రోత్సాహపరుస్తోంది. "ఇప్పుడు కాదు... యీ సమయంలో నిద్రాభంగం చేయటం మంచిది. కాదు... వద్దు... వద్దు..." అనుకుంటూనే రమణి వెళ్ళి దత్తుని సమీపించింది. సంతోషమూ- తృప్తీ ఆమెను వుద్రిక్తపర్చ సాగినయి... తన ప్రయత్నం నెరవేరేదాకా భర్త నిద్ర లేపలేదు... అదీ తన అదృష్టమే అనుకుంది... కాదా మరి! ఇంతలో- ఎక్కడో కోళ్లూ కూసినయి... మహా నగరం మేల్కొంది... అతనికి మెలకువ వచ్చేసరికి, తనమీద ఎక్కడ అసహ్యం- రోత- కలుగుతయ్యోనని, లేచి వెళ్ళింది మేడపైకి అందంగా అలంకరించుకు రావటం కోసం....

బాగా తెల తెలవారిన పిదప దత్తుకి మెలుకువ వచ్చింది. అక్కడనుంచి, వెంటనే వెళ్ళి పోవాలని ప్రయత్నించాడు. కానీ, వెళ్ళ బుద్ధి కాలేదు. శరీరమంతా కొంతవరకు తేలికపడినట్లుగా వుంది.

"ఆమె ఏదీ?- ప్రశ్న కల్గింది.

ఇల్లంతా కలయచూశాడు... గత జీవిత ఘట్టాలేవో గుర్తుకి రాసాగినయి...

"తనపట్ల జాలిచూపి, తెల్లవార్లూ తనతో గడిపిన సౌందర్యం- ఎంతకీ కనిపించదేమిటి?"

-దత్తులో ఆరాటం హెచ్చింది. కిటికీల గుండా సూర్య కిరణాలు వచ్చి, అతను కూర్చున్న ప్రదేశాన్నంతా వెలుగు రేఖలతో నింపేసినయి.

ఆ వెలుగులో- ఒక ఫోటో- తళుక్కున మెరుస్తో కని పించింది. చటుక్కున తీసి చూసాడు... "రమణి- తనూ..." అతని గుండెలు గుభిల్లు మన్నయి... కళ్లు చెదరినయి... "తనదే..... పెళ్ళి నాటిది." బాగా స్మృతి పథంలో మెరిసింది. తరువాత దిగ్గున లేచి, మళ్ళీ యిల్లంతటినీ కలయచూశాడు... తా నెరుగని వస్తువులు, మెరుకపర్చుకుంటూ కళ్ళ కెదురుగా వున్నయి... తన యిల్లు- ఎన్నడో తన సంసార సుఖం కోసంకొనబడిన సామాగ్రీ- యెక్కడివక్కడే భద్రంగా వున్నయి బూజుపట్టి...

దత్తు గుండెలో పూర్వపుగాయం సెలవేసినట్లయింది. అతని చేతిలో ఫోటో. గత సంస్మృతుల ధాకకు గజగజ వణుకు తోంది... మరిచిపోయిన కోపం అతని గుండెలో కుబుసం విడిచి కళ్ళల్లో బుసకొడుతూ ముఖంలో పడగ విప్పింది...

గబగబా- ఫోటోతో- సరాసరి మేడమీదకి వెళ్ళ బోయాడు...

రమణే యెదురుగా దిగివస్తోంది.

ఏదో చట్టున వెన్నులో పొడిచినట్లయింది...

ఏమిటో జ్ఞాపకాలు అతన్ని గిల్లినయి...

ఆమె దగ్గరగా వచ్చి- గుండె కొనుకుని నిలబడింది... ముఖంలోకి చూస్తూ- విజయగర్వాన్ని చిలికింది- నవ్వుతూ. అతనికి ఆ పాదమస్తకం కంపించింది...

"నువ్వు..."- అతను ఏమీ అనలేక తలబాదుకున్నాడు.... ఆమె జాలి తల్చింది...

"నేను మీ రమణిని... ఎందు కింకా అంతకోపం..."

-తనని క్షమించమన్నట్టుగా పలికింది...

నీ మూలంగానే నా జీవితం నాశనమయింది యిట్లా!"

-అతను ఒక్క- బిగువున అనేశాడు...

"ఇంకా నన్ను అపార్థం చేసుకొంటున్నారు. భార్యగా మీ జీవితంలోకి ప్రవేశించాను... అలా జీవితాంతమూ బ్రతకాలనే కోరుకుంటున్నాను. అంతేగాని, పురుషుడితో సమానంగా బ్రతకాలనే వాంఛ నాకులేదు..." ఆమె తన నిర్ణయాన్ని చెప్పుకుంది.

ఇదే నిర్ణయం ఖచ్చితంగా రమణి నాలుగు సంవత్సరాల క్రిందట- ఎడబాటు కలగక పూర్వమే భర్తకు నివేదించింది. అతను ఒప్పుకోలేదు. అసలు ఆ భార్యాభర్తల్లో యింతటి విషమ సమస్య- యిన్నాళ్లు యెడబాటు కలగటానికి తటస్థపడింది. ఒక్క-టే కారణం... క్రొత్త దాంపత్యపు తొలిదినాలలో, ఒకరినొకరు క్షణకాలం విడిచివుండే వాళ్ళు కారు. ఇలా వుంటున్న రోజుల్లో దత్తు స్నేహితులు ఒకసారి వినోదయాత్ర అంటూ, ఒక కార్యక్రమాన్ని నిశ్చయించేరు. దానికి, భార్య తోడు లేకుండా దత్తు ఒంటరిగా వెళ్ళి హాజ

రయ్యాడు... భార్యా సమేతంగా వస్తాడనుకున్న దత్తు ఒంటిగా రావటంతో, కొంత హేళనకు దారి తీస్తూ, దత్తుని వుడికించారు.

"మేమంతా సరదాగా భార్యల్ని వెంటబెట్టుకొ స్తే నువ్వు ఒక్కడివే వచ్చావేమిటోయ్! ఏం? మీ యావిడిని మేము చూడకూడదా!"- ఇలా అతన్ని మాటలతో దూసారు. అంతేగాదు. "నువ్వు మీ యావిడ చెప్పినట్లు వింటావనీ, ఆమె చెప్పు చేతల్లోనే వుంటూ ప్రవర్తించుతూ వున్న వాడివనీ ఆమె ఆజ్ఞలేనిదే నువ్వే పనీ చేయవనీ, భార్యకు లొంగివుండే రకమనీ, సభ్యత- సంస్కారం, లేవనీ" యిలా క్రమక్రమంగా యెన్నో రకాలుగా అన్నారు. దత్తు అన్నీ విన్నాడు. తలవంచుకుని, తన ప్రవర్తనని సమీక్షించుకున్నాడు. కోపం వచ్చి- ఒకనాడు భార్యని, తనతోపాటు ఎక్కడికి పడితే. అక్కడికి రమ్మన్నాడు. వంటయింటి కుందేలుగా వుండొద్దు. భర్తతో సమానంగా- భార్యకూడా తిరగటం నేర్చుకోవాలని ఉద్బోధించాడు. లేకపోతే చదువు- సంస్కారం- సభ్యతలేని వాళ్ళమని నలుగురూ హేళన చేస్తారని చెప్పాడు. యీ విపరీత పరిణామం యేదో రగడకు దారి తీస్తోందని రమణి వూహించి, అతని మాటలకు యెదురు నిల్చి-

"నే నలా ప్రవర్తించను. నా కిష్టం లేదు..." అంది.

"అయితే. నన్ను నలుగురిలో అగౌరవపరుస్తావా?"

"భార్యగా మీ పాదపూజ చేయటానికి బ్రతుకుతున్న దాన్ని. పదిమందిలోకి రమ్మన మనటం మీకు న్యాయమేనా?" ఆ ప్రయత్నం నన్ను అగౌరవ పరుస్తున్నట్లుగాదూ!

నా వ్యక్తిత్వాన్ని కించ పర్చటంగాదూ! చెప్పండి...

"అయితే నా ఆదర్శాలు- అభిప్రాయాలు- నీకు నచ్చటం లేదన్న మాటేగా?"

-రమణి మాట్లాడలేదు. అతను అప్పుడే చాలాసార్లు భార్యను అడిగాడు. ఆమె కడకు నిరాకరించింది- అంతే. దత్తు మనస్సు విరిగింది. ఎడబాటు కల్గింది. ఆడదంటే ఆ నాడే అసహ్యం వేసింది. జీవితమంటే చిరాకెత్తింది. "తనతో కలిసి, సరదాలు- సంతోషాలు- పంచుకుని ఆనందించలేని స్త్రీ, భార్యగా వుండటం అనవసరమని తేల్చుకున్నాడు. తన జీవితానికి అనుగుణ్యమైన మార్గంలో, వెంట నీడలాగా సహకరించే ఆడది భార్యగా వుండాలి అని నమ్ముకున్నందుకు నిరాశ కల్గింది. యింకా, తనకు భార్య దేనికి? రమణితో సంసారం చేయటం దేనికి? అసలు యిక రమణికీ- తనకీ సంబంధం లేదు. భర్తతోడిదే భార్యకు లోకమని, భార్యతోడిదే భర్తకు సౌఖ్యమనీ, సుందరమనీ. సౌభాగ్యమనీ, సంతోషమనీ, ఆనందమనీ యింతవరకూ. రమణి కంటే యెక్కువగా అనుకున్నాను. అందుకు తగిన శాస్తి జరిగింది. యిలా దత్తు తన భార్యముందు అవమానపడటంతో విరక్తి చెందాడు... ఒక్కసారి దత్తుకి పూర్వస్థితీ, నిల్చున్నపాళాన కలిగింది- "నువ్వు... యిప్పటికి నన్ను యిట్లా లోబర్చుకుంటావనుకో లేదు. ఛీ...! నువ్వు మళ్ళా నా భార్యగా బ్రతకటానికి, నా జీవితంలోకి ప్రవేశించటం నేను సహించలేను. నాకిష్టం లేదు. నువ్వు నా రమణివి కావు. నాకు భార్యలేదని ఏనాడో మనస్సుని రాయి చేసుకొన్నాను. నా జీవితం ఏనాడో నాశనమై పోయిందని

భావించాను. నేనెంత బాగా చెడిపోవటానకి ప్రయత్నించితే, నిన్నంత తేలికగా మరవటంజరుగుతుంది. నన్ను పోనీ!, మళ్లా త్రాగుతూ- తిరగనీ...! ఊఁ". అంటూ -రమణిని ఒక్క- తన్నుతన్ని బలంగా — ఆమెనుంచి దూరంగా నడిచి వెళ్ళ బోయాడు. ఆమెవెంట నడిచింది... లేని ఓపిక తెచ్చుకొని —లేచి —"నువ్వు నాతో రావద్దు... చెడి పోతావు..." అంటూండగా రమణి వెంటబడింది... చేతిలోని ఫోటోని విసిరాడు... అతని పాదాల్ని పట్టుకుంటానికి, ఆమె వెళ్ళే సమయంలో — విసిరిన —ఆఫోటో—రమణి ముఖానికి తపీమని తగిలి—నెత్తురు చిమ్మింది... అతను చూసాడు... చలించ లేదు... "అనుభవించు..." అంటూ మెట్లు దిగబోయాడు.... అయినా రమణి వూరుకోక — లెఖ్ఖచేయక, భర్తతోడిదే లోకమని సౌఖ్యమనీ, సుందరమనీ ఆనందమనీ, నమ్ముకుని, చేతికందిన అదృష్టఫలాన్ని జారవిడ్చుకోలేక — దత్తువెంట నీడలాగా అనుసరించింది — ఎక్కడికి? తీరా, రజని, భర్తతో కార్లో వచ్చేసరికి, యిల్లు బావురుమంటూవుంది "భార్యా భర్తలేమైనార"ని సందేహం కల్గింది-. తన భర్త ఒక పోలీ సాఫీసరు. తానో సంఘ సేవిక. లాభం?...

ఎవరు చెబుతారు?

జీర్ణగతుడి జీవితంకి నిర్వాచనంఏమిటి ?

అతణ్ణే నమ్ముకుని ఆరాధించే భార్య బ్రతుకేమిటి ?

# ప్రాక్పశ్చిమాలు

పొద్దువాటారు తోంది. ఆ చిన్న రైల్వేస్టేషన్‌కి యిరువైపులా, పారే కృష్ణా కాలవలు, బంగారు రంగు సూర్య కిరణాలతో మనోహరంగా కనిపిస్తున్నాయి. చుట్టూ తుమ్మ బీళ్ళతో వ్యాపించివున్న ఆస్టేషన్, చీకటి కరుళ్ళు కరుళ్ళుగా ముసురుకోగానే, విద్యుద్దీపాల కాంతుల్తో ప్రకాశవంత మవుతుంది. కళాహృదయం, క్షణంసేపు గిజిగాని గూడులాగా చలించటానికి, ఆస్టేషన్ చుట్టూవున్న వాతావరణమెంతో ప్రశాంతమై, తోడ్పడుతూవుంటుంది.

పొద్దుబాగా పడమటి దిక్కున దాగిపోయింది. సిరా వానలాంటి చీకటి, ఆ తుమ్మబీళ్ళగుండా, యీత బొత్తలపై, నింగిని చూసే గడ్డికొసలపై జలజలమని రాలుతోంది. దానికి సైదోడుగా మంచుకూడా కురుస్తోంది. పోర్టరు గంట కొట్టాడు. తూర్పు దిక్కుగా పచ్చరంగు రెక్క వాలింది. రైలు ఆవరించిన చీకటిని, దూసుకుంటూ, స్టేషన్‌లోకివచ్చి ఆగింది... రెండోక్లాసు నుండి ఒక నాజూకు యువకుడు దిగాడు. రైలు కూతకూసి కదలి వెళ్ళిపోయింది.

రైలు దిగిన ఆ యువకుడు జెండా కర్రలాగా, ఆ ప్లాటు ఫారాన్నంతా కలయచూశాడు. చీకటి గుండెలో వెలిగిన దీపంలాగా, ఆ స్టేషన్ తప్ప, మరేయితర దృశ్యమూ, అతనికి కనిపించలేదు. కాసేపు అటూ– యిటూ విషాదంగా పచార్లు చేశాడు. అతనితో యెవరూ దిగనన్నా లేదు. కనీసం ఒక్క ప్రయాణీకుడైనా, ఆ ప్రాంతంలో దృగ్గోచరం కాలేదు. ఆశ్చర్యం వేసింది. ఆ యువకుడు చేతులూపుకుంటూ నత్తలాగా నడుస్తూ, చేరువలో అతనికి మల్లేవున్న విద్యుద్దీప స్తంభం క్రిందికి చేరాడు. కరకమలాల్లో వున్న క్యాలికో బైండు పుస్తకాన్ని కాసేపు వుబుసు పోకగా చూస్తూ నిర్వేదంతో కాలక్షేపం చేయసాగాడు... ఏమీ తోచటం లేదు కాబోలు, కళ్ళజోడు తీసి అద్దాలు తుడవటం మొదలెట్టాడు. శరీరానికి వదులుగావున్న పైజామా, లాల్చీలు, తూర్పుగాలి విసుర్లకి, రెపరెపలాడుతున్నాయి, తొడిగిన ఆకు చెప్పుల్లో, చలిగాడు చిలిపిగా దూరి, గిలిగింతలు పెడుతూ, వణకిస్తున్నాడు... సిగరెట్లు, వూరికే కాల్చబడుతున్నాయి., అతనో బెంగాలీ బాబులాగా, ఆప్రగాడగాడధ్వాంతిలో, ఒక గొప్ప కవిత్వం వ్రాసేగాసగాడి వినూత్న భావ పరంపరలతో, అలమటిస్తున్నాడు...ఎందుకు ఆస్టేషన్‌లో దిగాడో? అడిగి తెలుసుకొనే దిక్కు లేదు. ఎవరికోసం, చూస్తూ, ఎక్కడికి పోవాలనుకుంటున్నాడో! అతని ముఖంవల్ల వ్యక్తంకావటంలేదు. ఎంతసేపు అలా కాలాన్ని వృధాచేస్తాడో? యేమీ అర్థంలేకుండా వుంది... వాస్తవంగా 'అర్థంలేకుండా ప్రవర్తించటం, మానవుడికో అలవాటు.'

అరగంట గడిచింది. పడమటిదెసనుండి రైలు రావాలి. కానీ, రాలేదు. ఆలస్యం, అతని వాటర్ ప్రూఫ్ గడియారం ద్వారా, భరించలేనంతగా అయింది. "వెధవరైళ్ళు. అవసరానికి యెప్పుడూ ఆలస్యంగానే వస్తయి.." అతను ముఖం చిట్లించుకొంటూ లోలోన విసుక్కున్నాడు చిరాకుగా. అయినా, రైలు రాలేదు. అదే విచిత్రం." మానవుని అదుర్దాకూ, అభిరుచుల ఆవేదనాలకూ మనోభావాలవేగానికీ కాలం యెప్పుడూ అలస్యంగా ప్రవర్తించి, ఆటంకాలనూ— విసుగునీ అసహ్యాన్ని కల్గిస్తుంది. తృప్తినీ, ఆకాంక్షనూ అణగారుస్తుంది.

"ఏమిటీ యింకా రైలు రాలేదు...ఛీ...!"— అతను తూష్ణీభావంతో, పడమరగా చూసి, చేతిలో పుస్తకాన్ని గభాల్ను తెరచి, టపామని మూసేశాడు...మళ్ళా గడియారాన్ని చూసుకున్నాడు... ఎనిమిదిన్నర పైచిలుకు అయింది. అతనొక మహారణ్యంలో— ఒంటరి బంగళాలో— దిక్కుతోచక శాపగ్రస్తుడై పడివున్నట్లుగా భావించుకోసాగాడు నిల్చుండి, నిరీక్షించే వోపిక లేక, వెళ్ళి నెమ్మదిగా ఒక కొయ్యబెంచీపై చతికిలబడ్డాడు. సిగరెట్టు బలహీనంగా ముట్టించాడు... వదులుతున్న పొగ వుంగరాలు తిరుగుతూ, విరహవిషాద నిషా హామేషాలోకి పోయి ఐక్యమవుతోంది— ఆడదాన్ని గురించి మొగవాడిలో ఆలోచనే కలగకూడదు. ఒకవేళ కలిగిందో, వాడి యావజ్జీవిత శక్తీ చాలదు—ఆలోచించి ఆనందపడటానికి... పురుషుడు పురుషత్వంతో యేనాడైతే, బ్రతకలేక పోతాడో, అనాడే అతగాడి చుట్టూ స్త్రీకి



సంబంధించిన విషయమంతా, విషాద రూపంలో మహావైతరణి వాహినీమై వుంటుంది—

"అసలు ఆవిడగారు వస్తుందో? రాదో?"— అతను సందేహంగా ఆలోచించసాగాడు. గడియారం ఆలస్యాన్ని మినహా, మరేవిషయాన్ని తెలపటంలేదు. "యివ్వాళ జగన్మోహన్ వివాహమని గుర్తుందో? లేదో"?— అతను పడమరగా చూస్తూ అన్నాడు తనలో తాన్నై. సందేహాల మూట విప్పటమే పొరబాటు. అన్నీ అవ్వే క్రొత్త రూపం దాల్చి, మనిషిని క్రుంగతీస్తయి.

ఇంతలో, అకస్మాత్తుగా పోర్టరు గంట మ్రోగించాడు. సిగ్నల్ యివ్వబడింది. రైలు ఒక కొండకొమ్ము కావలనుండి మలుపు తిరుగుతూ వచ్చే సూచనలు స్పష్టంగా కనిపిస్తూ వున్నాయి. అతను దిగ్గున లేచి, ప్లాటుఫారంమీదికొచ్చి గంపెడు సంతోషంతో నిలబడ్డాడు... చీకటిని చీలుస్తూ, రైలు మెలికలు తిరుగుతూ వచ్చి—వచ్చి ఆస్టేషన్‌లో బరువుగా ఆగింది. అతను పెట్టెల్ని ఒక్కటొక్కటిగా చూస్తో, ముందుకీ—వెనక్కీ తిరుగాడుతున్నాడు. ...'శంపాలత'—ఆ చీకటి తెరల్ని తొలగతీస్తోదిగింది. అతను చూడలేదు. యింకా అటూ- యిటూ ఆదుర్దాగా చూస్తో, నిరాశను కల్పించు కుంటూ వున్నాడు. రైలు ఒక్క పెట్టున గాండ్రించి, కదిలి... వెళ్ళిపోయింది... అతను, బరువుగా, వెళ్ళిపోతున్న రైలుని చూసి, నిట్టూర్చాడు.. ఆమె, స్టేషను మాస్టరుకి టికెట్టు యిస్తూ నిలబడింది. అతను తలవంచుకొని, ముందుకి వస్తూ' ఆమెను చూడకుండా, తిన్నగా యెటోదారి తీయబోతు

న్నాడు. ఆమె ఆ దాటున చూసింది. తొందర, తొందరగా రెండడుగులు వేసి, -నమస్కారం వేణుగోపాలంగారు!"— అంటూ అతని పరధ్యానాన్ని భగ్నం చేసింది. అతను తల ప్రక్కకి త్రిప్పి చూశాడు. దివినుండి జారిన దివ్యమణిలాగా 'శంపాలత' అతని కళ్ళముందు తళుక్కున మెరిసింది. ప్రతి నమస్కారం సమర్పిస్తూ- తన నిరీక్షణనంతా, ఒక్కమాటలో పొదుగుతూ—

"తమ కోసం యింతదాకా యెదురు చూసేసరికి...
"యింకేదో అనబోయాడు.

"అలసిపోయారా? కళ్ళు కాయలు కాచాయా? మన సుని రాయి చేసుకున్నారా? యేమైంది?"- శంపాలత గుక్క తిప్పు కోకుండా అనేసింది—

"మీరు చెప్పినవన్నీ నిజమే అయినయి..."- ముక్తసరిగా వేణుగోపాలం అన్నాడు. అంతకన్నా యెక్కువ మాట్లాడినా, శంపాలతవద్ద యేం లాభంలేదు కాబట్టి—

"మీరు భలే తమాషా మనుషులండీ!"— అంటూ ఆమె 'చలం' నాయికలా నవ్వింది. అతనికి ఒళ్లుమండి పోయింది. ఇరువురూ జగన్మోహన్ గ్రామానికి, నడవటం మొదలెట్టారు —ప్రక్క- ప్రక్కగా శబ్దార్థాల్లాగా— ఆ చీకట్లో శంపాలత 'బుచ్చిబాబుకి' యిష్టమైన అవయవాల కదలికలతో, నడుస్తూ— వుంటే, వేణుగోపాలం, త్రాసు త్రాడులాగా నడుస్తూ, వూగుతున్నాడు. 'భరద్వాజ' మాటల మూటను, రాణింపు కోసం విప్పుతూ— శంపాలత, "మీరెప్పుడొచ్చారూ?" అంది. వేణుగోపాలం చెప్పాడు... శరత్ బాబు

గనుక, అదృష్టంకొద్దీ జీవించివున్నట్లయితే, వేణుగోపాలం చెప్పిన సమాధానాన్ని, ఒక నవలగా వ్రాసివుండేవాడు... పాపం! లేకపోయాడు. చరిత్రకే, కానిదశ యేర్పడింది. అసలు సాహిత్యానికే అదృష్టం పోయింది... ఇరువురూ స్టేషన్ దాటి ఒక ఫర్లాంగు దూరం, కాలపగట వెంట నడిచారు. అటుపిమ్మట దారి, చేలగట్ల మీదుగా మళ్ళి, పోతూవుంది— పట్నవాసంలో అలవాటైన నడకను, పల్లెటూరి మార్గంలోకి మార్చవలసి వచ్చేసరికి యిరువురిలోనూ ఒక ప్రత్యేకమైన మార్పు కనబడింది—

వరిచేలకు అడ్డంబడి, గట్లమీదుగా, జనప మొక్కల్ని తొలుక్కుంటూ, పాదాలక్రింద మెత్తగా తగిలే, పసిరిక కాడల్ని దాటుతూ, పురుగూ పుట్రావుంటయ్యేమో! అని భయపడుతూ— శరత్ రచనా శైలిలాగా వేణుగోపాలమూ, చలం, కలంబాణిలాగ శంపాలత నడుస్తున్నారు. చీకటి తెరలు వాళ్ళిద్దర్నీ క్రమ్మేస్తున్నయి. చలిగాలి, పీక్కు తింటోంది— అతను వేడి కోసం సిగరెట్లు కాలుస్తున్నాడు. ఆమె కుతి తీరేందుకు వక్కపొడి నములుతోంది.

"ఇంకా యెంతదూర మిట్లా అవస్థ పడాలి?"— గడ కర్రల మధ్య త్రాడుమీద నడిచే అబలలాగ వేణుగోపాలం, శంపాలతను ప్రశ్నించాడు. ఆమె, సానిదాని నోటినుండి, స్వాగతంలో పగిలే గాజు ముక్కల్లాంటి చిరునవ్వుల్ని విరజిమ్ముతూ—" కాస్త ధూరమే" అంది— యిరువురూ సభ్యతకు కట్టుబడిన వాళ్ళలా నడుస్తూ, కడకు చేలగట్లు దిగి, ఒక యెండిన యేటి యిసుకకు యెదురు నడుస్తూ పోసాగారు...—

అది ఆ వూరు చేరేందుకు ఒక్కటే అనువైన మార్గం... దగ్గర దారి కూడానూ...

"జగన్మోహన్ పక్కా పల్లెటూళ్లో పెళ్ళి చేసుకోక పోతే, అందరూ రావటానికి, అనువుగా వుంటే, యే పట్నం లోనో చేసుకుంటే ఎంత బావుండేది?"

"అవునవును" ఆమె యెద్దేవాగా అంది. అతనికి అర్థం కాలేదు.

"ఏమిటలా అన్నారు?"– అతను తెల్లమొగం వేస్తూ అడిగాడు...

"ఆడవాళ్లు అప్పుడప్పుడూ అలా యేవేవో అంటూ వుంటారు. మీ లాంటి వాళ్లు అస్తమానమూ శల్యపరీక్ష చేస్తూ 'ఏమిటీ' అని అడక్కూడదు. ఏమీ లేక పోయినా, ఏదో ఒకటి అనటమే ఆడవాళ్ళకు లక్షణం"

–లక్షణం కాదు. ఆ మాటంటే అసలు నేను ఒప్పు కోను. 'జబ్బు' అనండి!"

"యీ వాదనవల్ల ప్రయోజన మేముంది చెప్పండి!

"వూరు చేరేవరకు యింకేం మాట్లాడుతాం?"

"మాట్లాడ దల్చుకుంటే లక్ష సమస్య లున్నాయి."

"ఒకటి చెప్పండి శంపాలతగారూ!"– అతను నవ్వుతూ అడిగాడు.

"మీ అభిమాన రచయిత యెవరు?" ఆమె అడిగింది.

"శరత్ బాబు..." వేణుగోపాలం ఆత్మ విశ్వాసంతో చెప్పాడు. దృఢంగా... శంపాలత, హేళనగా పకాపకమని నవ్వింది. ద్వాదశి చంద్రుడు మసక మసకగా బూచుల్లాంటి

మబ్బులమధ్య తారాడుతూ వున్నాడు. వేణుగోపాలంకి ఆమె నవ్వు సనేమీ అర్థంకాలేదు. శరత్ గనుక ఆ నవ్వుని చూసి నట్లయితే, "యిలాంటి వాళ్లు నా చదువరులకు యెందుకు

స్నేహలత ద్వారా పరిచయమై, తటస్థ పడ్డారా!" అని వోరున యేడ్చి ఘోషించేవాడు. కానీ వేణుగోపాలం, రవ్వంతైనా కంట తడి పెట్టలేదు. అసలు కళ్లే చెమ్మగిల్లలేదు. కానీ జరిగిందొక్కటే! 'చిన్నబోయాడు...' అంతే! వెంటనే తెప్పరిల్లిన గళంతో– "ఏం? అలా నవ్వుతారు?" స్త్రీపట్ల సహజంగా వుండే అమాయకత్వాన్ని గుర్తు చేసుకుంటూ అడిగాడు.

"ఆఁ... ఏం లేదు..." ఆమె ముక్తసరిగా జవాబిచ్చింది. వేణుగోపాలంకి, "శంపాలత ఏదో చెప్పబోయి, ఆ సంగతిని మరుగు పర్చేసింది" అని తెలిసింది—

"మీరలా అంటే నా కేమిటోగా వుంది. నన్ను నేను సంబాళించుకోలేక పోతున్నాను." వేణుగోపాలం విచలిత హృదయుడై అంటున్నాడు.

"చెప్పలేరా?"—

"చేత కావటం లేదు..."

"మీది కాదా అసమర్థత. శరత్ బాబుదే!"

"ఎందుకని?"

అతని రచనల ప్రభావం మీ లాంటి బలహీనుల్ని అలాగే మారుస్తుంది"

"అంటే ఏమిటో కాస్త విపులీకరించండి."– వేణుగోపాలం, తనేదో క్రొత్త సత్యాన్ని శోధించి కనిపెడుతున్న

వాడిలాగ ప్రశ్నించాడు.

"తన మనస్సులోవున్న భావాన్ని మరో మనస్సుకి సూటిగా చెప్పలేక పోవటం, ఒక స్థిరమైన వుద్దేశ్యాన్ని పదే పదే చెబుతూ, పేజీలు నింపి, చదివేవాడికి వుత్సాహం తగ్గించటం, సరిహద్దుల్ని గీసి, పాత్ర చిత్రీకరణ చేయటం, ఒక్కొక్కడి చేత, ఒక్కో వుపన్యాసం బలవంతంగా చెప్పించి, విప్లవవాదాన్ని లేవదీయటం యిలా మందకొడి పనులు చాలా...చాలా..."

"అయితే మీ అభిమాన రచయిత 'చలం' అలా చేయనే చేయలేదా?"

"లేదు..." శంపాలత గట్టిగా చెప్పింది. అతను నమ్మలేదు...

"చలం ప్రతిచిన్న విషయాన్ని గుండెకు హత్తుకునేలాగు చెప్పగలడా?"

"చచ్చేటట్టు! యెదుటివాడి నోరు మూయటానికి శరత్ లాగా భారీమెత్తున వాక్యాన్ని సాగతీయడు... ఒక్క మాటలో టక్కున నొక్కి చెప్పి, నోరు మూయిస్తాడు...."

"అదే నాకు నచ్చదు లతగారూ!"

అందుకే మీరిలా వున్నారు..."

చంపలు వాయించినట్లుగా శంపాలత అంది. వేణు గోపాలం అదిరిపోయాడు. యిరువురూ తర్జన భర్జనలు చేసుకుంటూ ఆ యేరుదాటి. గ్రామంలోకి ప్రవేశించి, జగన్మోహన్ యింటికి చేరారు. అతను, ఆలస్యంగా వచ్చిన యీ యిరువుర్నీ తన పెళ్ళికొచ్చిన మిగతా స్నేహితులకు సంతోషంతో ఆ రాత్రే పరిచయం చేశాడు, శంపాలత పసుపు పచ్చగా-

దబ్బపండు లాగా వుంటుంది. పొట్టిగా పోతపోసిన విగ్రహానికీ ఆమెకూ ఆంధ్రదేశపు అంచనా ప్రకారం అంగుళాల్లో కూడా పెద్ద తేడా యేమీ వుండదు. మరీ భూమికి జానెడెత్తుగా వుండి, మేజాకోడు, లాగా నిలబడదు. ఆమెకు, యే పురాకృత సుకృతం తో వైందోగానీ, పురుషుడంటే వుత్త వెర్రి వెంగళప్ప అనే మోటుభావం యీ నాటి వరకూ మనస్సుకి పట్టివుంది. స్వేచ్ఛా విహంగం. నిముషానికో క్రొత్త ఫ్యాషన్ రంగు చీరలు కడుతుంది. భూమి ఒకసారి తనచుట్టూ తాను తిరిగి, సూర్యుని చుట్టూ ప్రదక్షిణం వేసి వచ్చేసరికి, ఆమె ఒంటి మీద అన్ని రకాల రంగుల్నీ ముచ్చటగా చూడొచ్చు. ఆమెను, యే కేంద్రమంత్రి అయినా, పోనీ, యే రాష్ట్రమంత్రి అయినా, "ఆంధ్రదేశపు అందాల రాణి" అని అంటే, యిక ఆంధ్రప్రదేశానికి సుస్థిరమైన కీర్తి ప్రతిష్ఠలు ప్రాప్తించి, ధన్యమైనట్లే!—

ఇదంతా వేణుగోపాలానికి లోగడే తెలుసు. అయినా, ఆమె నిర్మొహమాటంగా వాగే అసభ్యతగల సరదా మనిషి. ప్రాక్పశ్చిమాలలో వుండి స్నేహలత రూపేణా వుత్తరాలు జరిగినయి. ప్రాణ స్నేహితులైనారు. యిరువురూ దైవికంవల్ల అవివాహితులు. యిదేవాళ్ళు తొలిగా కలుసుకోవటం. జగన్మోహన్ వివాహమే గనుక, యిప్పట్లో జరిగి వుండక పోయినట్లయితే, వాళ్ళ రసమయ సమావేశం యెప్పటి వరకూ వేచి వుండాల్సొచ్చేదో!... పాపం!! ఏమైతేనేం, జగన్మోహన్ పెళ్ళి చలవవల్ల, వేణుగోపాలం- శంపాలతలు స్నేహ పూర్వకంగా కలుసుకోగల్గారు. అంటే 'శరత్ బాబూ- చలం' సన్నిహిత

త్యంతో కలుసుకున్నారని జనవాక్యం...

ఆ రాత్రి పెళ్ళి హడావిడిలో, జగన్మోహన్ మునిగి పోయాడు. అందరితో పాటు వేణుగోపాలమూ- శంపాలతా భోజనాలు ముగించుకున్నారు. తమకు ఒక మేడమీద బస యేర్పాటు చేయించుకున్నారు. ఇరువురూ మెల్లిగా వెళ్ళి ఆ మేడమీద గదిలో అమర్చబడివున్న కుర్చీల్లో కూర్చున్నారు. వెన్నెల పాటలు- పాటలుగా కురుస్తోంది. వాళ్ళ అవుసరాలు తరుచు అడిగి తీర్చేందుకు జగన్మోహన్ ద్వారా ఒక కుర్ర వాడు వచ్చాడు. అతను ఆ ప్రాంతంలో వుంటూ చాటుగా సిగరెట్లు కాల్చుకుంటున్నాడు. ఏం చేస్తాడు మరి! గదిలో వాళ్ళిద్దరూ వాదోపవాదనగా వాగుకుంటుంటే!-

మీారేమన్నా అనుకోండి లతగారూ!"

"ఎందుకండీ!"

"చలం సాహిత్యం నా కేమిటో అసహ్యంగా వుంటుంది"—

శంపాలత, 'బుచ్చిబాబు' కోమలిలా ముఖం పెట్టి— 'చలం' రాజేశ్వరి లాగా, "అసహ్యమా! అది అనుకున్నంతగా ఆయన రచనల్లో లేనేలేదు. అది ఒకవేళ వుందేమోననీ, పోనీ, వుంటుందేమోననీ భయపడటం నా కెంతో అసహ్యంగా వుంది..."

"నిజంగా వుంది లతగారూ!"

"అది మీారనుకునే అసహ్యం కానే కాదు."

"మరేమిటి?"

"వాస్తవికతకు ఆధారమైన చెరగని భావం, ధైర్యంతో

చదువుకోని, నగ్న సత్యమనేది జీవితానికి యెలా యేర్పడి వుందో తెలియ పర్చే ఔషధం"

"ఆయనపట్ల మీకున్న అభిమానాన్ని, ఆత్మవంచన చేసుకుని చెబుతున్నారు."

"లేదు— వేణుగోపాలంగారూ! ఆయన రచనల్లో యేదైనా చూడండి...—"

"ఏది చూసినా రోత పుట్టించే భావమే! సిగ్గు వేసే సన్నివేశమే! మరీ అంత బట్టబయలుగా రచయిత అనే వ్యక్తి చేయవలసిన పాడు పనిగాదు."

"మీరు చాలా పొరబడ్డారు. చలం నవలలు- నాటికలూ- నాటకాలూ ఆ సంగతి వదిలెయ్యండి. మచ్చుకి ఒక చిన్న రచన చూడండి!"

"ఏమిటది?"

"ఏదైతేనేం... పేరెందుకూ? విషయం చెప్తాను."

"చెప్పండి..."

ఆమె "ఓ పువ్వు పూసింది" అనే పేరుగల కథనుగూర్చి వుపన్యసించింది.

"నేనా కథ చదువలేదు..." అతను ముఖం వేల వేశాడు.

"అందుకే నేను పేరు మొదట్లో చెప్పదల్చలేదు..."

"మీరు చెప్పినదంతా ప్రకృతిని గురించి"

"వాస్తవికత లేదా?"

"కల్పన లేకపోతే, వాస్తవికత కమ్మగా వుండదు..."

"అది కేవలం చలం దృష్టిలోనూ- సృష్టిలోనూ రంగు

పూత లాంటిది. గారడీవాని పని. రచయితకు రచనా శిల్పం తక్కువైనప్పుడు, కల్పనకోసం కళ్ళు పైకెత్తి చూస్తాడు... చెప్పదల్చుకున్న వాస్తవికతను కల్పన కేవలం, సహాయకారిగా వుంటే నష్టమేమీ లేదు. కానీ, కల్పనకోసం వాస్తవికతను మార్చటం కథకునికి మంచిపనిగాదు. సహృదయుడైన చదువరికి, వాస్తవికతను నిరూపించే కథలోని కల్పనగాదూ ముఖ్యం శిల్పం. అదే చదువరికి రచయిత పెట్టే భిక్ష. అంతేగానీ, కల్పనాత్మకమైన కథలో వాస్తవికతను యిమిడ్చి, మెప్పుకోలుగా వ్రాయటం, అంతపని రచయితే చేయనవుసరం లేదు. పాటకుడైన ప్రతివాడూ యింతో అంతో చేయగలడు......"

"నేను మీ జవాబుకి ఒప్పుకోను. కల్పన లేకపోతే వాస్తవికానికి రాణింపు లేదు..."

"రాణింపుకోసం శరత్ లాగా రచనలు చేయటం చలానికి చేతగాదు. అబద్ధాన్ని- అసందర్భంగా వచ్చే సంస్కారాన్ని చలం సహించలేడు. దొంగపూజలు చేస్తూ దేవాలయంలో కోరిన వ్యక్తిని కలుసుకోవటం, స్త్రీ హృదయం అనాదినుంచీ పాతివ్రత్య సంభూతం అని చెప్పటం- తడవ తడవకీ పాదధూళి అంటూ, ప్రవేశపెట్టిన ప్రతి స్త్రీ వంగి లేస్తూ పేజీలు దాటటం మ్లానవదనాన్ని- విచలిత హృదయుల్నీ- ఏం తోచక, చేయి జారిన ఆడదాని కోసం, త్రాగే పురుషుల్నీ- హుక్కా పీకుతూ చదరంగం ఆడే సోమరిపోతుల్నీ- సంస్కారమంటూ ముసలివాళ్ళ దగ్గర వుపన్యాసాలిచ్చే వాళ్ళనీ- గుర్తు చేసి, జాలి చూపమనటం చలానికి

అలవాటు లేవు. గిట్టవు. శరత్ బాబు ఒక నవలలో చెప్పే విషయం, చలం ఒక్క వాక్యంలో తీర్చి ధన్‌మని చెప్పే స్తాడు... చెత్త వ్రాసి "చదవండిరా బాబూ!" అని శరత్ లాగా చలం ప్రసూరుమనడు... చలానికి పడికట్టుగా వ్రాయ టం తెలుసు. చదువరిని యెలా తన వెంట నడిపించుకోవాలో చలానికి తప్ప మరెవ్వరికీ అట్టుపైన తెలీదు. ఇంతో అంతో తె. సూరి, వి. డి. ప్ర- బుచ్చిబాబులికి తెలుసు. 'తన రచన చదివే పాటకుడు తనని గురించి యే మనుకుంటున్నాడో! చలా నికి యిట్టే తెలుస్తుంది... శరత్‌కి ఏం తెలుసు?"

"మీరు చాలా వుద్రేకంగా మాట్లాడు తున్నారు".

"మీ లాంటి వారితో అలా మాట్లాడితేనే గానీ తృప్తిగా వుండదు"

"అయితే యీ పాడు లోకాన్ని మరింత పాడు చేయట మేనా చలం వుద్దేశ్యం?"

"అది యెవరికున్న సంస్కారాన్ని బట్టి వాళ్ళు చెప్పే మాటగానీ, సహజమైంది మాత్రం గాదు. అబద్ధీకుని ప్రణయం లాంటిది."

"అని మీ రెలా చెప్పగలరు?"

శంపాలత వోడిపోయింది. జవాబుకోసం తడుముకొంది. "వయసు వసంత ఋతువులాగా మారినపుడు, వలపు తలపులు ముసురు కొన్నప్పుడు, కన్యచెర విడిచిపుచ్చిన వన్నెల విసన కర్రల్లాంటి వయసు కత్తెకు కనీసం కుక్కయినా వుండాలీ, లేకపోతే మొగదిక్కన్నా వుండాలీ?!" అని స్త్రీలపాలిట వకాల్తా పుచ్చుకుని, సమర్థనీయంగా మాట్లాడే శంపాలతకు

యేమీ తోచలేదు. వేణుగోపాలం, మళ్ళీ ఏ ప్రశ్నా వేయలేదు. ఆమె మూగదానిలా లేచి, గదిదాటి, వెన్నెల్లోకి వచ్చి నిలబడింది- తరువాత, ఆ కుర్రవాడు వాళ్ళిద్దరికీ ఏమిటో చెప్పి, పెళ్లి పందిరిలోకి వెంటతీసుకు పోయాడు. శంపాలత, వేణుగోపాలం ఒక్కచోట కూర్చొని జగన్మోహన్ సూత్రం కడుతుంటే చూస్తున్నారు. వేణుగోపాలం వస్తుతహా మొగ మాటస్తున్నాడు. చూసి ఆనందించుటమే అతని పరమావధి. బరువుగా వుండే పరిసితిని భరించలేడు. 'కాదు కూడదు' అంటే సరేనంటాడు. అతను కీర్తి కాముడు. "శంపాలతను ఎలాగైతేనేం నోరు మూయించాను" అని సంబరపడుతూ లోలోన తృప్తిచెంద సాగాడు. ఆ రాత్రి జనం అంతా ఎవరి బసలకు వాళ్లు చేరేసరికి గురకొయ్యలు బాగా వాలినయి పడమర దిశకు. జగన్మోహన్ వివాహం జరుగుతున్నంత సేపు శంపా లత గుండెలు పులకరింపులతో తొలకరిస్తూ సలవరించినయి. వయసుకత్తె ఆలోచనలు పెళ్ళి సంబంరం చూసేసరికి కళ్లెం లేని గుర్రంలాగా పరుగులెత్తుతయి.

"పాతికేళ్ళు వచ్చిన తన యవ్వనానికి పరమానందం యెట్లా కల్గేది?" కురుస్తున్న ద్వాదశి వెన్నెల్లో తడిసిపోతూ శంపాలత ఆలోచన చేయసాగింది. మబ్బుల చాటున చంద మామ శంపాలతతో మంతనాలాడుతున్నాడు. చుట్టూవున్న నిద్రాణ ప్రకృతి నిశ్శబ్ధంతో మూగన్నుగా నిద్రపోతోంది. తీయ తీయని వూహాలు 'అమీనా'కు కల్గినట్లు 'రాజేశ్వరి'లా తపించి పోసాగింది. 'చిత్రాంగద' మాదిరిగా, చలించసాగింది.

వేణుగోపాలం, పనిమీద గదిలో పడుకొని అటూ-

యిటూ నిద్ర రాక ఒత్తిగిల్లుతున్నాడు. ఆరుబయట శంపా లత, అధరాలు తడి చేసుకొంటూ ఒకచోట కూర్చొని వుంది— అరగంట గడిచింది. వేణుగోపాలం ఒంటరిపాటును భరించలేక లేచి, ఆరుబయటికొచ్చాడు. శంపాలత కలువ పువ్వులాగా విరహ వేదనను అనుభవిస్తోంది— చలం చెప్పినట్లుగా— ఒకచోట...—

సృష్టిలోకల్లా అందమైనది— ఆనందమైనదీ విలువైనదీ రాత్రి. వెన్నెల కురిసే రాత్రి మరీను. స్త్రీ సౌందర్యం కళ్లారా చూడాలంటే అలాంటి వేళప్పుడే చూడాలి. రాత్రి ప్రొద్దు బోయిన తరువాత ప్రశాంత వాతావరణంలో యే స్త్రీ కని పించినా, ఏ మాత్రం. హృదయం వున్న వాడైనా ఆమెలోని రాసిక్యతను, అంతస్సౌందర్యాన్ని సులభంగా గుర్తించవచ్చు. అంత మనోహరమైన రాత్రిపూట యెన్నోమాటలు జీవితాన్ని సుఖవంతం చేసేవి, పెదవులు దాటి వస్తాయి. ఎందుకంటే మన స్సంతా ఆ కొద్ది సేపట్లో అనుభవంలోకి రాబోయే మధుర వాంఛల్లోకి లగ్నమై యుంటుంది... అలాంటి మధురాతి మధుర మైన కోరికల ముందు యెలాంటి ఘోర ప్రతిజ్ఞలయితే మాత్రం ఏం? దూది పింజల్లాగా గాలిలో తేలిపోతాయి.

"మీా రింకా పడుకోలేదా?"

"లేదు" ఆమె గొంతులో యేదో దృఢ సంకల్పానికి లొంగిపోయే ధ్వని సూచకమైన భావం కదలాడింది. ఒకగాలి తెర చిలిపిగా విసరి పోయింది. వాళ్ళిద్దరూ దగ్గర దగ్గరగా చేరగల్గారు. ఆమె తల్లో చేమంతులు అతణ్ణి వెర్రెత్తిస్తు న్నాయి. ఆ మొఖంలో మెదిలే కోరికలు అతణ్ణి చలింప చేసి

నయి. మేడమీదకు పాకిన సౌరతీగ ఆనలు వాళ్ళను తాకి జల్లుమంటున్నది. సౌరపూలు వెన్నెలల్లో సోయగాన్ని చూపుతున్నయి. "యిందాకట్నుంచి మనస్సంతా ఏమిటోగావుంది" -అతను అడగక పోయినా, ఆమె అనేసింది- అతను ఆశ్చర్య పోయాడు. నేలమీద సందుల్లోంచి చారికలు గట్టి వెన్నెల పారుతోంది.

"మీరూ- నేనూ ఒకయింటి వాళ్ళమయితే, యీ వెన్నెల రాత్రులన్నీ వృథా అయి పోవుగదా!"- శంపాలత తెంపుచేసి అడిగేసింది. వేణుగోపాలం ముఖాన్ని గుండెల్లో దాచుకుంటూ- "నేనూ అదే అనుకుంటున్నాను. సాహసించి అందామంటే మీ రెక్కడ బాధపడి పోతారో! అని వూరుకున్నాను" అన్నాడు. యిరువురూ తెల్లారేవరకు సమైక్య భావాలతో, క్రొత్త జీవితానికి సోపానాలు కట్టుకున్నారు వుత్సాహోగానంతో...-

పెళ్ళి చేసుకున్నాక ప్రేమించి వూహించినంత మధురంగా వుండదు జీవితం. ఆ సంవత్సరం పూర్తిగా గడవకముందే వేణుగోపాలం- శంపాలత వివాహమాడుకున్నారు. పాతమిత్రులంతా వచ్చి సంతోషాన్ని వెలిబుచ్చారు జగన్మోహన్ వూరుకుండక- "శరత్ బాబుగారి ఆదర్శాలతో చలం ఆశయాలు ఏకీభవించాయన్న మాట" అన్నాడు చలోక్తిగా- అందరితోపాటు నూత్న వధూవరులు కూడా పెళ్ళి పందిట్లో వుషారుగా నవ్వారు.

"ఇదంతా నీ పెళ్ళికొచ్చి నందుకే జరిగింది"

-వేణుగోపాలం అన్నాడు.

"చాలా సంతోషం. మనిషిని చూసి, మంచిగా మనసు మార్చుకుంటే, ఆ మానవుడు ఎప్పుడూ వుత్తముడే!" జగన్మోహన్ మెప్పుకోలుగా అన్నాడు.

ఉషారుగా మొదటి సంవత్సరం గడిచింది.

అప్పుడు కష్టాలు- బాధలూ- వార్ధక్యం- ఎండుతనం- నిరర్థకత్వం యేవీ కూడా వాళ్ళలో పొడచూపలేదు. బాల్యం యవ్వనం- లాలస- సంతోషం- ప్రేమ- మాతృత్వం యివ్వే వాళ్ళకు పెన్నిధానాలైనయి.

మందకొడిగా రెండో సంవత్సరం దొర్లింది.

లేనివన్నీ చిగిరించినయి. యింకిన బురద బాధంతా వుబికింది. రోత- కశ్మలం- పాడుకంపు- చెత్త చెదారం- మురికి వాసన కల్గినయి.

శరత్ బాబు హృదయం దారుఢ్యంతో వేణుగోపాలం, శంపాలతతో ఎలాగోలాగు సర్దుకొని కూడి వుందామనుకునే వాడు. చస్తే కుదిరేది కాదు. చలంగారి కలంచిందులూ- పసిడి పలుకులూ ఆమెను కలవర పర్చేవి. ఒకనాడు అద్దంలో చూస్తో- "నా యవ్వన మనోహరత్వమంతా, మీ బూజు పట్టిన భావాల రుద్దుడికి చిట్లిపోయింది. పెచ్చులు లేచినయి. నా లోని మదన రూపరాగమంతా కలిసిపోయింది. కామ ప్రేరణ కేవలం ఒక దిక్కుమాలిన లాలసగా మారింది. నా అందమంతా పోయింది. పరిమళం చెడింది. జుత్తు వూడి పోతోంది. కాంక్షలేవీ నా గుండెలో గులాబీలు పూయటం లేదు. యిప్పుడు నా చూపు మీ మూలంగా మార్చుకోవాల్సి వచ్చింది- నా జీవితానికి అర్థం నా లోనే యేర్పడింది—"

శంపాలత ద్విగుణోద్రేకంతో అనసాగింది—

వేణుగోపాలం 'శేష ప్రశ్న' చదువుతూ— సానిటోర్కైడ్ జడు క్లాత్ లాగా కుంచించుకు పోతూ "ఏం?" అన్నాడు. ఆమె జవాబివ్వలేదు. అతను నిశ్చల నిరీహ నేత్రాలతో ఆమెను చూస్తుండి పోయాడు కాసేపు. ఆమెకు యీ మధ్య బాగా తెలుస్తోంది— "తన లోపల క్రొత్త ప్రాణం కదులుతోంది. చోటుకోసం వెతుక్కుంటూ తన చర్మాన్ని ప్రక్కలకి బిగుతుగా సాగతీస్తోంది"— అదో పర్యుత్సుకత్వమై ఆమెను తృప్తి పరుస్తోంది—

—ఇలా మరో సంవత్సరం భారంగా నడిచింది...

అదొక రైల్వేస్టేషన్ సూర్యుడస్తమించాడు. అమావాస్య చీకటి అలముకుంటోంది. మిణుగురు పురుగులు గాలిలో వూగుతూ తిరుగుతున్నాయి. పోర్టరు మొదటి గంటకొట్టాడు. టికెట్లు యివ్వటం మొదలెట్టారు. ఒకామె చీకటినీ— గాలినీ చీల్చుకొచ్చి, ఒక టికెట్టు తీసుకుని ప్లాటుఫారం మీదికి వెళ్ళిపోయింది. తరువాత ఒకతను వచ్చి అలాగే టికెట్టు తీసుకుని, ప్లాటుఫారం మీదికి దూసుకుపోయాడు. రెండోగంట మ్రోగింది. తూర్పునుంచి రైలు పొగలు జిమ్ముకుంటూ రాబోతోంది— స్టేషన్ మాస్టరు స్టేషను దాటి ప్లాటుఫారం మీదకొచ్చి పచార్లు చేస్తుండగా ఆ ఒకామెను చూశాడు హఠాత్తుగా—

"మీ పేరు..." స్టేషన్ మాస్టరు అడిగాడు.... గుర్తుకందక.

"శంపాలత..."

"ఎప్పుడొచ్చారు?" జగన్మోహన్ పెళ్ళిలో కల్గిన పరిచ

యాన్ని పురస్కరించుకుని ఆమె చెప్పింది. విరక్తితో– విసుగుతో– అసహ్యంతో– రోతగా–

"ఎందాకా వెడుతున్నారు?"

ఆమె పడమర దిక్కు వ్రేలితో చూపింది.

"పుట్టింటికా?"

"ఊ!"

"వేణుగోపాలంగారేరీ?"

"సంసారం చేయలేక పిరికి వారైనారు..." స్టేషన్ మాస్టరు త్రుళ్ళిపడ్డాడు.

"అంటే!"

"వదిలేశారు..." ఆమె తడుముకోకుండా చెప్పింది...

"అంత పనేనా!"

"అంత మొనగాడైన పనిని మొగవాడు తప్ప మరెవ్వరూ చేయలేరు. స్త్రీ అంటే చులకన భావంవున్న వాడితో సంసారం చేయటం చాలా కష్టం..." యింకా యేమిటో చెబుదామనుకుంటుండగా తూర్పు దిశనుండి రైలు వచ్చేసింది. శంపాలత యెక్కింది. రైలు కదిలి పడమరగా వెళ్ళిపోయింది. స్టేషన్ మాస్టరుకి అంతా విచిత్రంగా తోచింది. ఒక సిగరెట్ ముట్టించుకుని, మెల్లగా ప్లాటుఫారంమీద నడుస్తూ ముందుకి పోతూండగా– మూడేళ్ళ క్రింద విన్న గొంతుక తనని పిల్చినట్లు భ్రమపడి ప్రక్కకి చూశాడు. వేణుగోపాలం, స్టేషన్ మాస్టరుని, చేత్తో రమ్మని పిలుస్తూ– వున్నాడు.

"ఇదేమిటా!" అతను దిగ్భ్రమ చెందుతూ దగ్గరకు చేరి పల్కరించాడు.

"శంపాలత యీ బండికి వెళ్ళింది గదూ!" వేణుగోపాలం నమ్ముతూ అడిగాడు. స్టేషన్ మాస్టరు "వెళ్ళింది" అని చెప్పాడు.

"అదేం పని వేణుగోపాలంగారూ!" తెలియక మాస్టరడిగాడు. వేణుగోపాలం, ఒక సిగరెట్ ముట్టించి—

"నేను చాలా పొరబాటు పని చేశాను. శంపాలతను అర్థం చేసుకోవటం చాలా కష్టం. ఆమె వుద్దేశ్యాలతో నేను ససేమిరా యేకీభవించక పోవటమే కారణం. ఆమెకు పురుషుడు భర్తగా వుండటం గిట్టదు. ప్రాణాలర్పించే స్నేహితుడుగా వుండాలి. తనకు చీకటి అవుసరం తీర్చేటందుకే, కేవలం వుపయోగపడుతూ వుండాలి. ఆమె చలంగారి రచనల్లో నడిచే దృక్పథం గల మనిషి. జీవితం కూడా ఆయన శైలిలా నడవాలంటుంది. దాన్ని నేను అస్తమానమూ ఖండించే వాణ్ణి. వాస్తవికతను కల్పనతో సమ్మేళించి వన్నె చిన్నెలు కోరతాను నేను. ఆమె వాస్తవికత్వంతో మసలమని కోరుతుంది. విలువా- ఆస్తికత- రాణింపూ- కావాలంటాను. వీటిని ఆమె ససేమిరా ఒప్పుకోదు. ఆదర్శాలకూ- ఆశయలకూ- అభిప్రాయాలకూ జీవితాన్ని బాహాటంగా వినియోగించాలంటుంది. అది నాకు యిష్టంలేదు. అందుకే యిలా జరిగింది." అని చెప్పుకొచ్చాడు.

స్టేషన్ మాస్టరు యింకేదో ప్రశ్నించ బోయాడు. కానీ, యింతలో రైలు పడమరనుండి వస్తోంటంతో- తన పని మీద చక్కా- వెళ్ళాడు. రెండు నిముషాల్లో రైలువచ్చి ప్లాటుఫారంమీద ఆగింది. వేణుగోపాలం ఎక్కాడు. స్టేషన్

మాస్టరు ఆ సమయంలో దగ్గరకొచ్చి, ధన్యవాదాలు చెబుతూ వీడ్కోలు ఇచ్చాడు. రైలు కదిలింది. అతడు తన ఉద్యోగ ధర్మంగా నిష్క్రమించాడు.

# 'ఉపసంహారం'

ప్రతివ్యక్తి జీవితానికీ ఒక మహత్తరమైన ప్రత్యేకత వుంటూ వుంటుది. లేకపోతే ఆవ్యక్తి జీవితానికి విలువకట్టడం చాలాకష్టం. ఎవరి వ్యక్తిత్వాలపట్ల వాళ్ళకు ప్రగాఢ నమ్మకం, విశ్వాసం వుంటయి. ఇతరులపట్ల తానెలా ప్రవర్తిస్తున్నదీ ఆవ్యక్తి గమనించలేక పోయినా, బాధపడిన హృదయం మాత్రం, అతని మనస్తత్వాన్ని మరిచిపోదు...

రఘుపతికీ— రాగమూర్తికీ— సారథికీ మధ్యగాఢ స్నేహం ఉన్నమాట వాస్తవమే! ఇది వాళ్ళకే కాదు. చూసిన ప్రతి ప్రముఖ పరిచయస్థుడికీ తెలుసు. అయితే సారథి మనస్తత్వం వేరు. సుముఖంగా అర్థంకాదు. చాలా కష్టం... మాటలు, పలుకు నెత్తురు మరకల్లాగా వున్నప్పటికీ, హృదయం మాత్రం చాలా కారుణ్యమైంది... రాగమూర్తి మంచి అంతస్థుగలవాడు. కనిపించడు... ఎప్పుడూ నీలాకాశం వంక చూస్తూ, తేలిపోయే మబ్బుల్ని గురించి, ఎగిరే పక్షిపంక్తుల్ని గూర్చి. సౌందర్యోపాసకుడిలా, మాట్లాడుతాడు... హృదయంలో బాధపడుతూనే, పైపైకి తెచ్చుకోలు వుషారుతో

వుంటాడు. ఇక మిగిలింది రఘుపతి. అతను ఏమీ చేయలేడు. కాని, మనస్సులో మాత్రం, అంతా తేలిగ్గా చేయగలననే ధైర్యంతో వుంటాడు. ఆర్థిక సోమత లేక పోవటంతో, ఆలోచనలు అస్తమానమూ, వెకిలి చేష్టలద్వారా బహిర్గతమవుతూ వుంటయి... ఇదంతా జనశృతి...

రాగమూర్తి, హైద్రాబాద్‌లోనే వుంటున్నాడన్న సంగతి, రఘుపతికి నెలరోజులు క్రిందటే తెలిసింది. మానిన గాయం మళ్లా రేగినట్లయింది. "ఈ వ్యక్తితో స్నేహం చెయ్యటం, నాదే ముందు బుద్ధితక్కువ పని" అని, లోలోన క్రుద్ధ మనస్కుడయ్యాడు. కాని, అంతలోనే "స్నేహ ధర్మంపట్ల ఘాతుకంగా ప్రవర్తిస్తున్నానేమో?" అనిపించి, అతనిపట్ల క్షమాపణ చెప్పుకున్నాడు. రఘుపతికి ఆవేశం వచ్చినా, ఆగ్రహం వచ్చినా లిప్తకాలమే వుంటుంది. తరువాత అతని మనసు, స్నేహాస్పదమై పోతుంది. మనస్సులో, రాగమూర్తి పట్ల, వుధృతంగా పొంగిన పరాభవాగ్ని జ్వాల చల్లారగానే, వెళ్లిచూసి, పరామర్శించి వద్దామనుకున్నాడు.... రాగమూర్తి వాక్చాతుర్యంగల ప్రతిభాశాలి. సౌందర్యాపేక్షతో సతమతమూ సరాగాలాడే సరసుడు... వూహాలోనే, వూర్వశిని తలబోసే ఉజ్వల భావుకుడు... మధుర మమతల మనస్వి. రఘుపతిపట్ల అవ్యాజమైన ప్రేమాభిమానాలు కల్గిన వింత వ్యక్తి. కాని యిప్పుడు రాగమూర్తి స్థితిగతులెలా వున్నయ్యో అని ఒక్కింత యోచించి చూశాడు రఘుపతి.

ఇవ్వాళ రేపు అంటూ రెండు మూడురోజులు రఘుపతికి తెలిసే వెళ్ళినయి. మనస్సులో ఒక వైపు లోగడ రాగ

మూర్తి చేసిన వింతచర్యల వైఖరి పదేపదే తలుపుకొస్తున్నా, దిగమ్రింగుకొని, ఎలాగేనా చూడాలని ఆకాంక్ష అగ్రులు సాచింది. తనకు ముమ్మాటికీ వున్నవను కొంటున్న ఆత్మగౌరవం- అభిమానం- సహృదయత నానాటికీ ముప్పిరిగొంటూ, రాగమూర్తి సందర్శనానికి, రఘుపతిని ప్రోత్సహపర్చినయి. తొందర చేసినయి. చివరకు ఏ పనీ చేయనిచ్చినవి కావు.

ఒకనాటి వుదయం తొమ్మిదిగంటల వేళ రఘుపతి బయలుదేరి తిన్నగా రాగమూర్తి బసవద్దకు చేరాడు ఎక్కడ వుంటున్నాడో? అని కంగారుగా అనుకుంటున్న రాగమూర్తి, అజంతా లాడ్జిలో పై గదుల్లో పదమూడవ దాంట్లో వుంటు న్నాడు... అడుగు ముందుకువేసి, ఠక్కున ఆగిపోయి సిగరెట్ కాల్చటం ప్రారంభించాడు... తడువ తడవకీ పై వంక చూస్తూ వుండిపోయాడు. సంఘర్షణ మనస్సులో జరుగుతోంది. 'తనకు తానై వెళ్ళి అవమానం పొందటం ఏం మంచి లక్షణం? ఎంత పరభాగ్యోప జీవియైనా కోరి పరాభవాన్ని అనుభవించ లేడు.' రఘుపతి మనస్సు చలించింది.

రాగమూర్తి, ఆమేడ బాల్కనీలో కూర్చొని యేదైనా పిచ్చిగా కవిత వ్రాసుకుంటూ వుంటాడేమో! నని రఘుపతి భ్రమపడ్డాడు. అలాంటి అచరపరాయత్వం జరుగుచున్నట్లు యెక్కడా చిహ్నాలు రవ్వంతైనా కనిపించలేదు.

"తనకు తాను హృదయాన్ని వంచనతో చిక్కబట్టుకొని, అపారం చేసుకున్న రాగమూర్తిని చూసి, పరామర్శించక పోతేనేం? ఏ మన్నా కొంప మునుగుతుందా? సముద్రాలు పొంగుతుయూ?"- ఎందుకో కృత్రిమమైన సంకోచం పుట్టింది.

అడుగువేయ బుద్ధికాలేదు. స్తబ్ధతగా నిల్చుండి పోయాడు. "వెళ్ళటమా? మానటమా?"- తేలని సమస్య అయింది. "ఎందు కొచ్చినట్లు?- ఏం చేసినట్లు?"- అర్థంకాని ప్రాశ్నిక మైంది. "తీరా వెడితే మునుపటి స్నేహంతో పల్కరించి ఆద రిస్తాడో? లేదో? తీరా మొహం చాటేసి, ఎరుగని వ్యక్తిని చూసినట్లు చూస్తే? తనేమై పోవాలి? రఘుపతి పొటమరించిన సందేహంతో సతమతమై పోసాగాడు... జీవితంలో స్నేహం ద్వారా నమ్మకస్థుడైన వ్యక్తివల్ల బాధను పొందినప్పుడు ద్వేషం పుట్టి, తలుచుకున్నప్పుడల్లా రగిలి, జ్వలితజ్వాలగా మండుతూ వుంటుంది. దాన్ని చాతుర్యంగా ఎంత చల్లార్చు కొన్నా, వేడిపోదు. తిరిగి, అదే వ్యక్తితో కలిసి మెలిసి స్నేహం చేయటమంటే చాలా కష్టం...

రఘుపతి యిలా తనలో తాను వితర్కరించుకుంటూ, రెండో సిగరెట్ ముట్టించి, వచ్చేపోయె జనంవంక తీక్షణంగా- పరిశీలనగా చూస్తున్నాడు. అంతా క్రొత్త వాతావరణంలాగా వుంది. తన ఆలోచనల్నీ- ఆవేదనల్నీ భగ్నపరిచే వాడూ- బహిర్గతం చేయగల్గినవాడూ లేడని రఘుపతి కూలంకషంగా దీర్ఘాలోచను డయ్యాడు.

యూనివర్సిటీకి వెడుతూ- వెడుతూ- ఫణిభూషణ రావు, రఘుపతిని చూసి. ఆశ్చర్యపడుతూ "ఎప్పుడొచ్చా వోయ్?"- అని భుజం తట్టి పల్కరించాడు. వులికి- పడుతూ, ఆలోచనా సాగరంలోంచి తెప్పరిల్లి- "ఒక నెలరోజులైంది." అన్నాడు. తాపీగా. కొద్దిక్షణాలు వాళ్ళిద్దరూ వుభయ కుశలో పరిని సమీక్షించుకొన్నారు. పాత స్నేహం, తిరిగి క్రొత్త

మన స్తత్వాలతో, బంధించబడింది. రఘుపతి, మాటల సందర్భంలో, ప్రస్తుత సంకటావస్థను వెల్లడి చేశాడు. ఫణిభూషణరావు జవాబిస్తూ—

"చూడటానికి వచ్చినప్పుడు చూసి, పరామర్శించి వెళ్ళాల్సిందే! లేకపోతే యింతదూరం రావడ మెందుకూ? అనవుసరం. పిరికిగా వెనక్కి వెళ్ళేబదులు, ధైర్యంతో చూసి, పల్కరించి, అతని తప్పు అతనికి తెలియజేయడం ఉత్తమం. మిత్రబృందంలో ఒకడు అసభ్యంగా ప్రవర్తిస్తే, వాణ్ణి మందలించటానికి అందరికీ అర్హతుంది... నేనూ అతణ్ణెప్పుడూ చూడలేదు. నువ్వు చెప్పగా వినటమే! పోన్లే యీ రూపంగానైనా అతణ్ణి చూస్తానుపద. వెడదాం"– అంటూ ఒత్తిడి చేశాడు. రఘుపతికి కాస్త ధైర్యం వచ్చింది. "అయితే నువ్విక్కడే వుండు. నేను వెళ్ళి వెంటబెట్టుకొస్తా"– నని చెప్పి మేడ మెట్లెక్కాడు. "యూనివర్సిటీయో?" కేక వేశాడు ఫణిభూషణరావు. "యీ పూటకి స్వస్తి చెబుదూ!" –అని రఘుపతి నిర్లక్ష్యంగా చెప్పి వెళ్ళిపోతున్నాడు పైకి. ఫణిభూషణరావు తనలో నవ్వుకుంటూ, అతనివంకే చూడసాగాడు.

రఘుపతి చెవులు దేరిన వేళా విశేషం మంచిదే కావటంవల్లనేమో! రాగమూర్తి తన గదిలో హోటల్ గోడ్రెజ్ మంచం మధ్యన, మాఘమాసపు మనిషిలాగా కూర్చొని తోటి స్నేహితుడైన రాంబాబుతో, యేదో అపూర్వ విషయాన్ని చర్చనీయాంశంగా యెంచుకుని మాట్లాడుతూ, దానిలోని సారాంశాన్ని బలవంతాన పిండి, అతడికి అందిస్తున్నాడు.

అతగాడు ఒక అమాయకుడు. ప్రపంచంలో అమాయకత్వం పోతోంది అని అనుకుంటున్న యీ రోజుల్లో, యింకా ఆ రాంబాబు ఎందుకు ప్రోగు చేసుకుంటూ, హృదయంలోనూ-కళ్ళల్లోనూ అమాయకత్వాన్ని పదిలపర్చు కుంటున్నాడో అర్థంగాదు... అది తెలికనే నేమో! రాగమూర్తి అంతగా గొంతుచించుకొని, ఆవేశంతో చెప్పుతున్నాడు. వాస్తవంగా రాంబాబుకి తెలుస్తోందో- లేదో రాగమూర్తికి తెలియదు. "యీ మాత్రం నేను చెబితే తెలియదా?"- అనే ధీమాతో, గర్వంగా రాగమూర్తి చెవుతున్నాడు. అస్తావ్యస్తంగా అతను వింటున్నాడు. రఘుపతి చడీచప్పుడు కాకుండా గుమ్మం దాపల నిల్చున్నాడు. రాగమూర్తి వుద్విగ్న స్వరంతో ఉవాచ:

"నాకు తెలుసు. యీ లోకం యెప్పటికోప్పటికి మన వేదాంతాన్ని నమ్మి తీరుతుంది. నిత్యమూ మనం చూసే యీ రంగు రంగుల సృష్టి తారుమారై తీరుతుంది. ఎవరినయితే మనం నమ్ముతున్నామో, వాళ్ళే మనల్ని మోసం చేస్తారు. విద్రోహక చర్యలు తలపెడతారు. దేనినైతే మక్కువతో స్వీకరిస్తున్నామో, అదే, బాధకన్నా మిన్నగా, మిన్నాగు లాగా కాటువేస్తుంది. ప్రభవిస్తున్న ప్రకృతి పతనం చెందు తుంది. తథ్యం. నాణ్యమైన నాగరికత, నాశనం కావటానికే నా నాటికీ, నలువైపులా ప్రాకి, మభ్యపెడుతోంది. మన జీవి తాన్ని చివరకు కబళించటానికే, యీ ప్రపంచం మారు తోంది. ఉదాహరణకు చెప్తాను. నాకు అనేకమంది ప్రాణ మిత్రులున్నారు. నేనెక్కడైతే ఒక్కక్షణం ఆగుతానో,

అక్కడున్న వాళ్ళంతా, చెప్పి పెట్టకుండానే స్నేహితులై పోతారు. ఎవరెవర్ని ఎలా చూడాలో, ఏ ఏ విలువలతో వాళ్ళని అర్థం చేసుకోవాలో, యిప్పటికిగానీ తెలిసిరావటం లేదు. నేను యింతవరకు యెవరినీ నమ్మలేదు. నమ్మను కూడా! దానికి ఒక కారణంవుంది. నమ్మటంవల్ల హృదయానికి నవ్యత లేదు- రాదు. నగిషీ చేయని భావాలు కలుగుతయి. అసలు జీవితం మిధ్య ఐనప్పుడు, జీవనం స్వార్థంగాదూ! అందుకని యెవరితోనైనాసరే మిథ్యావాదిగానే చరించాలి. ఇదివరకు చాలాసార్లు నేను, నా స్నేహితులని చెపుతూవచ్చిన, సారథి, రఘుపతి పేర్లు గుర్తున్నయ్యా?"- అవడిగాడు. రాంబాబు 'ఆఁ' అన్నాడు... ఇదంతా వింటున్న రఘుపతి చలించాడు. ఫణిభూషణరావు, క్రింద నిల్చోలేక అవస్థపడుతున్నాడు. రాగమూర్తి పునర్వ్యవాచ:

"నేను వాళ్ళంటే నమ్మాననుకున్నావ్ గదూ! లేదు వాళ్ళ మనస్తత్వాలు వేరు. స్థితిగతులు వేరు. మానవుడు స్వార్థపరుడని మానవుడికే తెలుసు. లేకపోతే, వాళ్లు నాకెందుకు స్నేహితులవుతారు. నేను వాళ్ళల్లో యెందుకు చేరుతాను"... నిర్భీతిగా అంటున్నాడు...

రఘుపతికి కడుపులో కదలిన కోపం- గుండె కెగదన్ని- భ్రూయుగ్మానికొచ్చి ముడివేసుకొంది. సూటీగా వెళ్లి "మిత్ర ద్రోహీ! వంచకుడా! కృతఘ్నుడా!" అని యిత్యాదయః నాలుగూ అందామనుకున్నాడు. కాని, రాగమూర్తి కవిత్వం ప్రాసేగాసగాడై పోవటంతో, పశ్చాత్తాపం యే నాటి కోనాటికి నిలువెల్లా పాకి, దహించకుండా వుంటుందా! అని

సంబాళించుకొని, గదిలోకి ప్రవేశిస్తూ– "చాలా కష్టపడ్డావ్ గానీ రాగమూర్తీ! గుక్కెడు తాజ్ హోటల్ కాఫీ చప్ప రిద్దువుగానీ, లేచిరా..." అంటూ, వాళ్ల ధోరణికి అంత రాయం కలిగిస్తూ, చూశాడు.

అంతే! రాగమూర్తి ముఖం వివర్ణమైంది. బిత్తర చూపుల్తో నిరుత్తరుడయ్యాడు. నిశ్చేష్టుడైనాడు. "ఎంత సేపైంది. నువ్వొచ్చి?"– తెల్లబోతూ అడిగాడు. రఘుపతి, వ్యంగ్యంగా– "చావ"గానే బ్రతికొచ్చాను." అన్నాడు. రాగమూర్తి చిన్నబుచ్చుకుంటూ "ఏమన్నా అనుకున్నావా?" తెచ్చికోలు సిగ్గుతో అడిగాడు. "నాకా మాత్రం బుద్ధి లేదుగా!" రఘుపతి తేలిగ్గా అనేశాడు చిరునవ్వు బలవంతంగా ప్రదర్శిస్తూ.

తను చేసిన పొరపాటుకి, సమర్థనీయంగా, పెట్టె తెరచి ఒక పదిరూపాయల నోటుతీసి, జేబులో పెట్టుకుని, రఘు పతితో పాటు మేడ దిగాడు రాగమూర్తి, తోటిమిత్రుడు తెల్లబోయి చూస్తున్నాడు. తన పెట్టె తెరచి రాగమూర్తి పది రూపాయిల నోటుతీసి కెళ్ళడం యేమిటీ! అని రఘుపతి మాట్లాడకుండా అతని వెంట క్రిందకు దిగాడు. ఫణిభూషణ రావును పిల్చాడు. నిల్చొని నిల్చొని కాళ్ళు గుదుళ్ళు పట్ట డంతో, అతను తూలుతూవచ్చి వీళ్ళలో చేరాడు. తరు వాయిగా, రఘుపతి, రాగమూర్తికీ, ఫణిభూషణరావుకీ పరి చయం చేసాడు... వాళ్ళు ముగ్గురూ కలిసి, ఆ సమయంలో పోవటం పోవటం యకాయెకీ తాజ్‌కి వెళ్లారు. కాఫీలు త్రాగారు. కాసేపు పిచ్చాపాటీ జరిపారు. గంట దాటిన తరు

వాత బయటికొచ్చారు...

ఆనాటి ఖర్చంతా పదిరూపాయలతో పరిసమాప్త మైంది. తరువాత ఫణిభూషణరావు గృహోన్ముఖు డైనాడు. ఇలా మూడు- నాలుగు రోజులు రఘుపతిని, రాగమూర్తి భరా యించాడు. అయిదోరోజున, అతను గౌరవనీయమైన నటనకు దూరమై, నగ్నసత్యానికి దగ్గరగా వచ్చాడు. మాటల సం దర్భంలో, తను రఘుపతిపట్ల చేసిన ఖర్చును పునశ్చరణచేస్తూ, రాగమూర్తి రఘుపతిని యీసడింపుగా మాటలన్నాడు. రఘుపతి, అప్పటి స్థితిని అవగాహన చేసుకొంటూ వూరుకోక తప్పిందిగాదు. తెల్లారిన తరువాత రఘుపతి, అక్కణ్ణుంచి వెళ్ళిపోతూ — ... క్షుబ్ధ కంఠంతో...

"రాగమూర్తీ! మునుపు నేనూ- సారథి, నీపట్లచూపిన ఆదరాభిమానాలు బహుశా! మర్చిపోయివుండవు. ఒక్కసారి, మాతో కలిసి మెలిసి వున్నరోజుల్ని గుర్తుకు తెచ్చుకో చాలు. ఒకానొకప్పుడు నీస్థితిగతు లెలావుండేవో జ్ఞప్తి కొస్తయి. నాకేవీ స్మృతికి రావటం లేదంటే, మాత్రం విపులంగా చెప్పిపోవటానికి సమయం లేదు. కాని, నాదొక్కటే మనవి. యీనాడు నేను నిరుద్యోగిని. పరిచయస్థుల ప్రతిభా విశేషాలతో, ఏదైనా వుద్యోగం దొరుకుతుందేమోనని ఆశతో యిక్కడికొచ్చాను. నువ్వు లోగడ చేసిన పరాభవం మర్చిపోలేదు. నాకది మానని గాయం. అయితే, నీవల్ల నేను చాలా సహకారాన్ని పొందాను. అందువల్ల కృతజ్ఞతా పూర్వ కంగా, చూసి, పల్కరించి పోదామనే ఉద్దేశ్యంతో యిక్కడకు వచ్చాను. నువ్వుస్థితిమంతుడివి. సహాయమూ చేయగలవు—

సర్వనాశనమూ చేయించగలవు... అడ్డులేదు... నువ్వు నా గుండెలో పెట్టిన ద్వేషాగ్నిని చల్లార్చుకొని, నీ సాన్నిధ్యం లోకి వచ్చాను. తగినశాస్తీ జరిగింది. బాధపడటం లేదు. కారణంవుంది. బాధ అనుకున్నంత బాధగాదు, బాధపడతా మేమో! నని జాగ్రత్తపడటం ఒక పెద్దబాధ. అందుకే అది నిరంతరం వ్యక్తిని పరీక్షిస్తూ వుంటుంది. యిన్నాళ్ళూ అయిన చుట్టాలిండ్లలో, తేరగా— హీనమైన మాటలతో— వుంటూ వున్నమాట వాస్తవమే! అలాగేవుండి, నీకూ కష్టం కలిగిం చాను. నువ్వు విముఖత్వంతో— ముఖం మాడ్చుకొని, నోట్లో— నోట్లో తిట్టుకొంటూ— వున్నప్పటికీ. లోలోన నాబాధను అణుచుకొంటూ— పరిస్థితుల ప్రాభావానికి లొంగిపోయి, బల వంతంగా నీనెత్తిమీద కూర్చొని అన్నిఖర్చులూ చేయిం చాను. నాకోసం పాతిక రూపాయలవరకూ వృధాగా తగలేశా నన్నావ్. కాదనలేను. క్షమించు. కాని, నాజీవితంలో నీలాంటి స్నేహితుణ్ణి ఒక్కడినైనా సంపాదించుకోగలనో? లేదో? తెలియదు. యెవ్వరూ దొరకకపోతే, నువ్వేగతి"— యిలా అంటుంటే రాగమూర్తి స్థాణువులాగా వింటూఉండి పోయాడు. మనస్సులో సారధీ— రఘుపతీ చేసిన వుపకారాలు పుంఖాను పుంఖంగా గుర్తుకు రాసాగినయి. రఘుపతి, ఆవేశంతో మళ్ళా, రాగమూర్తిని చలింపచేస్తూ.

"నేను నీదగ్గరకు వచ్చిననాడే నీ వాగ్ధోరణిలో నీ నడతలో— నీచేష్టలో మార్పులు కనిపించినయి. తీరుతెన్నులు పూర్తిగా మారిపోయినవని రూఢి చేసుకున్నాను. గత స్మృతుల్లో కలలుగన్న కవి వనీ, స్థితిగతుల సామరస్యాన్ని

పరిష్కరించగల సమర్థుడవనీ అనుకున్నాను. ఈనాడు నాకు అంతస్థూలేదు. అర్థికాధిక్యతా లేదు. నీలాంటి వాళ్ళు యేం చేసినా నోరుమూసుకొని పడివుండవలసిందేగా! నువ్వు నన్ను యీస్థితిలో యేదైనాఅను. ఫర్వాలేదు. తిరిపెమెత్తుకొనే జీవితాన్ని అలవర్చుకున్న నాకు, స్థిరత్వంగల్గివున్న నీకు కృతజ్ఞత చెప్పటం ఎలాచాతనవుతుంది? భార్యా బిడ్డల్ని పుట్టింటివద్దే వుంచేసి, దేశద్రిమ్మరిగా తయారై, పరభాగ్యోపజీవినై — వుద్యోగం కోసం వెతుక్కునేనన్ను, నీలాంటివాళ్లు హీనపర్చకపోతే బాగుంటుందా చెప్పు రాగమూర్తీ! నాకు స్థితీలేదు. అంతస్తూలేదు... గతీలేదు... నీలాంటివాళ్ళు యిలాగైనా చూస్తూవుంటే, కొంతలో కొంతైనా ఫలించి, నాకేదైనా వుద్యోగమన్నా వస్తుందేమో! మరి... కాబట్టే నువ్వెప్పుడూ నన్ను, యీదృష్టితోనే గుర్తుంచుకో! ఏమీ లేనివాడికి, వేరే గత్యంతరం ఏమిటి? అనంతమైన లోకంవుంది. ఆశలు — నిరాశలు అనుమానాలు అవమానాలు వున్నయి. ఇవే నాకు మిగిలిన స్థితిగతులు. గుర్తుంటాగదూ! రాగమూర్తీ!"— అంటూ రఘుపతి, రాగమూర్తి గదివీడి పరితప్త హృదయంతో మేడ దిగి. బజార్లోకి వచ్చాడు... సూర్యుడు చుర చురమంటూ ప్రకాశిస్తున్నాడు. రఘుపతి, రాగమూర్తి హృదయగతి యెలా వుంటుందో వూహించదల్చలేదు... తలవంచుకొని ఆ జనసందోహంలో యెక్కడికో చరచరా వెళ్ళిపోతున్నాడు... రాగమూర్తి కరుళ్ళు కరుళ్ళుగా వచ్చే దుఃఖాన్ని ఆపుకొంటూ — ఆ వైపుగా చూస్తూ — శీర్ణ హృదయంతో—

"మంచిని నే నెంచలేను.

వంచన నే పంచలేను.

కడకు.

తుత్రించేసిన ఆశల కడ

నుంచోమన్నా"- అని పశ్చాత్తాపం పొందుతూ రఘుపతిని క్షమించమని చేతులు సాచాడు బాల్కనీలో నిలబడి.... మేనుమరువని కన్నీరు అతని హృదయంనుండి నేటివరకూ స్రవిస్తూనేవుంది.

# పునర్జన్మ

గడియారం మూడు గంటలు కొట్టింది.

మధు తలెత్తి చూశాడు.

పెండ్యులం బరువుగా వూగుతోంది.

మధు ఒక్క నిట్టూర్పు బరువుగానే వదిలాడు. ఎలాగో గతాన్ని విస్మరించి, మళ్ళా పనిమీదకు ధ్యాస పోనిచ్చాడు.

ఇంతలోనే ట్రేలో మరికొన్ని కాగితాలొచ్చి పడ్డాయి.

మధు వాటి వంక చూస్తూ కుదేలుమన్నాడు. "టపాకు పోవలసినవి, అర్జంటుగా యెన్నివున్నయి!" అని భయం వేసింది.

ఆ భయాన్ని అలాగే అణగార్చుకొని ఒక్క వుత్తరాన్ని సగం టైపుచేసేటప్పటికి— నిష్కారణంగా కలరా తగిలి చనిపోయిన తల్లి గుర్తుకొచ్చింది మధుకి. రెండు కళ్ళూ అశ్రుపూరితాలయినయి చేతి వ్రేళ్ళలో బలంతగ్గి, నీరసంతో ఆగిపోయినయి.

మరపురాని అనుభూతులు ఒకదాని తరువాత మరొకటి తోసుకొస్తున్నయి—

"రాత్రింబవళ్లు ఆఫీసర్ల మెప్పుకోసం, నానా అవస్థలు పడి, పీనుగులాగా మొగం పెట్టుకొని యింటి కొచ్చేటప్పటికి, తనపై సానుభూతిగా, జాలిగా— ప్రేమగా— వాత్సల్యంగా— తననిపల్కరించి,— వేన్నీళ్లు తోడిచ్చి, వేడి వేడిఅన్నంపెట్టి, కడుపులో దాచుకొనే తల్లి! ప్రాణంలో ప్రాణమై, దేహంలో దేహమై, చూపులోచూపై. మాటలోమాటై, పెంచింది చదువుచెప్పించింది— డబ్బుగలవాళ్ళ యిండ్లలో వంటలు చేసిపెడుతో, నీళ్ళు తోడి పెడుతూ—

వాళ్ళనే మాటలన్నీ, తనకోసం, తన బాగుకోసం బాధ్యురాలై భరాయించింది. ఎంత గడ్డితిని, తనని బ్రతికించినా, తనకీ, వుద్యోగం వచ్చేటప్పటికి పట్టరానంత ఆనందం కట్టలు తెంచుకొని పొర్లింది.

ఎన్నోవిధాల తన్ను అమె దీవించింది.

మధ్య యింకా మరిచిపోలేదు. ఎలా మరుస్తాడు? తనకు బుద్ధి తెలిసినప్పటినుంచి యీ లోకంలో అత్మబంధువుగావుంది. అమ్మ ఒక్కతే. అ వొక్కతీ యీనాడు రుద్రభూమిలో నిద్రపోతోంది.

మధు మాత్రం జీవచ్ఛవంలాగా యీ ఆఫీసులో రెమింగ్‌టన్ ముందు ఓడిపోయిన రాతు మొగం వేసుకొని కూర్చున్నాడు.

ఆలోచనలు క్రమేపీ విడిపోతున్న సమయంలో మధు చేతి వ్రేళ్ళు చూసుకొన్నాడు.

అవి సమ్మెచేస్తున్నట్లుగా వున్నాయి.

ప్రయత్నించి చూసాడు కొద్ది నిముషాలు.

అర్థంకాని మాటలు పడ్డాయి. చివాట్లు తప్పవను కున్నాడు మేనేజరుతో. ఇవాల్టితో యీవుద్యోగానికి స్వస్తి యేమో! అనుకొన్నాడు. ఎంతో ప్రయత్నించాడు. మనస్సుని సరిగ్గా తిప్పుకొంటానికి యేం ప్రయోజనం లేకపోయింది. ఈ ప్రయత్నాన్ని పురికొల్పేబదులు బాధాకరమైన ఆ ఆలోచనల్లోనే చాలాహాయి వున్నట్లు తోచింది మధుకి. నరాల సత్తువ సన్నగిల్లింది. తన అశక్తికి తానే నిందించుకొన్నాడు. టైపుమిషన్ మీద నుదురు పెట్టి యేడ్వటం ప్రారంభించాడు.

ఈ యేడుపు హఠాత్తుగా ప్రక్కనే వున్న మూర్తిని కంగారు పెట్టింది. అతను మధుని తట్టుతూ, "ఎందుకురా! యేడుస్తున్నావ్" అన్నాడు. జేవురించిన మొగంతో మధు తలెత్తి చూశాడు. కూర్చుంది ఒక ఆఫీసులో. ఆఫీసులో యింటికష్టాల్ని గురించి, వ్యక్తి సంబంధమైన బాధల్ని గురించీ, తల్చుకోగూడదని, తన బ్రతుకంతా సర్వదా యీ టైపు మిషన్‌కి బానిసగా వుండి పోవడమేనని జ్ఞాపకానికి వచ్చింది. యిరవై అయిదు సంవత్సరాలువున్న తను, యెంతో అనుభవం గడించుకొని, అనేక విధాలుగా కష్టనష్టాలతో బ్రతుకుతూ వస్తున్న వ్యక్తిత్వం సామాన్యుని యేడ్పుకన్నా హీనంగా వున్నా, యింత మందివున్న ఆఫీసులో యేడ్వటం, మధుకి తీరని అవమాన మనిపించింది. తన కష్టాలు గురించి చెప్పితే యెవడు వింటాడు యీ లోకంలో? తనలాంటివాళ్ళు యెంత మంది లేరు' తనకన్నా గొప్పవాళ్ళే వున్నారు. ఈ యేడ్పుకి యే విధంగానూ అర్థంలేదనిపించింది ఎందువల్లనంటే, కాలం మారి పోయింది. నాగరికతకు అంతస్థులు పెరిగినయి సభ్యతకు

కావలసిన గౌరవ ప్రతిష్ఠలు యీనాడు సంఘంలో లభ్యం కావడం లేదు— అందువల్ల "ఒకరి కష్టాలు మరొకరికి ఆనందం— మరొకరి నష్టాలు వేరొకరికి బ్రహ్మానందం."—

పంచె కొంగుతో కారిన కన్నీళ్ళను తుడుచుకొంటూ "ఏం లేదురా"— అన్నాడు మధు.

"అదేవిటిరా... అలా నీళ్ళు కారుతుంటే!"—

"వేడి చేసిందిలే—" అన్నాడు మధు. తనలోని బల హీనత యెక్కడ బయటపడిపోతుందో అని. సభ్యతకు లోటెక్కడ దాపురిస్తుందో అని మూర్తికి చిన్న నవ్వు వచ్చింది. అది యెంతోసేపు నిలుపుకోకుండానే తన పనిలోకి తాను దొచ్చుకు పోయ్యాడు.

ఇన్నాళ్ళు భారమనిపించని జీవితం— జీవనం మధుకి ఒక్కసారిగా విసుగుని— చిరాకుని కలిగించాయి. ఆ పూటకు పనిమీాద ధ్యాసపోయింది. తల్లి మూర్తి కన్నులముందు లాస్యం చేస్తున్నట్లుగా వుంది. అట్టే ఆలోచిస్తున్న కొద్దీ యీలోకమే వెగటనిపించింది. సన్ని వేశాలు— సంఘటనలు— సమాలోచనలు చాలా వరకు జీవితంలో మార్పుని తేస్తూవుంటయి కాని, వీటిని గురించి ముందుగా చాలా ఆలోచిస్తాం. యిది తెప్పించే చెరుపు— బాధ— విచారమూ— ఫలించనప్పుడూ, కుదురనప్పుడూ మరీ దుర్భరంగా వుంటుంది హృదయం.

కలరావచ్చి చనిపోయినతల్లికి దహనక్రియలు జరిపి అయి దారు నెలలు కావస్తున్నది. కాని మధు దృష్టిలో యీ విషయం జరిగింది కొద్ది గంటల క్రితమే అన్నట్లు వుంది.

ఇటువంటి అవిరళమైన ఆలోచనలే అతని హృదయాన్ని

పీల్చి పిప్పి చేస్తున్నయి. చీటికి మాటికి మలేరియాజ్వరం అతని ఆరోగ్యాన్ని రుచిచూసి పోతూ వుంటుంది.

అటువంటప్పుడు సలసల కాగిపోతూ వుంటుంది శరీరం. "మృదువుగా తాకి, జ్వరాన్ని ఉపశమింప చేయడానికి అనువైన కోమల హస్తాలు తన కీలోకంలో కరువై పోయినాయేమో!" అని మధు మధనపడుతూ వుండేవాడు.

ఇంతలో గడియారం నాలుగున్నరను సూచిస్తూ ఒక గంట కొట్టింది.

మధు అదిరిపడ్డాడు.

"మానవుడు కోరుకొంటున్న కనీసపు కోర్కెల్లోకూడా తనకేవిధంగానూ అనుకూలించని భాగ్యంతోలగి పోయింది".

కన్నీరు ఆపుకున్నా ఆగటం లేదు.

ఇంతలో ప్యూన్ వచ్చాడు మధు దగ్గరికి.

"ఏమిట"న్నట్లు చూశాడు మధు

"మేనేజరు పిలుస్తున్నారు!" అన్నాడుప్యూన్. మధు పిల్లిలాగా, చొక్కాతో మొఖం తుడుచుకొని మేనేజరు గదిలోకి ప్రవేశించాడు. ఎదురుగా వెళ్ళి వంగి నమస్కారంచేసి నిలబడిన మధుని చూసి— "ఎప్పుడూ అదోమాదిరిగా వుంటావేమిటోయ్? ఉషారుగా వుండవేమిటి? ఏమైనా జబ్బుగా వుందా" అని ఎక్కిరి తక్కిరిగా ప్రశ్నించాడు మేనేజరు. మధుకి గొంతుకలోకి యేడ్పు ముంచుకొచ్చింది.

"మధ్య మలేరియా తీవ్రంగా వొస్తూంది... ఆరోగ్యం కూడా చెడిపోతోంది. దయచేసి ఒక పదిహేను రోజులు సెలవిప్పిస్తే మీపుణ్యామాయని బాగుపడతా!" నని మధు

ప్రాధేయ పడ్డాడు.

మేనేజరుకి యిదేమీ సుతరామూ గిట్టలేదు.

"నీకు పదిహేను రోజులు సెలవిచ్చి, నీస్థానంలో మారొక్కణ్ణి వేసి, మళ్ళా నువు రాంగానే వూడబెరికితే వాడేమైపోను—?" ప్రశ్నార్థకంగా అన్నాడు మేనేజరు.

మధుకి యేదో సమాధానం నిశ్చలంగా— దృఢంగా చెప్పవలెనని పించింది.

రెండడుగులు ముందుకి వేస్తూ— "అయితే నా ఆరోగ్యం చెడగొట్టుకో మంటారా?"— అన్నాడుదీనంగా— అందులోని వాస్తవాన్ని మేనేజరు యేమీ గుర్తించ లేక పోయాడు.

"అదంతా నాకేం తెలియదు. నేను సెలవు యివ్వను. ఇష్టముంటే యీ వుద్యోగం చెయ్యి— లేకపోతే నీయిష్టం...." అని మిగతాభాగం మధుకి వదిలివేసి మేనేజరు ప్రక్కగదిలోకి లేచిపోయాడు.

మధు యివతలికి వచ్చాడు. కాసేపు చేతివ్రేళ్ళు జుట్టులోకి దూర్చి, యేదో ఆలోచించాడు. ముందు ముందు కష్టాలెటువంటివి తన జీవితానికి అడ్డు తగులుతూంటయ్యో అతనికేమీ వూహాలో తట్టలేదు— వంగిపోయిన తలను విసురుగా ఒక్కసారి "మేనేజరు" అన్న యింగ్లీషుబోర్డు, వంకకుతిప్పి—" "ఇంతేగా నువ్వు చెయ్యగల్గింది. కాని, అంతమాత్రానికి నే నేమీ నాశనంకాను. ఈ రోజునుంచి నీ ఆఫీసుకు నీరెమింగ్‌టన్ మిషన్‌కి నీళ్ళధార వదులుకొంటున్నా" అని దీనంగా సమాధాన మిస్తూ ఆఫీసుమెట్లు దిగి బజార్లోకి పడ్డాడు.

రణగొణధ్వనుల మధ్య మధుకి మతిపోతున్నట్లు అనిపించింది. గానుగెద్దులాగా కాళ్ళీడ్చుకొంటూ సరాసరి యింటికొచ్చి చేరాడు— అయిదునిముషాలనంతరం గదిలోకి వెళ్ళి పడుకొన్నాడు. "ప్రపంచలో ప్రతివస్తువు తన్నుచూసి హేళన చేస్తున్నట్టనిపిస్తుంది! ఎందు కనపించదు మరి! ఎవరైనా నా 'అనేవాళ్ళుంటేగా! తనకు కల్గుతూంటే కష్టాలలోగల దుఃఖాన్నీ, సుఖాలలోగల ఆనందాన్నీ తనకున్న వొక్క-హృదయమే భరించాలి, తను ఏకాకి.

జరిగిపోయిన మధురక్షణాలు అనేకం స్మృతిలో మెదిలినయి—

చనిపోయిన తల్లి వెతికి వెతికి ఒకమ్మాయిని, తెచ్చి పెళ్లి చేసుకోమని కోరింది. ఆకోరికను చెల్లించవలసిన బాధ్యత తనకుంది, ఆమె సంతోషమేగా తన సంతోషం! అమ్మ మాటకు ఎదురు చెప్పకుండా అంగీకరించాడు. శుభముహూర్తం నిశ్చయించకముందే మాయదారి కలరాకు అమ్మ బలి అయిపోయింది. తరువాత పిల్లవాళ్లు తన కివ్వడానికి తిరస్కరించారు. ఒకందుకు తనకిది మంచిదనే భావించాడు మధు. రోజులు నానాటికి గడుస్తున్నకొద్దీ యీ లోకానికి తనెంత పనికిరాని వెధవైపోయాడో తెలిసివచ్చింది. ఉద్యోగం తన అప్రయోజకత్వంతో ఊడిపోవడం, బ్రతకడం అంటే బరువుని భుజాలమీదకు ఎత్తుకుని బ్రతికినంతకాలం మోయడం, అతన్ని అయోమయం చేసినయి. ఉద్యోగం దొరికిన క్రొత్తలో యావజ్జీవితం తల్లి పాదాలకు అంకితం చేదామనుకొన్నాడు. కాని మధుపట్ల విధి దురదృష్టాన్ని వ్రాసి పెట్టిపోయాడు.

దాని ప్రభావంవల్లనే మధు జీవితంలో బొమ్మ జెముడు మొక్కలు మొలిచినయి. నెలరోజులూ కష్టపడినదంతా ఒకటవ తారీఖున ఫలించేది ఆ సాయంత్రానికే, హోటల్ మేనేజరు ఆ కాస్త ఫలితాన్ని, తరువాత చేతులు ఖాళీ అయి చల్లబడిపోయేవి.

జీవితంలో అసలు సంతోషమూ, ఆనందమూ, యెప్పుడూ— యెన్నడూ వుండవు. వాస్తవంగా ప్రతిదీ నాదనుకునే లోకంలో మోయలేని భారాన్ని మోస్తున్నప్పటికీ, అది క్రమేపీ చప్పబడుతూ వుంటుంది. తనవంటి మానవునికన్నా, పక్షులూ– జంతువులూ చాలావరకు నయమేమో ననిపిస్తుంది. ఒకరికన్నా మరొకరు బాగా బ్రతుకుతున్నా రనుకొంటాం. ఎవర్ని ఉద్ధరించడానికి?

ఇలా వుద్యోగం పోయిన రెణ్నెల్లకు మధులో వివిధ రకాల భావాలు చెలరేగుతూ వస్తున్నయి. వీటికి యెక్కువగా దోహద క్రియలు జరిపింది అతన్ని వెంటాడుతున్న మలేరియా జ్వరం. దానిమూలంగా మధు మొగం పాలిపోయి, కళా విహీనంగా తయారైంది. తినాలనుకున్నంత దొరకదు. తింటే హరాయించుకొనేశక్తి లేదు. ఉచితంగా మందులిచ్చి పోయే ప్రాణాన్ని నిలిపే డాక్టర్లు తన కెవ్వరూ లేరు. ఉన్నా వాళ్ళ దగ్గరకు వెళ్ళడానికి సాధ్యంకాదు. రోజురోజుకి తనలో 'చావు' అనే అభిప్రాయం బలిసిపోతూ వస్తోంది. యెప్పుడది హఠాత్తుగా వచ్చి తన్ను ఆలింగనం చేసుకొంటుందో మధుకి పాలుపోవడం లేదు. తనకు తానై చావడం సుఖంగా కనిపించదు! చచ్చిపోవడానికి యీలోకంలో చాలా మార్గాలున్నాయి. రైళ్ళూ,

కార్లూ, ఎలక్ట్రిక్ తీగలూ— ఉర్రిత్రాళ్లూ వగైరా. కాని అవి అనుకున్నంత తేలిక పనులుకావు మధు చావులోకూడా సుఖం కావాలని కోరుకున్నాడు ఇది యెలా సాధ్యం? యెప్పటికైనా అంకిత మివ్వక తప్పదు. చివరకు కోరేదే అది తను. అందుకని సుఖముగా చావాలని కోరుకోవడంలో మధుకి కనిపించిన తప్పేమీ లేదు. ఒక చోట వుండి, మరొక చోట వుండే హాయిని సౌందర్యాన్ని, కోరుకోవటం మానవుని సహజ లక్షణాల్లో ఒకటి. దీనికి యెడ తెగని ఆలోచనలు పుట్టుతూ వుంటయి, తరిచి, తరిచి ఆలోచిస్తాం. అలాగే ఆలోచించాడు మధు. చివరకు చావంటే యిష్టమనేది ఒక్కొక్కసారి సన్నగిల్లిపోయింది. అందుకని యెక్కువగా ఆ ఆలోచనల్ని తప్పుకోలేదు మధు. ఒక్కసారిగా వెలుపలికి వచ్చాడు గదిలో నుంచి.

లోకం అంతా కాటుకవంటి చీకట్లో మునిగిపోయి మూల్గుతోంది. గదికి గట్టిగా తాళం వేశాడు. గుమ్మాల్ని దాటి పెద్ద రోడ్డెక్కాడు— జనం రద్దీ అంత బాగా లేదు,

మెల్లగా తలవంచి నిర్భయంగా అడుగులో అడుగు వేసుకొంటూ నడుస్తున్నాడు. "చావాలి" అన్నమాట హృదయంలో తలెత్తి వింతగా నవ్వుతోంది. "ఎలా చావాలి"? మధుకి పరిష్కారం కావటం లేదు. "ఎలాగైనా సరే! చావు కోరుకుంది. మధు పిచ్చి కుక్కలాగా తలెత్తి యెదురుగా చూసాడు. ఒక చిన్న కారువడిగా— వడివడిగా, త్రాచు పాములాగవస్తోంది. దానిముందు లైట్లు తన కళ్ళలో సూదులు పొడిచినట్లు పొడుస్తున్నాయి.

గుండెరాయిగాయిదివరకే మారిపోయింది. వెనక్కి

కట్టుకున్న చేతులు వూడిపోయి స్వస్థానంలోకి వచ్చిచేరాయి.

పిక్కల్లో వున్న సత్తువనంతా ఉపయోగించుకొని మధు ఆ వస్తున్న కారుముందు చక్రాలక్రింద మెత్తగా పడుకుందా మని, అడ్డంగాఉరికాడు.

క్షణంకాలం వుక్కిరిపడి లేచింది.

చిన్నకారు బ్రేకుపడి రోడ్డుప్రక్కగా పెట్టబడివుంది. దూరంగా వున్న కొంతమంది దగ్గరగా వచ్చి చేరారు. అప్పటికే ఆ చిన్న కారులోంచి దిగిన ఒక యువతి. యువకుడు మధు ప్రక్కగా నిలబడి కంగారుగా వున్నారు. యేమిటో చూస్తూ న్నారు.

"అలా చూస్తే యేం లాభం... ఆస్పత్రికి పట్టుకెళ్ళక" అన్నాడొక పెద్ద మనిషి యింతలో.

"నెంబరు నోట్ చేసుకోక వదిలిపెడతావేరా!" అంటు న్నాడొక యువకుడు ప్రక్క వాడితో.

"కళ్ళు పోయినయ్యా! నాయనా! చూసి తోల్లేవు" అన్నదొక ముసలి గువ్వలాంటి అవ్వ.

"యెందుకు నాయనా! అలా అనుకొంటారు... డ్రైవరు తప్పేముంది... ఇంకా నయం జాగ్రత్తగా ఆప గల్గాడు"... అందా యువతి.

యువకుడు మధువంక చూస్తూ— ఒక నిట్టూర్పు విడి చాడు.

"యెలా వున్నాడు?" అందాయువతి, యువకుని వైపు చూస్తూ.

"ఫర్వాలేదు— కొద్దిగా గాయాలు తగిలినయి"

అన్నాడా యువకుడు.

"ఇంటికి తీసికెళ్ళితే"—

"అలాగే...." అంటూ యువకుడు ముందుకొచ్చాడు—యువతి అతని దగ్గరగా వస్తూ—

"డాక్టర్... తప్పకుండా బ్రతుకుతాడా!" అంది జాలిగా—

"నువ్వేం ఆదుర్దాపడకు! నేనున్నానుగా!" అంటూ ఆమెను ఓదార్చాడు.

ప్రక్కన వున్నవాళ్ళ సహాయంతో మధుని కార్లో కెక్కించుకొని యింటికి తీసుకొచ్చింది ఆయువతి.

## 2

డాక్టర్ రఘు మర్నాడుదయమే వచ్చి, గుడ్డలు మార్పించి, కట్లు గట్టాడు.

క్రమంగా అతనిమొగంలో స్పృహఛాయలు కనిపిస్తున్నాయి. బాధకు ఒళ్ళంతా కదిలిపోతోంది. మూలుగుతూ—ముక్కుతూ— కళ్ళు తెరుస్తూ, మూస్తూ ఉంటున్నాడు,

సరోజిని మధు ప్రక్కనే కూర్చొని, అతన్నవలోకిస్తూ ఉంది—

రఘు చేతులు కడుక్కొని, తుడుచుకుంటూండగా—

"ఇంజక్షన్ ఇచ్చారా! ఈపూట స్పృహ వస్తుందా!" అన్నది సరోజిని.

రఘు ఆమె కళ్ళల్లోకి చూస్తూ—

"మరేం భయంలేదు సరోజినీ, నేనున్నానుగా! ప్రమాద మేమీ లేదు. మళ్ళీ రేపొస్తాను. అంతగా కావాలంటే నర్సునిసహాయంపంపమంటావా!" అన్నాడు,

"అంతగా మరేం అవసరంలేదు. నేనిక్కడే వుంటాగా—" అంది సరోజిని.

రఘుకి జాలివేసింది—

"క్రిందటి రాత్రి కూడా నువ్వు నిద్రపోకుండా మేల్కొన్నావ్. ఈ పూటకూడా అలావుంటే నీ ఆరోగ్యం యేమౌతుందో తెలుసా?" అన్నాడు.

"ఫర్వాలేదులే రఘూ! ఒకప్రాణికోసం ఈ మాత్రం ఉండలేకపోతే యెలా!" రఘు దీర్ఘంగా ఆలోచించాడు. ఏం చెప్పలేకపోయాడు— చివరకులేచి వెడుతూ— "నీయిష్టం రోగి లేచినపుడల్లాయేం కావాలంటే అది, అంటే పళ్ళూ, రొట్టె, పాలు యిస్తూండు— చెప్పగా మందు యెప్పుడెప్పు డివ్వాలో. మరి యిక వెళ్ళనా?" అంటూ సరోజినిని తృప్తిగా చూసి మందుల సంచితో రఘు మెట్లుదిగి వెళ్ళిపోయాడు.

మధుకి, రఘు వెళ్ళిన గంటకు తెలివి వచ్చింది. అక్కడక్కడా తగిలిన దెబ్బలవల్ల బాధ తెలుస్తూనే ఉంది. అదే చావాలనుకోడం అనుకొన్నాడు మధు 'చావు', ముందు అలాప్రారంభమవుతుందనుకొన్నాడు.

పూర్తిగా చావకముందే ఒక్కసారి ఆ చావెలా వుంటుందో బాగా కళ్ళు తెరచివుండి చూద్దామనుకొన్నాడు. కాని భయంకాని భయంయేదో వీపుమీద తట్టుతోంది.

"ఇంత బాధపడే ముందుగా, ప్రాణం యెందుకు ఎగిరి పోకుండా వుంది?"— మధుకి యీ సందేహం తట్టింది. ప్రాణం పోవడం ఒకసారి, బాధను అనుభవించడం మరొకసారి అయి నట్లయితే తనీ విధంగా చావుని కోరుకోనేవాడుగాదేమో! అనుకొన్నాడు మధు. అసలు మధు కిప్పుడు బ్రతకటంకంటే కూడా చావడమే కష్టమనిపించింది.

స్పృహవచ్చి, తనెక్కడ వున్నాడో తెలియని అధో గతిలో వున్న ఆత్మను యేవో శక్తులు ఈ చావుకి పురి గొల్పాయి. భరించలేని యమబాధ దానికితోడు అదేపనిగా కళ్ళు తెరచి అటూ- యిటూ పొత్తిగిల్లకుండా బల్లపరుపుగా పడుకొని వుండటం చావుకన్నా కష్టమనిపించింది మధుకి.

ఇంతలో ఎదురుగుండా వున్న గడియారం రెండు గంటలు కొట్టింది.

మధుకి యీలోకంలో పడ్డట్టనిపించింది. కట్లు కట్టబడిన చేతి వ్రేళ్ళతో కళ్లు నులుముకొన్నాడు. రకరకాల వస్తువులతో అలంకరించబడిన పెద్ద గది రివ్వున తిరిగే 'ఉషా' పంకాలూ- గోడకు పెద్దపెద్ద ఫొటోలు— రెండు నిలువుటద్దాలు—ఒక పుస్తకాల బీరువా— ఒక డ్రాయరు— దాని చుట్టూ రెండూ- మూడు కుర్చీలూ- దాని ప్రక్కగా ఒక రేడియో సెట్టు— ఇవన్నీ మధుకి స్వర్గాన్ని గుర్తు చేసాయి. ఇలాగే వుంటుందని మధుకి గుర్తు కూడా. ఇంతలో కాలు వెళ్ళి గోడకు తగిలి, నరక బాధను జ్ఞప్తికి తీసుకొచ్చింది.

మధు మామూలు మనిషి అయినాడు- ఈ స్వప్నంలో స్వర్గాన్నిచూసి కలవరించిన తరువాత మళ్ళా బాధ మధుని

పీడించండం మొదలెట్టింది. సన్నగా మూల్గక తప్పడంలేదు—కళ్ళు మూసే మధు తనకితాను తిట్టుకొంటూండగానే—సరోజిని చల్లనిచేయి, అతని బుగ్గల్ని స్పృశించుతూ నుదురు మీదకు వెళ్ళింది—.

చనిపోయిన తల్లి గుర్తుకొచ్చింది—

మధు బరువుగా కళ్ళు తెరిచాడు.

సరోజిని అమృతాన్ని గురిపిస్తూ తన వైపే చూస్తోంది. దేవకన్య కన్నా విపరీతమైన సౌందర్యంతోనూ, అమ్మ తరువాత అమ్మకన్నా యెక్కువగా చూసుకొనే వ్యక్తిగానూ. సరోజిని మధుకి కనిపించింది.

ఒక్క క్షణం కన్నా యెక్కువసేపు సరోజినిని చూడ లేకపోయాడు.

"బాధపుడుతోందా!" అంది కోమలంగా సరోజిని.

"ఊ" అంటూ మూల్గాడు బాధనంతా వ్యక్తం చేస్తూ. సరోజినిచేయి ఫాలభాగం మీదనుంచి జారిపోతూండగా—మధుకి అందిన హాయి యేదో హఠాత్తుగా పోతోందనిపించింది. "ఇంకా కాసేపు అలానే వుంచమని" ప్రాధేయపడదామనుకొన్నాడు. ఆమె అతని మొగం మీదకు తన మొగాన్ని దగ్గరగా వుంచుతూ—

"కాస్త కాఫీ యివ్వనా?" అంది—

మధు మాతృహృదయంలోకి చొచ్చుకొని పోయినట్లుగా భావించాడు,

ఆకలి జ్ఞాపకానికి వచ్చింది, క్రిందట రోజున ఉపవాసం-యీనాడు......!"

"అబ్బా!" అన్నాడు మధు.

ఆమె లేచి విచారంగా అతన్ని చూసింది, అతను తన బాధను, నెమరువేసుకొంటున్నాడేమో నని సంశయపడ్డది... కాని అలాగే సరోజిని యెక్కువ సేపు నిల్చోలేదు.

ఆమె గాజుల చప్పుడు యెప్పుడైతే అక్కడనుంచి మటుమాయమైందో— మధుకి పూర్వపు ఆలోచనలు కదిలినయి.

"తాను చదువుకొంటున్న రోజుల్లోనూ— ఉద్యోగం చేస్తున్న రోజుల్లోనూ, ఎంతోమంది అందమైన ఆడవాళ్ళను చూడగలిగాడు. వాళ్ళందరి అందం— ఆనందం, సరిగ్గా ప్రపంచంలో వినియోగించుకోబడిందా! యెన్ని విపరీత పరిణామాలకు దోహదం కాలేదూ!— తన విషయంలో మాత్రమే సఫలమైంది. చావుని కోరి బయిలుదేరిన నాకు. స్వర్గ సౌఖ్యాల్ని అనుభవించే భాగ్యం లభ్యమవడ మేమిటి! నేను పడిన కారుకి, చంపడంచేత కాదేమో! ఎన్నిసార్లు తన నిరాశను చంపుకొన్నాడు హృదయంలో వుండే క్షోభను యెన్నివందలసార్లు అణచుకొన్నాడు! అయినా బ్రతికి సాధించగల్గేదేమిటి? చివరకు ముళ్ళ కంపలోకి కూడా పోలేని అసమరత తనలో పుట్టుతుందేమో! యెలాగైనా బ్రతకాలని కోర కూడదు. ఈ మొండి ప్రాణికి సానుభూతి— జాలి— దయ— చూపకూడదు. ఈ సారికి యీ బాధను పెంచుకొన్నానా శాశ్వతంగా కావాలనుకొనే చావు సంప్రాప్త మవుతుంది. ఎవరితోనూ, తనేవిధంగానూ సంబంధం పెట్టుకోకూడదు. బ్రతకడానికి ఆశించే విషయాల వైపుకి మనస్సుని పోనివ్వ

కూడదు. చావుకి ముందు, తనమీద యెందుకీ సానుభూతి యీ అందగత్తెకు? అసలీమె యెవరు? తన ప్రాణానికి యెందు కిలా సేవలు చేస్తోంది— చివరకు సుఖంగా చావనీయరు— ఏడ్వనీరు— అయినా, నాతో యీమెకేంపని. ఇలా నాదగ్గర కెందుకొస్తోంది?— తన కేంపని... సరోజినిదగ్గరగా వచ్చి కూర్చుంటూ.

"కాఫీ కలిపి తెచ్చాను. త్రాగుతావా!" అంటూ బుజ్జగిస్తూ అడిగింది.

"అక్కర్లేదన్నట్లు తలూపాడు."

"ఫర్వాలేదు త్రాగండి లేకపోతే శోషొస్తుంది!" అంది. నుదురు తడుముతూ—

మూల్గుతూ "నాకొద్దు" అన్నట్టు తలూపాడు. మనస్సులో యేవో భావాలు నిద్రకాస్తున్నాయి. "తాను చూపే సానుభూతికి, యితనేమీ బాధ్యుడు కానట్లుగా ఉంటాడేమిటి!" అని ఆశ్చర్యపడుతుందేమోనని మధు ఈనాటి నాగరికతా లోకాన్ని తడిమిచూశాడు. ఆమె అలాగే తన కళ్ళల్లోకి, కళ్ళుపెట్టి చూస్తోంది. ఏవో భావాలు రంగరించి, యేదో మమతను గుర్తుచేస్తూ, తన బాధకు ఉపశమనం కలిగించే సానుభూతిని, సందేశాన్ని తన చూపులద్వారా అందచేస్తోంది. మధు ఆచూపుల్లో గల అంతరార్థనివహాన్ని గ్రహించుకోలేక, కంటనీరెట్టుకొన్నాడు.

సరోజినికి హృదయం ద్రవించింది మృదువుగా అతని తల నిమురుతూ— "వూరికే బాధపడకు, అదే తగ్గిపోతుంది. కాస్త కాఫీ త్రాగండి" అని బతిమిలాడినట్లు మాట్లాడింది.

"అబ్బ: నన్ను యిట్లా ఉండనీయండి. ఊరికే చంప బోకండి. నన్ను యెలాగోలాగు యేడ్చుకోనీయండి "మీరు యిక్కణ్ణుంచి అవతలికి వెళ్ళిపోండి! యీగల్లాగా పీక్కు తినకండి! నా యెముకలు కొరక్కండి! ఎట్లాగొట్లా ఛస్తాగా" అంటూ మధు రొప్పుతూ- నుదురుమీద చెయ్యి పెట్టుకొని, గుండెను యెగురవేస్తున్నాడు.

సరోజినికి మతిచలించినట్లయింది- అర్థం కాని భయ మేదో ఆమెను వరించింది. మందు సీసాలోని మందు నిజమైన మందేనా! అంతా అయోమయంగా తోచింది. రోగికి మతి చలించలేదుగదా! ఏమో! సరోజినికి అనుమానం వేసింది. కాసేపు అలాగే పల్కరిస్తాడనే ఆశతో నిలబడే ఉండగల్గింది. మధు యేం మాట్లాడ్డం లేదు. సరోజిని అతన్ని విసిగించ కూడదనుకొంది. చేతిలో కప్పుని అలాగే ప్రక్క బల్లమీద వుంచుతూ- వెనక్కి తిరిగింది. సరోజిని వెళ్ళిపోయిన అర గంటలోపే మధు కళ్లు తెరచి చూశాడు. ఆమె లేదు. టేబుల్ మీద కాఫీ కప్పువుంది. మంచి వాసన కూడా వేస్తోంది. త్రాగాలని జిహ్వ కోరింది. మధుకి చావాలనివుంది. త్రాగితే చావు వాయిదాపడుతుంది. ఎందుకు వాయిదా పడే సుకోవాలి. చచ్చిపోవాలని నిశ్చయించుకొన్న వాడు, బ్రతి కించే వస్తువుల్ని ఆసరాగా కోరకూడదనిపించింది. ఎదురుగా వుంటే యీ కోరిక బలిసిపోతుందనుకొని మధు ఆ కప్పుని బల్లమీదనుంచి తోసిపారవేశాడు.

గది వెలుపల గోడప్రక్కగా నిలబడివున్న సరోజినికి యీ శబ్దం వినిపించింది. నిశ్చేష్టురాలై పోయింది. స్పృహ తెలిసి

వుండే యిలా ప్రవర్తిస్తున్నాడని సరోజిని గ్రహించింది. ఎందు కింతకోపం? ఆమె కర్థంకాలేదు. తెలుసుకొంటానికి అవకాశం కల్పటం కష్టం యిప్పుడు! నెమ్మదిగా మధు దగ్గరకొచ్చి నిలుచుంది. అతను కోపంగా పగిలిన పింగాణీ పెంకువంక చూస్తున్నాడు. సరోజినిని మాట్లాడించాలని ప్రయత్నించి—

"మందివ్వమంటారా! వేళయింది కూడా!" అంది. మొగం చిట్లించి, పరీక్షగా చూశాడు సరోజినివంక. తనతో చదువుకొన్న వాళ్ళలో ఒకమ్మాయి యిలాగే వుండేది అచ్చంగా.

ఆ అమ్మాయేనా యీ అమ్మాయి—

ఏమో!

అంతగా యీ ఆలోచనను గురించి బాధపడ తల్చుకో లేదు మధు. ఏదైనా- ఒకప్పుడు పరిచయముంటే దాన్ని జ్ఞాపకం తెచ్చుకోటం కూడా యీ సందర్భంలో అనవసరమని పించింది.

మధు పరీక్షగా చూసి, తల తిప్పుకోవడంలో, సరోజిని అతని భావాన్ని కించిత్ గ్రహించిన దానిలాగా- కుర్చీలో కూర్చొని—

"గుర్తుకొచ్చానా! లేదా!" అంది.

మధు మూగవాడిలాగా వూరుకొన్నాడు. బాధగా కళ్ళు మూసుకొన్నాడు.

మధు యీ సారికూడా యేం జవాబివ్వకుండా వూరికే వున్నాడు.

ఆమె సాహసించి మందు గ్లాసులో పోసింది. అతను

ఆమె భుజాన్ని ఆసరాగా చేసుకొని లేచాడు. పెదవులు విప్పి తాగుదామను కొన్నాడు. కాని "చచ్చే వాడికి మందు లేమిటీ" అనిపించింది. తన దౌర్భాగ్యానికి తానే నవ్వు కొన్నాడు.

అంతలోనే ఆ మందుమీద కచ్చిపుట్టుకొచ్చింది ఆమె చేతిలోంచి మందుగ్లాసు లాక్కొని బలవంతంగా గోడకు విసరి కొట్టాడు.

ఆమె విశాలనేత్రాలు ఆశ్చర్యపడ్డాయి.

అతని వికృతాకారం సరోజినికి భయాన్ని కలిగించింది. కాసేపటికి తెప్పరిల్లి—

"ఏమండీ!" అంది మెల్లగా—

ఏ మూలనో దాగివున్న నిరర్థకమైన దుఃఖం అతని గొంతుకలోంచి బయటికి కాస్త కాస్త రాసాగింది.

అతని మనస్తత్వాన్ని ఆమె గ్రహించాలనుకొని చాలా ప్రయత్నించింది. చివరకు యేం తోచలేదు. యెక్కువ సేపు అలా కూర్చోవాలనిపించలేదు. మెల్లిగా లేచి గది యివతలికి వచ్చేసి కూర్చుని ప్రకృతిలోకి చూడటం మొదలెట్టింది- మధ్యమధ్య మూల్గులు- గొణుగుడు మాటలు ఆమె నిశ్చలాలోచలనల్ని భంగపరుస్తున్నాయి.

అప్పటికి నాలుగు గంటలు దాటింది. మధు మూల్గటం లేదు.

సరోజిని దగ్గరకు వేసిన తలుపుల్ని కొద్దిగా తెరచి చూసింది.

నిద్ర పోతున్నట్లుగా వున్నాడు-

ఆమెకు కూడా శ్రమ యేదో కాసేపు నిద్ర పొమ్మని సెలవిచ్చింది—

అలాగే యిద్దరూ ఆ సాయంత్రం పూట చిన్న కునుకు తీసారు.

## 3

చీకటి పడింది.

మధు నిద్రపోతూనే వున్నాడు.

సరోజిని కళ్లు నులుముకొని, లేచి కూర్చుంది.

జరిగిన సంఘటనంతా గుర్తుకు రాసాగింది.

సరోజినికి మధుపట్ల యెలా సానుభూతిని, జాలినీ చూపించాలో తెలియలేదు.

ఒక్కసారి మధుని చూసి నిర్వేదించింది.

ఇంతలో బూట్ల చప్పుడు ఆమెని కదిలించాయి.

రఘు వచ్చాడు.

సరోజిని లేచి నిలబడింది.

"ఎలా వున్నాడు?" అని అడిగాడు రఘు.

సరోజిని రఘుని యివతలికి పిల్చి, మధు చేసిన తతంగమంతా పూసగుచ్చినట్లు చెప్పింది. అతను పిచ్చిగా నవ్వాడు.

సరోజినికి ఆ నవ్వు వింతగా తోచింది.

"నే చెప్తే విన్నావ్! నీ లాంటి వాళ్ళకు రోగులపట్ల ఎలా వుండాలో యేం తెలుస్తుంది. ఈ శ్రమ నీవు పడలేవనే నర్సుని పంపుతానంది విన్నావ్ కావు. రోగుల మనస్త

త్వాన్ని అర్థం చేసుకోవడమంటే, కూరగాయలు తరగట మనుకొన్నావా!

"అతను చివరకు మందూ- తాగలేదు కాఫీ కూడా రుచి చూడలేదు- విసిరి బుచ్చుకొని పారవేశాడు"- అంది నిర్జీవంగా సరోజిని.

"అదంతా నే చూసుకొంటాగాని, నువ్వేం బెంగ పెట్టు కోకు. అసలిదంతా ఒకవిద్య ఇంకా నువ్విది చదువుకోవాలి". అంటూ రఘు మధువంక చూసాడు. అతడు యీ సందర్భంలో మేల్కోవటానికి కారణం వాళ్ళిద్దరి మాటల సందడే.

మేల్కొని మూలుగుతున్నాడు. మధ్యమధ్య ఊపిరి సలపకుండా వెక్కిళ్ళు వొస్తున్నయి.

రఘు మధు దగ్గరకు చేరి అతని మొగాన్ని తనవైపుకు త్రిప్పుకొన్నాడు- మందు యివ్వబోతున్నాడు- మధుకి ఆశ్చ ర్యాన్ని కలిగించింది— ముఖంలో ఆ చాయలు ద్విగుణీకృత మయినాయి.

"మళ్ళీ వచ్చారు నా ప్రాణానికి యమ భటుల్లాగా సిగ్గు లేదురా? వద్దంటే ఎందుకొస్తారు! చంపాలను కొంటె ఒక్క సారి చంపరాదు! యెందుకిట్లా కాస్త కాస్తగా యేడిపిస్తూ, చంపుతారు!" అని మధు. రఘుని విదిల్చిపారేశాడు. రఘు ఒక క్షణం ఆలోచించాడు.

"దేనికింత శ్రమపడుతారు. త్వరగానే తగ్గిపోతుందిగా కాస్తా మందు త్రాగండి! యేం గాబరాపడకండి!"— "నాకు బ్రతకాలని ఆశలేదు, మీరు నన్ను అర్థం చేసుకోలేక పోతు న్నారు. నాకు మీరేం ఉపకారం చేయక్కర్లేదు. చేయద

ల్చుకుంటే. త్వరగా చచ్చే ఉపాయం చెప్పండి— చావడా నికి యే మందిచ్చినా హాయిగా తాగుతా!"

సరోజినిని రఘు గొంతుకలు ఆ మాటలు విన్న తరువాత మూగ పోయినవి, నిరాశ పెరిగినా. జీవితానికి ఆశ నశించదు ఒక ప్రక్క ప్రాణంపోతూ వున్నా, బ్రతకాలనే ఆకాంక్ష అనుకున్నంత తేలిగ్గా మాసిపోదు. "చావాలి— చావాలి" అనుకొన్నప్పటికీ, ఆ కాస్త క్షణం వచ్చేటప్పటికి బ్రతికియేదో సాధించాలని బుద్ధి పుడుతుంది. అది జీవికి లక్షణం. కాని యితని ప్రవృత్తితో చాలావరకు ఆ సూచనలు యెక్కువగా కనిపించడం లేదు, వికృతమైన మనస్తత్వం దాని పరిణామంలో గల అంతరార్థం రఘుకి బోధపడటం లేదు.

రఘు తరువాత చాలాసేపు బ్రతిమిలాడాడు,

"పాపం చాలా కష్టాలు పడినట్టున్నారు. అందుకునే జీవితం అంటే విసుగు పుట్టింది. నిరాశను బలపర్చుకొన్నారు"— అన్నాడు రఘు మధువంక చూస్తూ. "అవును. ఏం..... తప్పా!" మధు గంభీరంగా అన్నాడు.

"ప్రస్తుతం మీ కటువంటిదేం వుండకూడదు... మీ ప్రాణానికి యేం ఫర్వాలేదు! తప్పకుండా యీవ్యాధి నయమవుతుంది— మీ రిలా అనుకొంటూ వుంటుంటే యెలా నయమవుతుంది!"

"నా కసలు బ్రతకాలని లేదు. తెలుసునా!"— రఘు యేం మాట్లాడలేదు.

"నాకు తెలుసు. చావు అనుకున్నంత తేలిక కాదని"—

"అందుకే దానికోసం మందివ్వ మంటున్నా!"

ముందు పంటితో క్రింద పెదవి కరచుకుంటూ రఘు యేమో ఆలోచిస్తూన్నాడు.

సరోజిని నిశ్చల నిరీహ నేత్రాలతో రఘుని చూస్తోంది. రఘు సరోజిని వంక తర్వాత నెమ్మదిగా చూస్తూ "సరోజా! నాకేం తోచటంలేదు. ఇతని మతిభ్రమణం చూస్తుంటే, ముందు నాకు మతి పోయేటట్లు వుంది"— అన్నాడు.

సరోజిని అతన్ని గదినించి అవతలికి తీసికెళ్ళి కూర్చోపెట్టింది.

అతను ఒక సిగరెట్ తీసి కాలుస్తూ— ఆమె కళ్ళల్లోకి చూసాడు.

సరోజిని మృదువుగా— అంది:

"అతనికి స్పృహావుండే యిలా అంటున్నాడు. ఇంత మెండిగావుంటే మీరెలాగూ మందివ్వలేరు, అమృతం యిచ్చినా. హాలాహల మవుతుంది శారీరంగా కుదర్చడం చాలా కష్టం. అందుకని మానసికంగా ముందు ప్రయత్నిస్తే యీనిర్భాగ్యుడు యేమైనాలొంగవచ్చు." రఘు సావధానంగ విని—

"అయినా నీ కెందుకొచ్చిన బెడద. నువ్వు వొప్పుకోంటేయీ పాళాని తీసికెళ్లి ఆ జనరల్ ఆస్పత్రిలో పారేస్తే నీ పీడా, నా పీడా పోతుంది" అన్నాడువిసుగ్గా. ఆమాట వినగానే సరోజినికి కళ్ళల్లో నీళ్లు తిరిగినయి.

రఘుకి విస్మయం కలిగింది.

"సరోజా! యేమిటది?"

"ఏముంది, యింతా చేసి అతనికి ద్రోహం చెయ్యటం కన్న యేమైనా ఉందా!" ఎండుకు పోతున్న గొంతుకలో నుంచి వినబడే మాటల్లాగా వున్నాయి అవి రఘుకి.

"అతను వాస్తవంగా నిర్భాగ్యుడే. అతన్ని చూసిన ప్పుడే నాకు యింతజాలి ఎందుకుకలిగిందో తెలియదు. పైగా నాతో చదువుకున్న వాడు. చాలా బీదవాడు కూడా. అతని జీవితం యెటువంటిదో నాకు బాగా తెలుసు. వారాలు చేసు కొని కొన్నాళ్లు చదివాడు. జీతాలు కట్టుకోలేని స్థితిలో నేనే చాలా సార్లు సాయపడ్డాను. జీవితంలో మనం యెవ్వరమూ యెరుగని కష్టాల్ని నష్టాల్ని చవిచూచాడు. సరిగ్గా యీనాడు మన కారు క్రింద పడే ప్రాణాలు తీసుకొంటానికి ప్రయత్నిం చాడు. యేదేమైనా, నా యింట్లో, నాకళ్ళ ముందు నిష్కా రణంగా అతని ప్రాణాలు పోవడం యిష్టంలేదు. ఎంత ఖర్చై యినా, భరాయిస్తాను అతని ప్రాణం నిలబెడతాను. యెలా గైనా అతను బ్రతికే ఉపాయం చూడండీ!" అంటూ సరో జిని తన బాధను— ఆదుర్దానూ— మమకారాన్నీ- స్నేహాన్నీ వ్యక్తపరిచింది. రఘు ఆమె ఉద్దేశ్యం తెలుకొని ఆశ్చర్యపడ్డాడు. సరోజినిని ప్రేమిస్తూ. పెళ్ళి చేసుకో వాలని ప్రయత్నిస్తున్నాడు రఘు. ఈ ప్రయత్నం యిప్పటికి సంవత్స రంబట్టీ ఉధృతంగా జరుగుతోంది. ఆమె అంగీకారం కోసం తాను పడేపాట్లు యింతా అంతా గాదు ఎలాగైనా సరోజినిని సంతోషపెట్టి, తన అనురాగాన్ని ఆమె హృదయంలో పాతు కొని పోయేటట్లు చేయాలని భగీరథప్రయత్నాలు జరుపు తున్నాడు.

ఇప్పుడు యీ రోగి విషయంలో అతను తగినంత శ్రద్ధ చూపాలనుకొన్నాడు, సరోజినికోసం. యీ సరోజినే తనకు తటస్థ పడక పోయినట్లయితే యీ రోగి- అందరి రోగుల్లాంటి రోగే- కొత్తదనమేమీ యీతనిలో రఘుకి కన్పించలేదు. సరోజినికి గల శ్రద్ధ, పట్టుదల రఘుని ఉన్మత్త పరచినయి.

రఘు చాలాసేపు సరోజిని చెప్పిన విషయాలను గురించి తలపోశాడు- ఆలోచించాడు.

తర్వాత మెల్లిగా అన్నాడు.

"సరే— నువ్వంతగా కోరుతుంటే నే కాదనలేను. నాకు మాత్రం మానవులంటేదయ— జాలీ— లేకపో లేదు. అందులో యితను బీదవాడు— తెలివిగలవాడు— చదువు కొన్నాడు. అన్నిటికన్నా ముఖ్యమైంది నీకిష్టమైన వాడు. అందుకనే నాశాయశక్తులా ప్రయత్నించి యితన్ని బ్రతికిస్తా. దానికి ఒక్కటే ఉపాయంవుంది— అయితే అది చాలా కష్టమైంది" రఘు సరోజిని వంక చూసాడు యీ మాటని.

"అయితే అయింది. ఏమిటది?" అంది తేలిగ్గా.

"అతనికున్న 'నిరాశ' 'విసుగు' 'నా' అనేవాళ్ళు లేక పోబట్టే యింతగా పెరిగినయి. అతని కిప్పుడు 'నా' అనేవాళ్ళు కావాలి. మనస్సులో మనస్సై మెలగాలి, అతనికిగల అభి రుచుల్ని గ్రహించగలగాలి. సరిగ్గాఅలా గేనటించాలి— మరి నువ్వు యివన్నీ చేయగలవా!" అన్నాడు రఘు—

సరోజినికి "యేం చెయ్యాలో తోచలా"-

"ప్రేమిస్తున్నట్లుగా నటించు- లాలిస్తున్నట్లుగా

మాట్లాడు- అతన్ని నీ ప్రియుడిగా భావించు- ఆ భావాన్ని అతను గ్రహించుకో గల్గాలి- నువ్వు ఆత్మబంధువుగా అతనికి కనబడాలి- ఎంతో ఓర్పు చూపాలి- అతనేమన్నా నువ్వు పడాలి- చాలా ప్రసన్న వదనంతో అతనికి కనబడు తూండాలి- నీ మీదే అతని జీవితాశయాన్ని వుంచుకొనే టట్లుగా ప్రవర్తించాలి- లేనిపోని ఆశలు అతనికి చూపెట్టు. స్త్రీకి లొంగని పురుషు లెవరు చెప్పు! అందులో నీలాంటి అందకత్తెకు సాధ్యంకాని పనేముంది? ఇది తేలిగ్గా చేయగల్గితే అతను బాగుపడతాడు. మానసికంగా యింతకన్నా చేయ గల్గిందేం లేదు."- అన్నాడు రఘు. సరోజినికి యివన్నీ త్వరగా అర్థం కాలేదు. చాలా సేపటివరకు ఆలోచనలు విడి పోలేదు. చివరకు ఎలాగో ఒక నిట్టూర్పు విడిచి- "జీవితంలో నాటక మాడాల్సన్న మాట"- అంది.

"అవును మరి. కాకపోతే యితను నువ్వనుకొన్న వాడు కాకుండా పోతాడు తెలుసా!" అన్నాడు రఘు. "ఇది సాధ్య మవుతుందా!"- అంది సరోజిని సందేహంగా-

"ఏది కాదు సరోజా! నిత్యమూ మన జీవితంలో మనకు తెలియకుండా యీ విధంగా జరిగిపోవడంలా. అనుకొంటే యీ తేడా కనిపిస్తుంది. యిష్టంలేక తిట్టుకున్నప్పటికీ- ఆ వ్యక్తి కన బడితే- అనుకొన్న దంతా గుండెలో దాచుకొని, పైకి మామూలుగా మాట్లాడుకోవటం లేదూ! జీవితమంటే నా నిర్వచనం ఒక్కటే! 'నటన' అని"-

"నటన"- సరోజినికి తన జీవితం జ్ఞాపకం వచ్చింది. ఏదో క్రొత్త విషయం నేర్చుకోవాలి కలలో చూడండీ, తల

పోయిందీ ఈ విషయం.

రఘు మాటల్ని బాగా అర్థం చేసుకొంది. దొంగ నటన మధుపట్ల చేయడానికి నిశ్చయురాలైంది. తను చేస్తున్నది తప్పయినా, మధుపట్ల చేయక తప్పదు. అతను ఆరోగ్యవంతుడు కావాలి. లేకపోతే తన ఆత్మకు శాంతిలేదు. పెద్దవాళ్ళకన్నా చిన్నవాళ్లు యీ విషయాల్లో చాలా తేలిగ్గా చేసి వేస్తారు. ఎందుకంటే వాళ్ళకిన్ని ఆలోచనలు వుండవు. అసలు కలగవు."

"ఏమంటావ్?" అన్నాడు రఘు గట్టిగా—

"చూస్తూ చూస్తూ చేయక తప్పుతుందా!" అంది.

"ఔను మరి. కాకపోతే యిలా అతను బాగుపడడు. నువ్వు చెయ్యబోయే పనికి నర్సుకూడా అక్కర్లేదు. నీ హృదయం అతనికి అర్పించే స్థితిలో వుండాలి. అతని అభిరుచులకి నువ్వే బాధ్యురాలివి అతని దృష్టిలో నువ్వు 'ప్రేయసి'వై— నీ దృష్టిలో అతడు ప్రియుడై వుండగల్గితే, అతను నీవాడు నీవు చెయ్యగల్గింది అక్షరాలా అవుతుంది. తరువాత పనంతా నే చూసుకొంటా మరి వెళ్ళిరానా!" అంటూ రఘు వెళ్ళిపోయాడు.

అతను వెళ్ళిన దిశవంకచూస్తూ— సరోజిని చాలాసేపు యేవో ఆలోచించింది— అతను అన్న మాటల్లో సత్యం యేదో వుందని ఊహించింది— తనకి పట్టివున్న బాధ్యతకు తానే కారకురాలనుకుంది— ఒక్కసారి తలుపు తీసి మధువంక చూసి చిన్నగా నవ్వింది.

# 4

## ప్రస్తుతం యేం చేయాలి?

సరోజినికి తట్టింది. చేస్తే యెలా చేయాలి.

అందులో నటన అనుకొన్నంత తేలిగ్గాదు తాను ఒకర్ని ప్రేమించాలి ఇంతకు ముందెప్పుడూ యెవర్నీ ప్రేమించలేదు. తనని ప్రేమించాలనే చాలామంది కుర్రాళ్ళు చదువుకొనే రోజుల్లో ప్రయత్నించి వ్యర్థులైనారు. ఎన్నోసార్లు ప్రణయగాథలు చదివిందే గాని. ప్రణయాన్ని యెవ్వారిపట్ల యింతవరకు ప్రదర్శించే యోగం పట్టలేదు. కాని యీనాడది అవసరమైంది. ధైర్యంవచ్చింది.

రఘు విషయం సింహావలోకనం చేసుకొంది. అతను తనతో స్నేహాన్ని పెంచుకొని, చివరకు ప్రేమికునిలా మారిపోయి పెళ్ళి చేసుకొందామనే వుద్దేశ్యంలో వున్నాడు. కాని తాను ప్రేమించలేదే అంతయిదిగా— ప్రేయసిలాగా ప్రవర్తించడం అంటే దానికి సహజత్వం కాస్తయినా వుండాలి.

సరోజిని ఉద్దేశ్యం రఘుకి యేమాత్రం తెలియదు. చదువుకొన్న రోజుల్లో తనంటే కాలేజి కుర్రాళ్ళుపడే తహతహను తల్చుకొంది. ఎందుకలా అనగలిగారా అనిపించింది. లోకం పోకడ ఆలోచించినకొద్దీ సరోజినికి బాగా అర్థమవుతూ వచ్చింది.

ప్రేమించి వున్నట్లయితే, అంత బాధనిపించేదిగాదు. ప్రత్యేకంగా ప్రేమించా లనుకొంటే అది సవ్యంగా జరగటం చాలాకష్టం.

"మధుకీ— తనకీ యేమిటీ సంబంధం— ఏమైనా ఆప్తుడా! బంధువా! కేవలం స్నేహితుడు. కాకపోతే తనతో చదువు

కొన్న బీదవాడు — తెలివిగలవాడు. ఇంతగా శ్రమ అతని పట్ల యెందుకు తీసుకోవాలి" ఊరుకుంటే బాగుండేది కదా! సరోజిని గుండె యీమాట అనుకోగానే ద్రవించింది నీరులాగా!

ఇంతదయ- జాలీ- సహాయం చేయకుండా, చూప కుండా వున్నట్లయితే అతనీపాటికి యెక్కడుండేవాడో! అత గాడే, అంతగా బ్రతికి కేసు పెట్టించినట్లయితే వెయ్యి రూపా యలతో వాడిని సంతృప్తిపరచి, నాదారిన నేను వచ్చేదాన్ని. కాని అంత నీచురాల్నని యెలా అనిపించుకోను. మందూ, మాకు లేకుండా, మానిపోయే రోగానికి సరియైన ఔషధం తనే వుండగా, వేరొక ఆస్పత్రికి యెందుకు తీసికొని వెళ్ళాలి.

మానవుడికోసం తోటిమానవుడు ప్రాణాలు సైతం ధార పోస్తున్న యీనాటి నాగరికలోకంలో ఒక్క ప్రాణిని, తనతో చదువుకొన్న వాణ్ణి, సౌమ్యుణ్ణి, నిర్భాగ్యుణ్ణి, తనకున్న డబ్బుతో తనకు చేతనైన సహాయంతో అతన్ని బ్రతికించ లేక పోతే యెందు కనిపించింది సరోజినికి. ఒక జీవితం కోసం తన జీవితం త్యాగం చేస్తూండటం తప్పా! ఇంత పేరు ప్రఖ్యాతులు గడించు కొన్న భారతదేశంలో ఒక్క అల్పప్రాణం నిష్కా రణంగా ఆరిపోతూంటే, తనలాంటి శ్రీమంతుల బిడ్డ చూస్తూ వూరుకోవడం తగనిపని" అని నిశ్చయించుకొంది సరోజిని.

కేవలం అతని ప్రాణాల్ని నిలబెట్టటం కోసం- అతని బ్రతుకు ఫలించడం కోసం ప్రపంచంలో తాను కూడా ఒక మనిషినని పించుకోడం కోసం తా నేం చేస్తే మాత్రం తప్పేముంది? తను చేయబోయే పని తనకు అన్నివిధాలా

మంచిదనిపించింది. హృదయం ఉప్పొంగి పోయింది. కళ్ళల్లో నవ్యకాంతులేవో తిరుగాడుతున్నట్లుగా తోచాయి. ప్రతి అవయవంలోనూ ఉత్సాహం, ఆనందం ఉరకలు వేస్తోంది. మధు ప్రాణంతో తన ప్రాణానికి యే నాడో సంబంధం వున్నట్లుగా– దాన్ని యిప్పుడు బలపరచేటందు కేమో నన్నట్లు సరోజిని అమితానందంతో మధు గదికి చేరుకుంది.

## 5

మధు నిర్జీవ శిలా ప్రతిమలాగా వుండటం సరోజినికి యేం తోచలేదు. పెదిమల చివరలనుండి, చొల్లు కారుతోంది. తలంతా చెరిగిపోయింది. అతను అనుభవించే బాధయొక్క స్వరూప మేమిటో కచ్చితంగా సరోజినికి తెలియటం లేదు. ఎలా నటిస్తే సంతోషిస్తాడో– లేకపోతే బాధను పెంచిన దాన్నౌతా నేమోనని జంకింది. నిరాశలో మునిగిపోయిన ఆత్మను తేల్చి, సంతోష సాగరంలో అభిషేకం చేయించాలని సరోజినికి మెల్లగా తట్టింది.

కాసేపు అలాగే, అతని కెదురుగా నిలబడింది. అతనింకా కళ్ళు తెరవలేదు. సరోజిని మనస్సులో యేమో ఆలోచనలు ముసురుకొని వుక్కిరి బిక్కిరి చేస్తున్నాయి. ఎక్కువసేపు నిలబడలేక, వెనగ్గా వున్న కుర్చీని దగ్గరగా లాక్కొని మధుకు అందుబాటులో కూర్చుంది. ఏదో బరువు కనురెప్పల్ని లేవనీయకుండా అణచి వేస్తోందా అనిపిస్తోంది– సరోజినికి. వేడి నీరు ఊరికే ధారాపాతంగా కను చివరలనుండి కారుతోంది–

సరోజిని నటించబోతున్న పాత్రకు యిదే మొదటి పని కాబో లను కుంది. అందుకే అతని దగ్గరగా జరిగి, తన పమిటె చెంగుతో కారుతున్న కన్నీళ్ళను సున్నితంగా తుడిచింది.

మధు ఉలిక్కిపడి కళ్ళు తెరిచాడు.

సరోజిని రూపం స్పష్టంగా కనిపించలేదు.

మరింత ప్రయత్నంతో బాగా కనులు విప్పి చూశాడు. ఆ చూపుకి సరోజిని కళ్ళు చెమర్చినయి, ఇది నటన కాదు నిజంగా వాలంతటి కవే చెమర్చినయ్.

మధుకి, అంత నీరసంగా వున్నా సరోజినిని చూడగానే, ఆమె చర్యను అనుభవించిగానే ఒక్కసారిగా ఆశ్చర్యం కలిగింది.

అలాగే– దీన వదనంతో– బాధగా సరోజిని కళ్ళల్లోకి చూడసాగాడు.

సరోజిని ఆ చూపుకి కంపించింది.

మధు దృష్టిలో ఆమెను దేవతగా భావించి చూస్తు న్నాడు.

తన కనుకొలల వెంట దిగజారిన నీటి బిందువులను సరో జిని తన ముని వ్రేళ్ళతో తుడుచుకొంది—

అవ్యక్తమైన మధుర భావనలో, అనిర్వచనీయమైన సుందరమూర్తిని అవలోకించి నప్పుడు పల్కరించాలనే ఆశ కలిగినట్లుగా భావించి—

"సరోజినీ!..." అన్నాడు మధు.

సరోజిని— అతని మొగంలోకి చూస్తూ, తియ్యగా "ఊఁ" —అంది.

ఆ సమాధానంతో మధుకి బ్రతకాలనిపించింది, "తన మీద దయ చూపించే హృదయాలు యింకా వున్నాయను కున్నాడు. ఉండి కూడా చావుకు తాను పురోగమించటం తనకే చిన్నతనమనిపించింది. యిన్నాళ్ళూ యీలోకం న్యాయం—దయ—జాలీ— లేక గొడ్డుపోయిందనుకొన్నాడు. జీవితమంటే నిరాశా పూరితమైనదనే అనుకున్నాడు, ఈ సృష్టంతా మాయ అని, బ్రతుకంతా అశాశ్వతమని నమ్మాడు కాని. యీ క్షణంలో, ప్రతిదీ శాశ్వతమని, ఆనందించ తగ్గది యింకా చాలా వుందని ఊహించాడు. చనిపోకున్నా ఆశ మానవుణ్ణి వెంటాడుతుంది. నరకానికి పోవడం యిష్టంలేక స్వర్గాన్ని కోరుకుంటాడు. దానికోసం పుణ్యకార్యాలు చేయడం మొదలెడతాడు. ఆశ యీ విధంగా మానవుణ్ణి లోబరుచుకొంటుదని మధు భావించాడు" మళ్ళా నిరాశ అతన్ని బెదరించింది.

"అసలీ సరోజిని ఎవరు? చావాలని కారుక్రింద పడ్డప్పుడు చంపకూడదు! తన హృదయంలోని దయను' సానుభూతిని రంగరించి తనకి యెందుకు పులుము తోంది? నా ప్రాణాల్ని నిలబెట్టి ఏం కీర్తి సంపాదించుకోదల్చింది! ఈ వేళ సరోజిని తనకు మన స్ఫూర్తిగా సేవ చేస్తోంది! ఎందుకని? అపదలో వున్నాననేగా! ఇది కాస్తా తప్పింతరువాత సరోజిని చేతులు తుడుచుకోకుండా వుంటుందా! మళ్ళా తను రోడ్ల వెంటా—దుమ్ములోనూ—పార్కుల్లోనూ— ఆకలి దప్పుల్లోనూ—ఆశల ఉర్రితాళ్ళలోనూ—చిక్కి, బక్కచిక్కి పీనుగై పోక తప్పదుగా! యెందుకొచ్చిన ముచ్చటలు! యెందుకింత

శ్రమ! నన్ను బాగుచేద్దామని యీమె ప్రయత్నించడమేగాని వాస్తవంగా తన బ్రతుక్కి హాయి, స్వేచ్ఛ, సమకూరుతాయా! ఒక వేళ యీమె పుణ్యాంవల్ల బ్రతికినా, సాధించే దేముంది?" మధులో యింత ఆలోచన విభిన్న రూపాల్లో, వింత వింతచర్యగా సాగిపోతుంటే—సరోజిని తనని పరీక్షగా చూస్తూ!—

"కాస్త మందు పుచ్చుకొంటారా!"...అంది.

సరోజిని, తనను బ్రతిమిలాడి, బుజ్జగిస్తున్నట్లుంది. ఇంత వరకు తనతల్లి పోయినతరువాత, యిలా వినటం యిదే మొదటిసారి తనకి.

మనిషి, మనిషిని ప్రేమిస్తాడు, హృదయంలోని భావాలన్నింటికి, యెదుటివ్యక్తికి పరిసితుల్ని బట్టి ధారమేస్తాడు. అభిమానం చూపుతాడు. ఆలింగనం చేసుకుంటాడు. తన కళ్ళను యెదుటివాని కళ్ళతో కలుపుతాడు. తనునవ్వుతాడు—నవ్విస్తాడు—అన్నీ మానవునిలోని భావాలే. అంతా మానవత్వంలోని మహత్వమే! ప్రకృతిలోని ప్రతి గొప్పవిషయమూ, ప్రతి చిన్న విషయమూ, ప్రతి సన్నివేశంలోనూ, ప్రతిసమ్మేళనంలోనూ వ్యక్తీకరిస్తూనే వుంటాడు— బయట పెట్టుతూనే వుంటాడు. ఇది దాచినాదాగదు. ఇలా దాగని వస్తువుల్నే తనమీదవేసి రుద్దుతోందని మధు భావించాడు. ఈభావనకు బాధ్యురాలు మధు దృష్టిలో 'సరోజినే' నిన స్ఫుటంగా కనిపిస్తోంది. కను రెప్పలు అల్లల్లాడిస్తూ సరోజిని వంక చూశాడు,

"ఏంకావాలి" అన్నట్లు సరోజిని ఆతృతగాచూస్తోంది.

పేరుపెట్టి పిలిచాడు మధు.

"ఊఁ!"—అంది సరోజిని వంగుతూ—

"ఇందతా యేమిటో నీకు తెలుసా!" వేదాంతిలాగా అన్నాడు మధు.

సరోజినికి నమ్మిన కాళ్ళక్రిందభూమి క్రుంగిపోతున్నట్లని పించింది.

"ఇదంతా వృధాశ్రమ— నా అప్రయోజకత్వం— నా నిరాశ— నా బాధ— నా కష్టాలు నువ్వనుకున్నంత తేలిగ్గాపోవు— అవి నాకు సన్నిహితాలైనాయి. నువ్వెంతకష్టపడి పరిచర్యలుచేసినా అవి నన్ను విడిచి వెళ్ళలేనంతటి మమకారాన్ని నావద్ద దాచుకుని బ్రతుకుతున్నయి"— మధు మూల్గుతూ— ఆగి– ఆగి అన్నాడు. సరోజినికి అతని మాటల్లో గల నిస్పృహ... మరిగిపోయిన విహ్వాలత– పట్టుదల– గాఢంగా వున్నట్లు కనిపించాయి. వాటిని గురించే తానూ దీర్ఘంగా ఆలోచిస్తోంది. కాని అతనితో వాటిని చర్చించడానికి ఆమె పూనుకో దల్చలేదు.

ఏం చెప్పితే అది విని వూరుకోవడమే ప్రస్తుతానికి మంచి దని ఊహించింది.

"నాకు బ్రతకాలని లేదు. చావుని కోరుకొంటున్నాను. యేదైనా నీకు ఉపకారం చేయాలనివుంటే– అది చావుని త్వరలో తెప్పించేదిగా వుండనియ్యండి. నా చావుకి అడ్డు తగలొద్దు"—

సరోజిని ప్రక్కనేవున్న నెమిలి విసనకర్రతో విసురుతూ– ఆ మాటలు వింది.

అతని మీదవున్న దుప్పటి కుడిచేత్తో సర్దుతూ—

"మధూ! యేమిటీ యింత నిరాశ చెప్పు!" అంది తియ్యగా—

"నా కెవరున్నారు?"— "యిదివరకు మా అమ్మ వుండేది?"

"ఇప్పుడు?" అతను ప్రశ్నార్థకంగా చూసాడు.

"నే లేనూ! మధూ!"—

"నువ్వా!" అతను వెకలిగా నవ్వాడు. ఆ నవ్వులో జీవం లేదు. ఎండిన తాటాకు నవ్వులావుంది.

"ఉద్యోగం- ఆరోగ్యం- అమ్మ-" అన్నీ పోయినయి. యింకా నాకేం మిగిలింది? నే నెవరికోసం మిగిలివున్నా!"— మధు కళ్ళలో నీళ్లు తిరిగినయి.

సరోజిని అతని నుదురు రాస్తూ—

"నా కోసం మధూ! నువ్వేం కంగారు పడకు! అంది. అతనికి ఆ మాటలు నమ్మకంగా కనిపించలేదు.

"నీ కోసమా!"—

"అవును... మరి..."

"ఎంత చిన్నపిల్లలాగా అంటున్నావ్! నీలో యింకా అమాయకత్వం పోలేదు. నిరాధారుడైన యీ నిర్భాగ్యుని మీదనా! నీకు తీరని దయ. అందుకని బ్రతికించ దల్చావా!"—

"మీ రలా అనకండి! మీ కోసం సర్వవిధాలా శ్రమపడి బ్రతికించుకుంటాను. మీ కోసం నా సర్వస్వం వెచ్చించి మీ ప్రాణాల్ని నిలబెట్టుకుంటాను"—

"సరోజినికి తెలియకుండానే సరోజిని హృదయంలో

నుంచి ఈ మాటలు బయటికి వచ్చేసినై."

"ఎంత ధైర్యంతో అంది! యిదంతా సత్యమేనా! యింత బాధ్యత తనపట్ల యెలా తీసుకోగల్గింది! యింతగా హృదయాన్ని తన జీవితం చిగురింప చేసేందుకు త్యాగం చేస్తుంటే, తన ఆత్మకు ఆనందాన్ని కూర్చ తల్చుకొంటుంటే—నే నెందుకు ఆమెకోసం బ్రతకూడదూ?" అని అనిపించింది మధుకి— వెంటనే సరోజినీ!"— అన్నాడు.

ఆ మాటలో సరోజినికి యెంతో ఉత్సాహం కన్పించింది.

అతను చిన్నగా నవ్వాడు ఆమెవంక చూసి.

సరోజినికి ఆత్మ వికసించింది.

"నువ్వంటే నా కెందుకో నమ్మకంగా వుంది సరోజినీ!"

"మంచిదేగా!"—

"ఏది మంచిది?"

"మీరు నన్ను నమ్మటం"—

"అదికాదు! నువ్వు నన్ను ప్రేమిస్తున్నావా!"—

సరోజినికి తన 'నటన' మీద విశ్వాసం— నమ్మకం కుదురుతోంది.

"యోగ్యుడైనవాడు యెప్పుడూ ప్రేమించబడుతాడుగా మధూ"—అంది సరోజిని,

ఆ మాట అంటూంటే సరోజినికి కన్నులు మురిసినయి. మధుకి మధువుని నాకినట్లనిపించింది.

"ప్రేమకు ప్రత్యేకంగా కారణా లేమీ వుండవనుకొంటా! అసలు ప్రేమించడమనేది మనం ప్రయత్నిస్తే

అయ్యేదికాదు.

"నిజమే నేమో"— అనిపించింది మధుకి.

"ఇంతకి నేను బ్రకుతానా?"

"అదేమిటీ – తప్పకుండా!" – అంది సరోజిని మృదువుగా. మధుకి బ్రతుకుమీద ఆశ— విశ్వాసం కల్గింది—

"నే చెప్పినట్లు వింటే మరి..."

"నువ్వు నాపట్ల దైవస్వరూపిణివి. క్రొత్త జీవాన్నేదో నాలో ప్రవేశపెట్టావ్"— అన్నాడు మధు కృతజ్ఞతతో. ఇంతలో పనిచేసే మనిషి కాఫీ తెచ్చింది. సరోజిని మధుకి త్రాగమని అందించింది. కాస్త చప్పరించి తృప్తిపడ్డాడు.

తరువాత సరోజిని నెమ్మదిగా లేచి. మేడమెట్లు దిగి క్రిందకు వెళ్ళింది.

సరోజిని తండ్రి ఎదురుచూస్తూ కూర్చున్నాడు అప్పటికి.

"రెండు రోజుల్నుంచి నువ్వు రాకపోయేటప్పటికి నే నే వచ్చానమ్మా!" అన్నాడు తండ్రి.

సరోజిని తండ్రి వెంకట్రావు టి. బి. వల్ల పూరవతల ప్రశాంతంగా ఒకచోట టాబాలో వుంటున్నాడు. అప్పుడప్పుడు సరోజిని రఘూను వెంటతీసుకొని, తండ్రిని చూడ్డానికి వెడుతూవుండేది ఇలా ఒకనాడు వెళ్ళి వస్తూండగానే మధు సరోజిని కారుక్రింద పడటం జరిగింది.

ఈ విషయాన్నంతా సరోజిని తండ్రికి తెలిపింది. వెంకట్రావు మధుని గురించి విని, జాలిపడ్డాడు. ఒక్కగానొక్క కూతురైనప్పటికి, ఆమె చూపినదయకి—సానుభూతికి మెచ్చుకొని, మధుని చూడటానికి పైకివచ్చాడు—

మధుని పరిచయం చేసింది సరోజిని.

అతను కృతజ్ఞతా పూర్వకంగా నమస్కరించాడు. వెంకట్రావు అతని నమ్రతకు, గౌరవానికి తృప్తిపడి కాసేపుండి, ఆ మధ్యాహ్నం స్వస్థానానికి వెళ్ళిపోయాడు.

## 6

వారం రోజులు యిట్టే గడిచి పోయాయి.

మధుకి సరోజినిని చూస్తూ, తృప్తిపడటం ఒక కళాభ్యాసంగా మారిపోయింది.

ఆ రోజు సాయంత్రం వచ్చి డాక్టరు రఘు 'ఎలా వుందన్నాడు'—

"మీ దయవల్ల"— అంటూ నమస్కరించాడు.

"తప్పకుండా నయమవుతుంది. ఫర్వాలేదు" అన్నాడు రఘు.

మధుకి తేలికనిపించింది బ్రతుకంటే.

"నిరాశపడకుండా చూసుకో!" అని సరోజినికి చెప్పి రఘు వెళ్ళిపోయాడు.

మధుకి లేచి తిరగాలనిపించడం మొదలెట్టింది.

ఈ వారం రోజులబట్టీ సరోజిని చేస్తున్న సేవకు మధుకి బ్రతకుమీద మమకారం— ఆశ పుట్టినయి.

సరోజిని తీరిక వేళల్లో మధు దగ్గరగా కూర్చొని యేవో కబుర్లు చెప్తూవస్తోంది—అతను అన్నింటికి ఒద్దునై సరోజిని సౌందర్యాన్ని ఆస్వాదిస్తూ యేవో కలలుకంటున్నాడు.

ఆరోజు రాత్రి సరోజిని అతను నిద్రపోయిం తరువాత తన 'నటన' గురించి తానే సమీక్షించుకొంది. ఇదంతా యిలా జరగటం, అతనిపట్ల అపచార మేమో! అని భయపడింది. కాని అతనిమీద వున్న ఆశే, తననిట్లా చేయిస్తోందని, ఆమెకు మనసులో శేఖగా తోచింది.

తెల్లవారింది.

సరోజిని మామూలుగా కాఫీ అందించింది.

"నే నెప్పుడు లేచి తిరుగుతానని చెప్పాడు డాక్టరు?" అన్నాడు మధు.

సరోజిని నవ్వింది. జీవితమంటే భయపడి చావుకి దారి దీసిన నిర్భాగ్యుడు. నిరాశాపూరితుడు—బ్రతుకు విలువ తెలుసుకోలేక భయపడినవాడు. ఈప్రపంచంలో ఇంతకాలం ఇంకా వుండటం, ఆమె నవ్వుకి కారణం!

"డాక్టరు తిరగమనందే తిరగడానికి వీల్లేదు!" అంది. శాసన పూర్వకంగా—

"ఎందుకని"— ఆన్నాడు మధు.

"ఎందు కేమిటి!— అంతే"—

'అదేమిటే! నాలో తిరిగే శక్తివుంటే తిరక్కూడదా" మంకు పట్టుదలతో అన్నాడు మధు.

ఇంతలో రఘు వచ్చాడు.

"ఎలావుంది— మధూ!" అన్నాడు.

"నేను తిరగొచ్చా!" అని అడిగాడు.

"ఇంకా నాలుగైదురోజు లాగిన తర్వాత"—

"అంతవరకూ యేం చెయ్యాను?"

"సరోజిని వుందిగా"— అంటూ సరోజినివైపు చూశాడు రఘు.

ఆమె ముచ్చటగా నవ్వింది.

మధు ఆమెవంక చంటిపిల్లవాడిలాగా చూస్తూ!—

"నువ్వు యెక్కడికీ వెళ్లకు సరూ! యేదైనా చదివి కథలు చెప్పాలి- లేకపోతే నాకేం తోచదు"- అన్నాడు.

"అలాగేలే- మధూ"- అంది సరోజిని.

మధు లేచేవరకు ఆమె అన్నట్లుగా సేవ చేసింది—

మధు యేవో ఉబుసుపోకగా అడగేవాడు. ప్రేయసీ పల్కులకన్నా తియ్యగా సమాధానాలు యిస్తూండేది మధుకి.

మధు హృదయం సరోజిని సల్లాపాల అమృతంతో నిండి పోతోంది.

ఒకనాటి రాత్రి మధు ఒంటరిగా లేచి గదిలోనాటి వసారాలోకి వచ్చి, కుర్చీలో చతికిలపడి కూర్చొన్నాడు.

అప్పుడు సరోజిని యేదో పనిమీద క్రిందకు దిగి వెళ్లింది. అరగంటయిన తర్వాత సరోజిని వచ్చి చూసింది.

మధు, విరియగాసిన వెన్నెల్లో- కదలని రమ్యమైన ప్రకృతిని, అవలోకిస్తూ యేదో పునశ్చరణ చేసుకొంటున్నాడు.

సరోజిని అడుగుల చప్పుడికి మధు చలించి చూశాడు. ఆమె నవ్వుతూ మధు దగ్గరగా వచ్చినిల్చుంది- ఆమె కళ్లల్లోకి, మధు చూస్తూ—

"యెక్కడికెళ్లావు సరోజినీ!" అన్నాడు—

"మీకు కాఫీ తేవాలని వెళ్లా"నంది-

"త్రాగి త్రాగి నోరంతా చేదెక్కిపోయింది. కాఫీ

అంటే విసుగ్గూడా పుట్టిం. దాని పేరెత్తితే చిరాకేత్తు తోంది"- అన్నాడు ముఖం చిట్లించుకొంటూ.

"పోన్లెండి. ఇప్పుడు త్రాగద్దులే"- అంది అతని అయి ష్టాన్ని గ్రహించి-

మధు ఒక్కసారి ఆమె స్వరూపాన్ని బాగా చూశాడు. "పండు వెన్నెల్లో తన కోసం కలలుగనే సరోజిని రేగిన ముంగురుల్లో దోబుచులాడే కోలమొగం, నవ్వితే బుగ్గన చొట్టబడే నవయవ్వనం"- మధుని వుక్కిరి బిక్కిరి చేసినయి అలాగే చూస్తూండడంతో, సరోజినికి యేదో అనిర్వాచనీయ మైన మధురభావం తట్టింది-

"యేమిటలా చూస్తున్నారు!" అంది- చిరునవ్వుతో.

"యేమీ లేదు"-

"ఏమీ లేకపోతే యెందుకట్లా చూస్తారు నా మొగాన్ని"

"సరోజినీ!"-

"ఊఁ"-

"ఇలా కూర్చో! ఒక్కమాట!"-

సరోజిని ప్రక్కనేవున్న కుర్చీలో కూర్చుంది-

"ఏమిటది?"

"నీ సౌందర్యం నన్ను మళ్ళా బ్రతికించింది. విసుగెత్తిన లోకానికి మళ్ళా విందు చేస్తున్నా! ఆశతో పెనవేసుకొన్న హృదయానికి నీ ప్రేమవల్ల నీ రాంజనాలు సమర్పిస్తున్నా!"

"ఏమిటీ కవిత్వం కాదు సరోజినీ, ఒకప్పుడు మనిద్దరం కాలేజీలో నాటకం వేశాం గుర్తుందా! అందులో నా పోర్షన్

లోని యీ మాటలు యింకా నే మర్చిపోలేదు. ఈ రోజు మళ్ళా జ్ఞాపకానికి వస్తున్నయి నిన్ను చూస్తుంటే"—

"ఒక్కరే లేచి యెలా వచ్చారు"—

"నిద్ర పట్టలేదు యెంతసేపు కళ్ళు మూసినా! ఇంత వెన్నెల వృథాగా మరిగిపోవడం నా కెంతో చిన్నతనమని పించింది.

సరోజిని శరీరం ఒక్కసారిగా పుల్కరించింది. అణిగి వున్న కోరికలు చిగురులెత్తాయి. ఆమని కోయిలనతలో మధుర రాగాలాపన చేసినట్లనిపించింది. నవవసంత సుమమాలనై పోయా ననిపించింది— మధు చూస్తున్న చూపుల్లో ఆ మెకు అర్థంకాని అనుభూతులు గోచరించాయి— పల్కరించాయి— ద్రవించాయి.

"రఘు లేవద్దంటే యెందుకు లేచారు?" అంది పైకి.

"అలాగే అంటారు లేవడానికి యిష్టంలేక—వాళ్ళకేం తెలుస్తుంది రోగిబాధ— అవస్థ"—

"అలా అనకండి! డాక్టరు చెప్పినట్లు వినాలి"—

"వింటే— యింకా యేడిపిస్తారు. . . ఓపిక వున్నప్పుడు యెలా పడుకోను."

"ఇంత పెంకెతనం— పనికిరాదు!"—

"నీకు తెలియదు సరోజా! బాధ వ్యక్తిని పరీక్షిస్తుం దను కొంటారు డాక్టర్లు. కాని నాకేమో అదంటే ప్రస్తుతం నమ్మకం లేదు సుమా!"—

సరోజిని అతని మనస్తత్వాం యింకా గ్రహించ లేదేమో! మధు నిశ్చింతగా— నిర్మలంగా— నిష్కల్మషంగా

చూస్తున్నాడు సరోజినిని.

ఆమె కేదో సిగ్గు వచ్చింది.

"ఎందుకలా చూస్తారు?" అంది.

"నా కిష్టమైంది అదొక్కటే"— అన్నాడు మధు.

"ఏమిటీ మరీను!"— సిగ్గు బాధమితిమీరింది.

"ఏముంది— చాలా చిక్కిపోయావు నామూలంగా!" అంటూ ఆమె బుగ్గల్ని స్పృశించాడు తన ముని వ్రేళ్ళతో—

ఆమెకు నవనాడులూ జలదరించాయి

మంచు మూలంగా— యిద్దరి శరీరాలు చల్లబడ్డాయి.

"నిద్ర రావడంలేదా!" అంది—

"జోల పాడితేగా"— సరోజిని ప్రియుడంటే యిలాగే మాట్లాడుతా డనుకొంది.

ఆరాత్రి మధు సుఖంగా సరోజినిని చూస్తూ నిద్రపోయాడు.

## 7

తెల్లవారింది.

రఘు మామూలుగా వచ్చాడు.

సరోజిని జరిగిన విషయమంతా చెప్పింది.

ఆశ్చర్య పడ్డాడు రఘు.

చావుబ్రతుకుల సమస్యలు చాలావరకు రోగిమీదే ఆధారపడివుంటా యనుకొన్నాడు. తన మందువల్ల బ్రతికినాడును

కోవటం కంటే, సరోజిని ఔదార్యంవల్ల తేరుకోగల్గాడని, తృప్తిపడటం సమంజస మనిపించింది. ఆ రోజే రోగికి అన్నం తినిపించాలనుకొన్నాడు రఘు.

సరోజిని 'సరే' అంది.

మధు ఉద్రూత లూగిపోయాడు.

తన 'నటన' వాస్తవిక జీవితానికి నాంది ప్రస్తావనగా అవుతుందని సరోజిని కలకనలేదు. కల నిజమైంది. మధు హృదయాన్ని సమ్మోంచినందుకు, అతను తనవల్ల పునర్జన్మ మెత్తినందుకు, తన ప్రేమకు అంతస్థులు లేక పోవడంవల్లనూ, జీవితంలో మధుతోబాటు సహకరించడానికి సంసిద్ధురాలై, వెంకట్రావుతో మధు విషయాన్ని. అతనిపట్ల తన మనోభిప్రాయాన్ని, వెల్లడించుకొంది—

వెంకట్రావు సరోజిని మాటల్లోగల యథార్థాన్ని అవగాహన చేసుకొని కాదనలేకపోయాడు—

మధు నేత్రాలలో సరోజిని హృదయం పుష్పాడి రాల్పింది.

రఘు చేసిన ఉపకారానికి సరోజిని ప్రతిఫలం సమర్పించుకొంది— కాని, తనపట్ల సరోజిని యీ విధంగా సత్కరించి, గౌరవించుతుం దనుకోలేదు— ఆమె పంపిన ప్రతిఫలాన్ని పరీక్షగా చూస్తూ, అందుతునల్ల హాయిని జారవిడుచుకొన్న వాడిలాగా మొగంపెట్టి నిర్వేదించాడు.

# సర్పదష్టులు

పొద్దు వాటారుతోంది—

సిరాలాంటి చీకటి, కరుళ్ళు— కరుళ్ళుగా— తాటికమ్రల సందుల్లోంచి— నాల్గు దిక్కులా వ్యాపిస్తోంది.

బూచులు— బూచులుగా మసకమబ్బులు— వినీలాకాశ పథంలో తరలి పోతున్నాయి.

అప్పటి కింకా చిచ్చువలె చంద్రుడు దిగంతాల కవతల నుండి పొడుచుకు రాలేదు.

సుడిసీ— సుడిసి చిలిపిగాలి జడిపిస్తూ వీస్తోంది...

దక్షిణాపు దిక్కుగా— మెలికలు తిరుగుతూ పాతే, కృష్ణ కాలవ గట్టుమీద— జడలు విరబోసుకున్నట్లుగా దెయ్యా ల్లాగా— పెద్ద తురాయిచెట్లూ— వాటి దట్టమైన కొమ్మల గుబురుల్లోంచి మిణుకు మిణుకుమంటూ యెగిరి పట్లీలుకొట్టే మిణుగురు పురుగులూ— ఆవరించుకున్న ఆ గాఢ నిశీథిలో స్పష్టంగా ద్యోతకమవు తున్నాయి.

ఒక మహాపురుషుని చిటికెనవ్రేలి వుంగరంలో— నీరు దిగిన తెల్లరాయిలాగావున్న ఆ పల్లెపట్టుకు చెప్పుకోతగినంత

విలువగలది ఒక్కటే ఉంది—

అదే రెండంతస్తులున్న పాడుబడిన మేడ—

అంతకు మినహా, ఆ వూరికి భారీయెత్తునవున్న స్థితి లేదు. కటిక చీకటి ముసిరిన రోజుల్లో— ఆ మేడవంక కన్ను పొడుచుకు చూస్తే— చుట్టచుట్టుకుని, పడగవిప్పి— బుసలు కొడుతూ— నిద్రాహారాలుమాని— పగబట్టివున్న కోడెత్రాచు లాగా అగుపిస్తుంది—

ఏ వినాశకాలం దాపురించిందో?—

ఏ దురదృష్టం పట్టుకుందో?—

ఏ బాధ కార్చిచ్చులా మండుతోందో?—

ఏ కోరిక నిరంతరం తీరకుండా వుందో?—

ఏ బాధా మగ్నమానసం అవిరళంగా జీవించివుందో?—

ఏ నాడు— క్రీనీడలా గొచ్చిందో? మరి ఎవ్వరికీ తెలియదు?—

మొత్తానికి ఆ వూళ్ళో— ఆ మేడ— కాళ్లుతెగిన ఒంటరి ఒంటె లాగుంది. అరగంట క్రితం రెండుమైళ్ళ దూరానవున్న ఒకస్టేషన్‌లో, బండిదిగి, యెకాయెకీగా వచ్చి— ఒకడాబామీద విశ్రాంతి తీసుకుంటూ— నవ్వారు మంచం మధ్యలో బాసీపీట్ వేసుకుని— సిగరెట్ కాలుస్తున్న విశ్వనాథం— ఆ చీకటి తెరల గుండా, మాటు మణగబోతూవున్న ఆ పల్లెపట్టునీ— వాని చుట్టూ వ్యాపించివున్న పరిసర వాతావరణాన్నీ— విశాలంగా వున్న ఆకాశంమీద పరుగెత్తే మబ్బులమధ్య పొటమరిస్తున్న నక్షత్రాల్నీ— అక్కడక్కడ సిపాయిల్లాగా నిలబడి ప్రకృతికి కాపలా కాస్తున్నట్టుగావున్న కొబ్బరిచెట్లూ— తాటిచెట్లనీ—

మరికొన్ని చెట్లూ చేమల్నీ చాలా జాగ్రత్తగా పరిశీలిస్తున్నాడు...

కొలిమిలో పదునుగా కాలిన యినుపముద్దలాగా— చిచ్చర పిడుగులాగా— చంద్రుడు కొంత సేపటికి వుదయించాడు.

ఒక శాపగ్రస్థుడిజీవితం— ఒకానొక మహాత్ముని చేతి మంత్రజలంవల్ల పునీతమైనట్లుగా— విరుస్తున్న వెన్నెలకాంతిలో ఆ వూరు వెలుగొందింది. గాలికివూగే కొబ్బరియాకులు మిల మిలలాడినయి—

స్తబ్దతగాపారే కృష్ణకాలవ— వెన్నెలతో— తళతళమంటూ వుంది. వచ్చే పోయే పండుగలకు సున్నం కొట్టిన యిళ్ళు— కాసే— ఆ చంద్రకాంతిలో వెల్లి విరిసిపోతున్నయ్.

మసకమబ్బులు రవ్వంత మాలిన్యాన్ని పోగొట్టుకున్నట్టుగా వున్నయ్. ఎత్తైన ఆ పాడు మేడ— వెన్నెల్లో బాగుచేసినట్లుగా క్రొత్తగా మంచి వెల్ల వేయించినట్లుగా— ప్రకాశిస్తోంది...

కాలవ గట్టున— పాములవాళ్ళ గుడిసెల్లోంచి— పాటలు పాటలుగా— కురిసే ఆ జాబిల్లి వెలుగుల చలువదనంలోంచి— జారబూర నూదుతూ నాగస్వరంపట్టి నట్టుగా— శంకరాభరణ రాగం వినవస్తోంది, అలసాలసంగా—

విశ్వనాథం కాలుస్తున్న సిగరెట్ చటుక్కున ఆర్పేసి— మంచందిగి— యెక్కడకో వెళ్ళబోయి— ఆగిపోయాడు...

"ఏమిటీ తనిలా హఠాత్తుగా ఆగిపోవాల్సివచ్చింది?"

అని విశ్వనాథం వెంటనే అనుకోలేకపోయాడు...

అతని చూపులు, ఆ డాబా పైభాగమంతటినీ కలయ

చూస్తున్నాయి. తుప్పరగా కురిసే వెన్నెల్లో అతనూ- ఆ ప్రదేశమూ తడిసి పోతున్నట్లుగా వుంది-

"నాలో యేదో మార్పువచ్చిందే!"— విశ్వనాథం కలవరపడ్డాడు... దక్షిణం వైపుగా హఠాత్తుగా చూస్తూ-కంగారుగా- చలించాడు...

అర్థగజం పైగావున్న తెల్లని- వుల్లిపొరలాంటి పీలిక యేదో రివ్వగా వీచే గాలికి- ఆ పాలవెన్నెల్లో పిట్టగోడపై- అటూ- యిటూ వూగుతోంది. విశ్వనాథం బాగాచూశాడు...

కళ్ళు మెలకువతో అతిజాగ్రత్తగానే గమనించాయి...

అది...ఆ తెల్లని పొడుగైన వస్తువు- పాము కుబుసంలాంటి ఆపీలిక వెన్నెల్లోని అమృతాన్ని గ్రోలుతూ-గాలిలో వినవచ్చే నాగస్వరానికి తన్మయత్వం చెందుతూ- పడగవిప్పి వయ్యారంగా నాట్యమాడే- నాగకన్యలాగా- యింకా అది వూగుతూనే వుంది...

విశ్వనాథం చూసిచూసి- కడకు మంచందిగే ధైర్యంలేక అలాగే కూలబడిపోయాడు- పాముకాటూ- ప్రేమఘాటూ తిన్నవాడిలాగా...

నిజంగా-

దీర్ఘంగా-అతని అంతరాత్మలోకి చొరబడి గనుక చూస్తే- ఆలోచిస్తే- ఒక మహావిప్లవం- ఒకగొప్ప భయానక దృశ్యం- ఒక పెద్ద తుపానూ- ఒక భీతావహమైన సంఘర్షణా -ఆశాలీలా స్పదంగా దృగ్గోచర మవుతయి—

నిలువెల్లా విషమెక్కిన వాని స్థితి, విశ్వనాథం శరీర

మంతటా వ్యాపించుకు పోయింది—

అతనిలో యింతటి భయకంపితమైన వాతావరణం యెందుకు ఏర్పడ వలసివచ్చిందో అర్థంకాదు.

అతనికి తెలీకుండా— ఆవరించిన భీతావహస్థితిలో — ఒక గొప్ప భయానకదృశ్యం అతనిఆత్మ చూస్తోంది...

సహజంగా ఆత్మకుండే తాత్వికదృష్టి— అనుక్షణమూ— లాలసతో చలించే మనస్సుకి వుండదు.

మానవునికి మనస్సు వేరు— ఆత్మ వేరు...

మనస్సుకి అంతర్చక్షువులు లేవు. తనలో యెప్పటి కపుడు ఏం జరుగు తుందో— యెలా జరుగుతుందో— తెలుసు కోగల్గిన జ్ఞానం లేదు. అది ఆత్మకు వుంది.

మనస్సుకి ఏ బాధకల్గినా, ఆత్మ విచారణచేసి అనునయ పరుస్తుంది. మనస్సుకి అగోచరమైనదృశ్యాన్ని ఆత్మ దర్శి స్తుంది...

ఎందుకో ఒక్కసారిగా సముద్రాలు పొంగినయి...

మరెందుకో కులగిరులు కదిలి భూమిని దద్దరిల్లేటట్లుచేసి నయి...?

నడచినయ్యో— పరుగెత్తినయ్యో అనూహ్యాం...!!

ఏమిటో మహారణ్యాలన్నీ కార్చిచ్చుతో దహించుకు పోతున్నాయి...

ధారాపాతంగా మేఘాలు వర్షిస్తున్నాయి... ప్రళయ ఝంఝ్ఝుప్రభంజనం హేలాతిశయంతో హోరుపెడుతూ వీస్తోంది.

సెలయేళ్ళు పొంగి— దూకి దూకి— యెటో పరుగెత్తు తున్నాయి. సకల జీవరాసులూ తప్పౌకుని ప్రాణాల్ని దక్కించు

కునేందుకు — దార్లు వెతుకుతున్నాయి. క్రూరమృగాలు ఆకాశం పగిలేటట్లు అరుస్తున్నాయి—

విషసర్పాలు చెట్లకొమ్మలకి చుట్టుకొని, శ్వాసవిడుస్తూ— పీలుస్తూ అవస్థ పడుతూ— ప్రాణాన్ని కాపాడుకొంటున్నాయి.

ఒకవైపు నీటిరొద — మరోవైపు దావానలం భీపత్సం — వేరొక వైపు క్రూర— విషజంతుసంతానాల హాహాకారాలు...

ఎమిటో అంతా ప్రళయంలాగా ఉంది—

ఎటుచూచినా భయకంపిత వాతావరణం...

ఏదివిన్నా గుండె లదిరేటట్లు వుంది... వికృతఘోషలు కేకలు— అరుపులు.

అబ్బ!

"తనలో యింత మార్పువుందని" — అతనిఆత్మ గుర్తించింది.

"ఏమండీ ! బావగారూ!"

—ఎవరిదోకంఠం దగ్గరగావచ్చి — తట్టి హఠాత్తుగా కళ్ళు తెరిపిన బడేటట్లు చేసింది— అతణ్ణి! చివాల్ను లేచాడు ...విశ్వనాథం...

"ఏమిటీ నిద్ర? వూరు సర్దుమణక్కముందే!"...

"నువ్వా! శకుంతలా! యింకా యెవరో అనుకున్నాను"

"ఏం భయంవేసిందా? గబుక్కున లేపేటప్పటికి?

—విశ్వనాథం లోలోన నవ్వుకుని— ఒకమనిషిగా తేరుకొని—

"లేదుగానీ శకుంతలా! మీ అన్నయ్యేడీ!"

"ఎందుకూ?"

"నన్నింతసేపు యిక్కడ ఒంటరిగా పడేసివుంచి అవమానపరు, స్తాడా? యిదేనా వాడి మర్యాద? నాలుగూ చెఢామఢా అడుగుదామని..."

"అది వాడితప్పుగాదు..."

"మరెవరిది?"

"మాది..."

"అంటే!"

"అంటే! పెళ్ళికొడుకు తరపున మర్యాదలు చేసేవాళ్ళదన్నమాట... ఇంకా... అంటే... మాదన్నమాట... తెలిసిందా బావగారూ..."

— ఆమె పికిలిపిట్టలాగా కిలకిలమని నవ్వి వూరుకుంది—

"నన్ను రమ్మని చెప్పాడుగదా! శుభలేఖ వేసాడాయె! వస్తానని తెలుసుగా! చివరకు నేను వచ్చానో—లేదో కూడా గమనించకుండా ప్రవర్తించెడమేనా! యిదేనా స్నేహితుడు అయినందుకు చేయవలసినపని? ఇదేనా స్నేహధర్మం?"

"అయినా, మీరు రైలు దిగివచ్చి, ఒంటరిగా—యీ డాబామీద బిక్కు బిక్కుమంటూ కళ్ళుమూసుకుని పడుకోబోతే, పెళ్ళి జరిగే మేడలోకి రాకూడదూ! అరిగిపోతారా!"

"ఏమిటో నాకా ఆలోచనే కల్గలేదు శకుంతలా!"

విశ్వనాథం, తన తెలివితక్కువతనానికి సిగ్గుపడుతూ జవాబిచ్చాడు.

శకుంతల చిన్నగా — సన్నజాజిపూవు విరిసినట్లు నవ్వి వూరుకొంది.

మెల్లిగా— పిల్లగాలి— వీస్తోంది—

విశ్వనాథం, యింకా అలాగే స్తబ్దుగా కూర్చుని వున్నాడు...

అతని చూపులు— వుండీ వుండీ— పిట్టగోడపై వూగే తెల్ల పేలికపయి పాతరలాడుతున్నాయి...

మంచులాగా వెన్నెల తుంపురులు పాటలు— పాటలుగా రాలుతున్నాయి...

అక్కడికీ శకుంతల పట్టుమని అయిదు నిముషాలు నిలబడివుండే వృధాచేసింది. అయినా,

విశ్వనాథం, మంచం దిగి, బయలుదేరే ప్రయత్నంలో వున్నట్టు తోచటంలేదు.

విశ్వనాథం, అంతరాత్మలో తారాడే— ఆ తెల్లని పేలికను ఏమిటో భయం— ఆవేదన—కంగారు—వణుకు— పుడుతున్నాయి.

శకుంతల తనకోసమే వచ్చిందనీ— త్వరగా ఆమెతో బాటు కదలి వెళ్ళాలనీ— తనవల్ల యిప్పటికే చాలా ఆలస్యమైందనీ—యిలాంటి బాపతు భావాలు విశ్వనాథంలో కల్గలేదు.

ఏదో దుడుకుభావం - పది సంవత్సరాల క్రిందటే— యెలాగో విస్మరించిన క్లిష్టమైన ఆలోచనా - అందులోని అతివాస్తవికతా పూరితమైన సంఘటన - దాని తాలూకు సంఘర్షణ—ఒక్కుమడిగా - ఉప్పెనలాగా చుట్టుముట్టి అతణ్ణికకావికలపరస్తోంది—

అతని హృదయం సలసలా— హల్లాలాగా - మరుగు

తోంది.

ఏర్పడివున్న చల్లని వాతావరణం. అతణ్ణి మరింత కవ్వి స్తోంది.

గాలికి వూగే ఆ తెల్లని పాము కుబుసంలాంటి పేలిక అవిరళంగా భయపెడుతోంది. పడగవిప్పి, తను వేయబోయే ఘోరాతి ఘోరమైన కాటుకి సమయాన్ని వెతుక్కుంటున్న మేడ, ఆ మేడే కాలవగట్టు మీాది నుంచి— గాలిలో కలిసి నాగస్వరంలాగా వచ్చే— ఒకవింత సంగీతం లాగా ముసలు కొడుతోంది.

విశ్వనాథం క్షణక్షణానికీ చలిస్తున్నాడు.

శకుంతల అతని ఎదుట— అలాగే నిలబడివుంది.

అరగంట గడిచింది.

చంద్రుడు కొంచెం పైకి పాకాడు...

గాలిరొద హెచ్చింది... కాలవగట్టుమీాద సూక్ష్మాతి సూక్ష్మమైన రాగ ప్రసారంలో— నాగస్వరం సొరకాయల నుండి వినవస్తుంది.

పిట్టగోడపై— ఆ తెల్లనిపీలిక యింకా అలాగే— వెన్నె ల్లోమిల మిలలాడుతూ మెదుల్తోంది.

ఆకాశంలో ఏర్పడిన ప్రతి మబ్బుముద్దా - పాముపడ గల్లాగేవున్నట్టు కనిపిస్తున్నాయి. వాటిమాటున చిరువెలుగుల్ని చిందిస్తూ - చిన్నిచిన్ని దీపాల్లాగా - నక్షత్రాలు మెరుస్తు న్నాయి.

శకుంతల అతనికోసం యిక వేచివుండ బుద్ధికాలేదు—

"ఏమిటీ బావగారు ! యింకా ఆలస్యం? లేచి బయలు

దేరలేం!"

"యిప్పటికే మీరు చాలా ఆలస్యంచేశారు" – అనే భావాన్ని సూటిగా అనటం బాగుండదనియెంచి అలా అంది–

"ఎలా రాను?"

"ఏం ?"

"ఏమిటో భయంగావుంది, కాదు...భయంవేస్తోంది!"

—శకుంతల ఆశ్చర్యపడింది –

"భయమా!"

"అవును శకుంతలా! భయమే! యిందాకాన్నుంచీ అరచేతిలో ప్రాణాన్ని పట్టుకూర్చున్నాను. యెందుకు మళ్ళా యిక్కడికి వచ్చానా? అని తిట్టుకోవా లనిపిస్తోంది!"

"మీ రేదో చాలా వింతగా మాట్లాడుతున్నారు."

"నేనా?...నేను...నేను!!... వింతగానా... నీతోనా ...శకుంతలా"

"అవును...బావగారు! నాతోనే!"

"కాదు శకుంతలా! నీతోగాదు..."

"అదేమిటండి బావాగారు! నేనుతప్ప మీతో యిక్కడెవరున్నారని మీరు మాట్లాడేది?"

"అది..."

"ఏది?"

'అది! నువ్వుకాదు...అది...అదే!... అదేశకుంతలా!'

—అలా అంటూండటంతోనే విశ్వనాథంచూపులు పిట్టగోడపై నిల్చినయి.

"ఏమిటది?" – శకుంతల అటుచూస్తూనేవుండి, ఏమీ

కనబడకనే, అడిగింది. అతనిచూపులు అటువైపే పోయి నిల్చి వున్నాయి.

"యేమిటా? నీకు కనిపించటంలేదా శకుంతలా?"

"ఊహు..."

"సరిగా చూడ్దూ!"

"సరిగ్గానేచూస్తున్నా బావగారూ!"

"వెన్నెల్లో – ఆ పిట్టగోడపై – తెల్లగా – యేదో పాముకుబుసంలాగా – మిలమిలా మెరుస్తూ – కదుల్తూ లేదూ!" అతనికంఠం వణుకుతోంది.

"యేంలేదే బావగారూ!"

"కాదు శకుంతలా! వుంది. లేకపోతే నాలో యింత భయం –, యేన్నడో మర్చిపోయిన ఒక విషాదగాథతాలూకు సంఘటన–, కొన్ని భీతిని కలిగించే ఆలోచనలు యింతవరకూ లేనివి, యెందుకు యేర్పడినట్లు?"

...విశ్వనాథంస్థితి యెలావుందో శకుంతల గుర్తించింది

"మీరు ముందు నాతో బయలుదేరండీ!"

"ఎక్కడికి?"

"పెళ్ళి పందిట్లోకి."

"ఊహూ..."

"నేను రాను... శకుంతలా! నేను రాను..." అతని కంఠం ఉలిక్కిపడింది...

"మీ రిలా అంటూ, రాకపోతే - మా అన్నయకు కోపంవస్తుంది..."

"యేంచేఘను మరి?"

"నాతో బయలుదేరి రండి..."

"రాలేను శకుంతలా!"

"రావాలి బావగారూ! తప్పదు. మా అన్నయ్య మీకోసం యెదురు చూస్తూ వుంటాడు. యిక్కడికి వచ్చి, అక్కడిదాకా, రాకపోతే వాడిమనస్సు యెంత బాధపడుతుందో మీకు తెలియందిగాదు. లగ్నం వేళకూడ దగ్గర పడుతోంది. లేద్దురూ! బావగారూ!"

—శకుంతల అతణ్ణి తొందరచేయసాగింది.

అతనిబాధ ఆమెకు తెలియదు.

ఆమెతో వెడితే అతను మరీ భయవిహ్వాలతను పొందాల్సివుంటుంది. ఆసంగతి విశ్వానాధంకి పూర్తిగా తెలుసు— యేమిటీ చేయటం?

"పది సంవత్సరాలక్రిందట— యి దేవుళ్ళో— తనుపడిన విపరీత విషమావస్థ" విశ్వానాథం హృదయంలో మేల్కొంది

ఇంతలో పెళ్ళిపందిట్లో సన్నాయిసంగీతం ప్రారంభమైంది. శకుంతల విశ్వానాధాన్ని మెల్లాగా తేనేం బయలుదేర తీసింది.

ఇరువురూ అలాఅలా నడిచి—నడిచి ఆ వెన్నెలనీడల మధ్య — ఆ మేడ ముందుకు చేరారు...

చుట్టూ, చవుకురాలే యిటుకరాతి ప్రహరీగోడ బాగు చేయించి. రంగు వేయబడివుంది—

గేటుముందు పెద్ద రెండు కొబ్బరిచెట్లు తోకమీద నిలబడ్డ త్రాచుల్లాగా — వున్నయి.

విశ్వానాథం, శకుంతల వెంట గేటులోకి వెళ్ళలేక చటు

క్కన నిల్చుండిపోయాడు. ఆమె కొంతదూరం ముందుకువెళ్ళి వెనక్కితిరిగి చూసింది.

విశ్వనాథం లేడు. భయంతో బయట నిలబడివుండటంచూసి— సరాసరివెళ్ళి శకుంతల, తన అన్నతో చెప్పింది.

నాలుగు పెట్రోమాక్సులైట్లు ఆ మేడముందు విశాలమైన ప్రదేశంలో దేదీప్యమానంగా వెలుగుతున్నయి.

పెళ్ళికొచ్చినవాళ్ళు ఆ పనిమీదా— యీపనిమీదా అటూ—యిటూ— గలభాగా తిరుగుతున్నారు.

పాడుపడిన- ఆ మేడని- పదిసంవత్సరా లనంతరం- కీకారణ్యంలాగా వున్న చెట్టుచేమల్నీ- ముళ్ళదుబ్బుల్ని— శుభ్రంగా నరికివేసి- చక్కగా తోటలాగామార్చి- మారుతి పెళ్ళికి పెద్దపందిరివేసి, యెంతో అందంగా తయారుచేస్తారని, విశ్వనాథం కలలోకూడా తలచలేదు. ఇప్పుడు కళ్ళారా ఆ మేడని చూస్తుంటే- తనలోని భయం కొంత యినుమడించుకుపోతున్నట్లుగావుంది,

రంగులతో ఆమేడను తీర్చిదిద్దారు కిటికీలకు- దర్వాజాతలుపులికీ వార్నిష్‌రంగులుపూసారు.

పిచ్చిమొక్కలతో ఆవరించుకున్ననుయ్యి. గిలకా— తాగాడితో వనరుగా వుంది. పీలునిబట్టి నీళ్లుతోడుకోడానికి—

గలీజుగా వుండేచోటు చదునుచేసి చాపలుపరిచారు.

ఇలా ఆమేడ—మారుతిపెళ్ళికి— ఒక ఆటవికుణ్ణి సంస్కరించినట్లుగా—ఉద్ధరించబడింది.

విశ్వనాథం దిగ్భ్రాంత నయనాల్తో చూస్తున్నాడు. పాతగాధ గుర్తుకొచ్చింది—

"మారుతి మిమ్మల్ని లోపలికిపిల్చుకురమ్మంటున్నాడు..."

—ఎవరో ఒకతను, విశ్వనాథాన్ని లోనికి ఆహ్వానిస్తూ పిలిచాడు.

పదిసార్లు యెవరెవరితోనో రమ్మనమని బ్రతిమిలాడించుకోవటం విశ్వనాథానికి లజ్జగాతోచింది. అయినా తన మిత్రుడి పెళ్ళిలో—తనిలా ప్రత్యేకాహ్వానాలతో పిలిపించుకోవటం అమర్యాదగా అనిపించి—వెంటనేలోనికి కదిలాడు.

ఎప్పుడో—యెందుకో? కటిక్కిన ఆగిన సన్నాయి సంగీతం తిరిగి సన్నసన్నగా మొదలైంది.

విశ్వనాథం మెల్లిగా అడుగుతీసి—అడుగువేస్తూ వసారాలోకొచ్చాడు.

ఎదురుగా పెద్ద సింహద్వారం కనిపించింది.

దానిపైకి చూశాడు... అర్ధచంద్రాకారంగా ఆర్చి వుంది.

దానివంక చూశాడు...

"ఫణి విగ్రహం"

ఆ ద్వారంపైన పెద్ద వేయితలల పాము పడగవిప్పి—నాలికలు సాస్తూ—బుసలుకొడుతూ—మెలికలు తిరుగుతూ వున్నట్టుగా— యేనాడో రాతితోచేసిన విగ్రహం, నల్ల రంగుతో—కాటు వేయబోతున్నట్టుగావుంది. పదిసంవత్సరాలనంతరం—ఆ సర్పవిగ్రహాన్ని—యీవిధంగా చూడగానే గుండె గుభిల్లుమంది.

మొదటిసారిగా చూసినప్పుడు యేభయమైతేవేసి, యింత కాలమూ ఆ వూరికే దూరంచేసిందో— అదేభయం

జ్వరంలాగా మళ్ళీ ఆవరించింది.

విశ్వనాథం తీక్షణంగా—అలాగే నిలబడి అవలోకిస్తు న్నాడు... మర్చిపోయిన వ్యాకులత మళ్ళా చిగురించింది. ముఖం నల్లబడింది.

"లోపలికి రాలేరా యెంత సేపటికీనూ!"

మారుతి వచ్చి యెదురుగానిలబడి—గట్టిగా వూపుతూ అడిగేంతవరకూ విశ్వనాథం యీలోకంలో లేడు.

మారుతికి, విశ్వనాథంముఖం ఇంత నల్లకప్పేసుకోని వుండటంతో— వెనుకటిరోజులు జ్ఞప్తికొచ్చినయి.

విశ్వనాథం పరిస్థితి యెందుకో—అప్పుడప్పుడూ యిలా అవుతూ వుంటుందని మారుతికి తెలుసు.

కానీ, యెన్నడూ కారణం అతనుఅడగనూ లేదు. విశ్వ నాథం స్నేహపూర్వకంగాను— చనువుగానూ— చెప్పవలె నని చెప్పనూ లేదు!

ఇద్దరూ లోపలికి వెళ్ళికూర్చున్నారు...

సన్నాయి సంగీతం వుధృతంగా సాగుతున్నసమయంలో పెళ్ళిపీటల మీద కూర్చోబెట్టడానికి— నాగత్నాన్ని— నడిపించుకొస్తున్నారు పేరంటాళ్ళు.

"తనకు కాబోయే భార్య యెలావుందో చూసి చెప్పరా!" అన్నట్లు.

మారుతి పెళ్ళి పీటలమీదనుంచి— తలెత్తి— విశ్వ నాథంవైపు చూశాడు—వుషారుగా—

విశ్వనాథం అప్పటికే నాగరత్నాన్ని చకచకా చూసే స్తున్నాడు...

మారుతి. రాలేకవస్తూ—సిగ్గుతో తలవంచుకొని వున్న నాగరత్నాన్ని చూసాడు, 'ఆమె ఒక కోయ్యబొమ్మలాగుంది'...

ఆమె చూపులు అంతమందిలోనూ విశ్వనాథాన్నే వేటాడుతున్నాయి.

అతణ్ణి చుట్టేసి కాటేస్తున్నాయి...

మారుతి, కంగారు పడ్డాడు...

పెళ్లి పందిరంతా జనంతో నిండిపోయింది.

ఒకవైపు సన్నాయి సంగీతం—వేరొకవైపు జనం గోల మాటలు— మరొకవైపు వేద మంత్రోచ్చారణలు- పందిరంతా ప్రతిధ్వనిస్తోంది.

కనబడీ కనబడటంతోనే నాగరత్నం యెవరో విశ్వనాథం గుర్తించాడు. అంతే! అతనిముఖం విషమెక్కినట్లు వివర్ణమైపోయింది. మారుతి చూశాడు,

విశ్వనాథంలో మునుపటిస్థితి లేదు.

పెళ్లిపీటలమీద కూర్చున్నా— తనప్రక్కనే. తన భార్య కాబోతున్న నాగరత్నం అన్యాక్రాంతమైపోయే పసిడి బొమ్మలా వుంది.

"యేమిటీ విపరీతం?"

—మారుతికిఅర్థంకాలేదు. లక్ష యక్షప్రశ్నలు కలిగినయి— విశ్వనాథంనిచూశాడు. అతను యేకారణం ప్రోత్సాహంవల్లనో చివాలునలేచి, సింహద్వారంగుండా— చెప్పాపెట్టకుండానే చక్కా వెళ్ళిబోతున్నాడు.

మారుతి ఆశ్చర్యపడుతూ— నిస్తేజంగా చూస్తుండిపోయినాడు.

విశ్వనాథం ఆత్మలోపడేమదన, మారుతి కేం తెలుసు? పాపం...!!

తనుకూడా వెంటలే చివెడదామను కున్నాడు. అంతలో పెళ్లికుమారుడు తనే అని తెలియటంతో — తాళికట్టేబాధ్యత తనదేనని గుర్తుకురావటంతో — కట్టుబడినట్లు కూర్చుండిపోయాడు మారుతి.

"తనమాదిరిగా— నాగరత్నంకూడా విశ్వనాథం వెళ్లినవైపే చూపులునిగిడ్చి నిశ్చలంగా నిర్వేదంతో చూస్తోంది" —అని మారుతి యిట్టే పసిగట్టాడు....

"యేంచేయాలి తను ?"—మారుతి తనలో అడిగిచూసుకున్నాడు.

"విశ్వనాథం ఎందు కొచ్చివెళ్లినట్లు?"— ఆప్తమిత్రుడు యిలా హఠాత్తుగా—వింతగా- ప్రవర్తిస్తే, మారుతి లాంటివాళ్లకి యింతకన్నా చిక్కువిడనిప్రశ్న యింకోటేం కల్గుతుందని...

"ఎప్పుడు మూడుముళ్ళూ వేసి- విశ్వనాథంని చూస్తానా?"- అని మారుతి తపనచెందాడు- కూర్చొని వున్నంతసేపూ—

అతనికి తెలియనిస్థితిలోనే, నాగరత్నంమెళ్ళో తాళికట్టాడు—

అతనికి వున్నశక్తిని గుర్తుకితెచ్చుకోకుండానే, దోసిళ్ళెత్తి తలంబ్రాలు పోశాడు.

అతను- అర్థంగాని పరిస్థితిలో నిమగ్నమైవుండటం నాగరత్నం గ్రహించింది. తలంబ్రాలనంతరం—యించుక తలెత్తి.

భర్తవైపు చూసింది. పుట్టలోనించి బయటకివచ్చే పాము చూసినట్లు...

"ఎందుకు యిలా చూసినట్లు?"— తనభార్యచూస్తుండ గానే, మారుతీచూశాడు— క్రొత్తదృష్టితో—

ఆమె, అతనిచూపులికి లొంగుతూ అర్థంకాలేదు.—

ఆ కళ్ళల్లో యేదో తీరనికోరిక, తీరబోయే ముందు వున్న వుత్సాహం, ఆదుర్దా— దృగ్గోచరమైనయి. కారణం?—

ఆమెముఖం క్రమేపీ ప్రఫుల్లితమై వింతశోభను దిద్దుకుంది.

ఆమెగాదు, కట్టుకున్న చీరెదగ్గర్నుంచీ— పెట్టుకున్న తిలకంవరకూ నగలతోసహా నాగరత్నం సర్పకులంలోంచి— తప్పిపుట్టినట్లుగా వుంది. ఆమెలోని ప్రతి అవయవమూ— ప్రతి కదిలికా— సర్పలక్షణాల్ని గుర్తుకితెచ్చి చూపుతున్నాయి—

"ఇది యేదో ఒకరకంగా తనని హింసిస్తుందికాబోలు" —అని ఆమెను చూస్తుంటే— అదేపనిగా— మారుతిలో భయంకల్గింది— ఒక బుసకొట్టేభావం అతన్ని చలింపచేసింది. కాని, నిలవద్రొక్కుకున్నాడు.

కొద్దిగంటలక్రితం, తనకు భార్యగావచ్చిన నాగరత్నం యింతటి భయోత్పాతాన్ని సృష్టించిపెడుతుందని మారుతి కెట్లా తెలుస్తుంది?

ఆమె కళ్ళల్లో— చూపుల్లో— విడిచేశ్వాసలో—కదిలే యవ్వనపుపొంగులో— పెదవులలో— వేషంలో—అన్నిటా అనేకరకాలైన అనుమానాల్ని రేకెత్తించే భావాలు పూదుతున్నప్పుడు, మారుతి విశ్వనాథంకంటే యెక్కువ బాధపడ

కుండా .యెలావుంటాడు?

అప్పగింతలుపాడి, నాగరత్నాన్ని సాగనం పేలోపుగా, మారుతి, ఒకసారి ఆగలేక, విశ్వనాథంని తనున్న చోటికి రమ్మ నమని కబురుచేశాడు.

"మూడునిద్రల కొచ్చినపుడు, యిక్కడేకలిసి, డాబా మీదే మాట్లాడుకుందాం. అంతవరకూ నే నెక్కడికీ పోను. ఉంటా!" నంటూ సమాధానంయిచ్చి విశ్వనాథం వూరుకు న్నాడు.

ఇలా ప్రవర్తించినందుకు మారుతికి మరింత అనుమానం —భయం—వేసింది. "ఏదో విషపూరితమైనవిషయం విశ్వ నాథం గుండెలో గూడుకట్టుకొని వుంది— అందుకే యిలా జవాబిచ్చాడు—"

—మారుతి కలవరపాటుగా అనుకున్నాడు.

"అయితే నేను వెళ్లేవరకూ విశ్వనాథం చేసేదేమిటి?"

...మారుతికి తెలియలేదు... విశ్వనాథం నిజంగా ఏం చేస్తున్నాడు?...

"నా పెళ్ళి యిలాజరిగి— యిలాంటిబాధ కల్గిందే మిటా!"– అని,

"నేను ఆలోచిస్తున్నట్టే, విశ్వనాథంకూడా యోచిస్తు న్నాడా?"

ఏమో?... వాడికసలే చిన్నప్పట్నుంచీ పాములంటే భయం...

యీ మేడలో— మేమిద్దరం వుండేరోజుల్లో– పదేళ్ళ క్రిందట– విశ్వనాథం– చీకటిపడితే బయటికి వెళ్ళేవాడు

కాదు—"

—యిలా మారుతి దీర్ఘాలోచనాపరుడైనాడు—

వెన్నెల జలజలా రాలుతోంది-

గాలి దూకుడుగా వీస్తోంది-

ఆకాశం నిర్మలమైంది-

కాలవగట్టుమీద సొరబూరలు నాగస్వరమే వూదుతున్నాయి,

కాలవ వెన్నెలతో కలిసి పారుతోంది-

నక్షత్రాలు మిణుకు- మిణుకుమంటున్నాయి-

విశ్వనాథంకూడా తోచక. నాగరత్నాన్నిగూర్చి తలపోస్తున్నాడు. ఏదో మాయతెర ఆకాశంనుండి పడింది. అంతే.

## 2

పదిసంవత్సరాల క్రిందట—

ఆ వూరు కొంచెం కళకళలాడుతూ వుండేది— చీకటిపడితే, అప్పటికీ- యిప్పటికీ ఒకేగతితో పారే ఆ కాలవగట్టుమీదకు ఒంటరిగా యెవ్వరూపోయి కాలక్షేపం చెయ్యరు...

ఒక సన్నని పిల్లకాలవలాగా ఒక కాలిబాట వంకరటింకరగా— ఆ కాలవగట్టుమీద యెక్కడికో అటూ-యిటూ పోతుంది-

ఒకనాటిరాత్రి విశ్వనాథం ప్రొద్దుబోయేదాకా చదువుకుని, లాంతరు తగ్గించి. మారుతిని ఒంటరిగా పడుకోనిచ్చి-కాలవగట్టుకు బయలుదేరి వచ్చాడు—ఎందుకో?

ఆ వూరికి రెండుమైళ్ళ దూరంలోవున్న. ఒక చిన్నపట్ట ణావు కాలేజీలో చదువుతున్నారు వాళ్ళిద్దరూ, ఉండటం— తినటం బస్తీలో ప్రియంగావుంటుందని, విశ్వనాథం అనటంతో, 'నిజమే!' నని తలంచి, మారుతి కూడా విశ్వనాథంతో ఏకీభ వించాడు! తన దిక్కులేని జీవితానికి, మారుతి ఒక్కడే ఆధా రమని నమ్మిన విశ్వనాథం, అతనికొచ్చే డబ్బుతోనే కాలం గడుపుతూ చదువుకోసాగాడు.

మొదట్నుంచీ మారుతి ధైర్యస్థుడు. దేన్నీ తేలికగా నమ్మడు......

విశ్వనాథం పెద్ద పిరికివాడేమీ కాదుగాని, ప్రతిదీ వినంగానే, చూడంగానే నమ్ముతాడు. లోలోన కుళ్ళబెట్టుకుని కుంగందే మనస్తత్వం గలవాడు,

చీకటి దట్టంగా అలుముకొని వుంది...

కాలవగట్టు మీదకి, విశ్వనాథం సిగరెట్ కాలుస్తూ వచ్చి— వచ్చి... ఒకచోట నిలబడి చూస్తున్నాడు, దేన్ని? చుట్టూచూస్తున్నాడు. దేనికోసం?

మైలురాయిమీద, అంతవరకూ సేదతీర్చుకున్న గుడ్ల గూబ రివ్వున యెగిరివచ్చి— నెత్తిమీద గోళ్ళతో గీరి— చీక ట్లోకి తోసుకుపోయింది— ఉలిక్కిపడ్డాడు. ఒళ్లు జలదరించింది.

చెరుకుతోటల్లో— బొరియల్లో పీతల్ని తిని తిరుగుతూ అరిచే నక్కలు కూతపెట్టి రోదిస్తున్నయి...

తీతువు పక్షులు యెత్తుగావుండి అరుస్తూ పోతున్నయి..

విశ్వనాథంకి, 'తనెందుకొచ్చి ఈ వాతావరణంలో మగ్నమైవుండటం జరుగుతోందో'? తెలీటంలేదు—

పదిహేను నిముషాలు దాదాపు గడిచినయి—.....

ఒక్కసారిగా- అంతవరకూ యేర్పడివున్న నిశ్శబ్దాన్ని చీలుస్తూ—

ఒక పిలుపు మృదువుగా—విశ్వనాథంకి వినిపించింది....

కళ్లు నులుముకుని— ఆ పిలుపు వచ్చిన దెసవైపు చూశాడు .....

ఒక మైలురాయి తెల్లగా— చీకట్లోంచి స్పష్టంగా కనిపిస్తోంది...

ఆ రాయిమీద యెవరో కూర్చొని- ఖచ్చితంగా- అతణ్ణి పేరెట్టి పిలుస్తున్నారు. విశ్వనాథం 'తననే' ననుకుని యింకా బాగా చూశాడు.

ఆ వ్యక్తి యెవరో తెలీదుగాని ఒక వింత కాంతి ఆ ప్రాంతనుంచి, వచ్చి, ఆగింది విశ్వనాథంకి, దారి చూసి తీసుకు పోయేందుకు—

'నక్షత్ర కాంతికంటే కూడా, ఆ మైలురాయినుండి వచ్చి, తనముందు నిల్చి, ఆహ్వానిస్తున్న వింత కాంతి యెంతో ఆహ్లాదకరంగా వున్నట్టు' తోచింది విశ్వనాథానికి —కారణం తెలీకుండానే—

అంతే—......

విశ్వనాథం—ఆ కాంతి బాటవెంట మైలురాయిని చేరి చూశాడు...

"—స్త్రీ....."

విశ్వనాథం గజగజలాడాడు... ఏమిటో యెగాదిగా చూస్తున్నాడు...

"......ఒంటరిగా వున్నానని అనుమానిస్తున్నారా?"

విశ్వనాథం ఆశ్చర్యపడ్డాడు. తనెవరో పరిచయపూర్వకంగా తెలుపుకోకముందే, ఆ స్త్రీ అలా అడగటం,— విశ్వనాథం ఏం చెప్పాకోలేకపోవటం జరిగింది—...బేలగా...

"...మీరు నాకు బాగా తెలుసు..."

...ఆ స్త్రీ చిన్నగానవ్వి విశ్వనాథంముఖంలోకి తేరి పారచూసింది.

"నేనెట్లా మీకు తెలుసు?" అని అతను అడిగే లోపుగా—ఆమె,

"........మీరా శేష్‌మహల్‌లో వుంటున్నారు గదూ!......"

విశ్వనాథంకి అంతవరకూ తెలీదు. తను— మారుతీ వుండే అ పెద్దమేడపేరు 'శేషుమహల'ని ఏదో ఫ్యూరికే వుంది గదా! అనీ, అందులో తాము బ్రహ్మచారుల్లాగే వుంటున్నామనీ— కొంత యింటిఅద్దె కలసివస్తోందనీ— తెలుసునేగానీ మిగతావివరాలేవీ తమకి తెలీవు. చకితుడయ్యాడు....

"కావచ్చునేమో! మరి. యింతవరకూ ఆమేడ పేరు మాకు తెలీదు." —అని అతను సమాధాన మిచ్చేలోగా— ఆవిడ,

'...నేనూ ఆ మేడలోనే క్రిందిభాగంలో వుంటున్నా...'

విశ్వనాథం తెల్లబోయాడు. యిప్పటికి దాదాపు ఆరు నెలలనుండీ ఆ మేడలో తానూ— మారుతీ వున్నా, ఒక్కనాడూ ఆ స్త్రీ వున్నట్టుగానీ, మసిలినట్టుగానీ జాడలు కనుపించలేదు. ఎప్పుడుంటుందో?— ఏమో?

విశ్వనాథంబుర్ర గిరగిరా తిరుగుతోంది....

".... ఒక్కర్తెనే వుంటున్నాను.... మీరే నాకు బాగా తెలుసు,..."

"ఎలా తెలుసు?"- అని విశ్వనాథం అడిగేద్దామని, పెదవులదాకా తెప్పించుకుని, వెలువరించేలోపుగా- ఆమె- మెల్లిగా లేచి దగ్గరగావచ్చి- తాకుతూ- తనచేతుల్ని అతని మెడచుట్టూ వేస్తూ—

"...నన్ను మీరు యిలా యేనాటికో నాటికి వెతుక్కుంటూ ఒంటరిగా వస్తారని అనుకుంటూనే వున్నాను. అందుకే యిలా రోజూ మీకోసంయిక్కడే యెదురుతెన్నులు చూస్తూవుంటు న్నాను.... మీరు చిన్నప్పుడే, నన్ను ఒదిలి వెళ్ళినా, నేను మీ పాదసేవచేసి పుణ్యంకట్టుకోవాలని యింకా తపిస్తూనే వున్నాను...."

—నాగమణి యిలా అతనిమీదకు యెగబ్రాకుతూ- రొమ్ములతో పాముకొంటూ- తీయతీయగా- మృధుమధు రంగా పలుకుతుంటే, విశ్వనాథం ఉక్కిరిబిక్కిరిరవుతూ- తన కోసం 'నాగమణి' అనే పేరుగల పద్దెనిమిది సంవత్సరాల యువతి, శాశ్వతజీవితానందంకోసం తపిస్తోందని తెలుసుకోవ టానికి అవకాశం దొరకలేదు. ఆమె అతనిశరీరాన్ని— ప్రతి అవయవపుమలుపునీ తాకి తాకి పులకలు రేపింది. తనముఖాన్ని అతనిముఖంలోక్కి పోనిచ్చి-

"మీరు నాకోసంగాదూ! యింత చీకట్లో ఒంటరిగా వచ్చింది...."

—అంటూ చిరునవ్వునవ్వి తృప్తిచెందింది....

విశ్వనాథం, ఆమె చేతితాకిడికి చలిముద్దలాగవుతు న్నాడు....

ఆమె నవ్వులు అతణ్ణి మంత్రముగ్ధమోహనత్వంలో ముంచి—ముంచి తన్మయత్వం చెందేలాగు చేస్తున్నాయి....

విశ్వనాథంలాంటి ప్రతిపురుషుడికోసం, నాగమణిలాంటి ప్రతియువతీ ప్రేమపూరిత హృదయంతో పరితపిస్తూ- చీక ట్లోనూ, వెన్నెల్లోనూ-చల్లని గాలిలోనూ- పూలతావు ల్లోనూ- నిత్యమూ అలమటిస్తూ విరహంతో వుండటం సహజం కాకపోదు. ఎలాగైనా అతను మాట్లాడుదామనీ- యెంతో ప్రయత్నించాడు- అవకాశం దొరికినప్పుడల్లా. కానీ, ఆమే నోరువిప్పేది యిలా.....

"మీకు మల్లే నాకూ చీకటంటే మహాప్రీతి...."

"తనకు చీకంటలే మహాయిష్టమని, నాగమణి యెట్లా పసికట్టింది? నిజంగా తనకది కాదే? ఇట్లా అంటుందేమిటి?"- విశ్వనాథం గిలగిలలాడుతున్నాడు....

"... ఏమిటి మరీనూ.... మీరు అలాఅయిపోతు న్నారు?"

"ఏముంది?"— అన్నట్లు విశ్వనాథం మొగంపెట్టాడు. తనలో మార్పు నిజంగా కలుగుతోందని తెలుస్తున్నా, తెలీ నట్లు స్తబ్ధుగా నున్నాడు....

"నాకు తెలుసు.... యిప్పుడు మీ రేస్థితిలో వున్న దీనూ...!

యిందాకటికంటె చాలా మార్పువచ్చిందిమీలో....! ఒక వ్యక్తి మనస్తత్వం తెలుసుకోవాలంటే, యిష్టంవున్న

అభిరుచిని చెప్తే యిష్టములేని ఏదో తేలుతుంది. యిష్టంలేని దాన్ని చేప్తే యిష్టమున్నది తెలుస్తుంది. మీాకు చీకటంటే సరదా లేకపోవచ్చు. భయమేవుండొచ్చు. కాని, ఒకప్పుడైనా చీకటంటే యిష్టపడతారని యెవరికో తెలీకపోయినా, ముఖ్యంగా నాకైనా తెలిసింది. ఇక ముందుకూడా మీా అభిరుచి ననుసరించే నేను మిమ్మల్ని చీకట్లో యిలా కలుసుకుంటూవుంటాను, సరేనా?" నాగమణి ముగించింది.

విశ్వనాథం నివ్వెరపోతూ, తిరిగి వెళ్ళిపోవటానికి వెనక్కి తిరిగీ తిరగటంతో, అతను విసుగెత్తాడని తెలుసుకుని.

"నేను మీాతోబాటే వస్తున్నాను. అంత తొందరైతే యెలా"

అంటూ, ఆమె అతనితో అనుసరించింది. చీకటిదారులలో.

ఇరువురూ, ఒకరివెనుక ఒకరు దారినబడి నడుస్తుంటే.

గచ్చ పొదల్లోంచి కీచురాళ్లు గీపెడుతున్నయి..మిణుగురులు గాలిలో కాలవమీాదుగా యెగిరిపోతున్నయి. ఉండి,వుండి వుల్కాలాలు నెత్తురు చారికల్లాగా ఆకాశంమీాదినుంచి యేటవాలుగా జారిపడుతున్నయి. బొమ్మజెముడు మట్టలు తలలూపుతూ తప్పట్లు చరుస్తున్నయి. తెల్లజిల్లేడుపూలు తేలి మొలకనవ్వుల్ని వెదజల్లుతున్నయి.

"మీాకు తెలియదుగానీ, వెన్నెలకంటే చీకటే అనుభవించటానికి ఆహ్లాదకరంగా వుంటుంది — కదూ!"

—నాగమణి మళ్ళా చీకటి ప్రస్తావన యెత్తింది...

విశ్వనాథంశరీరం కంపించింది. మౌనంగా నడుస్తు

న్నాడు...

"రాక రాక ధైర్యంచేసి యివ్వాళ వచ్చినందుకు యీామె ఎవరు? 'నాగమణి'- అంటూ తన కింతరాత్రిపూట పరిచయమైం దేమిటి? తనలోని భావాలు యెలా తెలుసుకో గల్గుతుంది?"

—"ఇవ్వేగా మీారు మౌనంగానడుస్తూ ఆలోచించు కునేది?"

ఆమె ఫక్కున అడిగేసింది... అతను తలెత్తి కాలవ గట్టు దిగీ దిగటంతోనే ఆమెకళ్ళల్లోకి చూశాడు- 'అవ్వేన న్నట్టుగా'—

నాగమణి మరీ నవ్వింది- అతని చెవులు దిబ్బిల్లుపడినయి-

"నువ్వు నన్ను చాలా భయపెడుతున్నావ్," అని అన్నట్టుగా అలా చూస్తారేం?"- చిలిపిగా అడిగింది.

"నన్ను చూసి నిజంగా భయపడుతున్నారా? చెప్పండి పోనీ. చనువుగా అడుగుతుంటే చలించటం న్యాయంకాదు. నే నెవరో యింకా మీాకు గుర్తురాలే దనుకుంటా... యేసారి చెప్తాలెండి— విపులంగా! తిరిగి యీారోజు అంటే ప్రతి గురు వారంనాడూ నన్ను చూడటానికి వస్తారుగదూ!

—అతను మాట్లాడటం లేదు... మొదట్నుంచీ కేవ లం చూస్తూనే వున్నాడు...

"మీాకు నామీాద కోపంవచ్చినట్టుంది. పోన్లెండి...నేనే వచ్చి మిమ్మల్ని కలుస్తాను."

ఇలా నాగమణి అంటూనే వుంది- చిలికిచిలికి కురిసే వర్షంలాగా.

అతను మౌనముద్రితా మనస్సుతో నడుస్తూనే వున్నాడు...

శేషుమహాల్ అనే తమ బస వచ్చింది—

విశ్వనాథంతో బాటు ఆమెకూడా గేటులోంచి వెళ్ళబోతుంది. యిరువురి కాళ్ళకూ- అల్లిబిల్లిగా నేలమీద అల్లుకున్న బఠానీ తీగెకాడలు అడ్డంవచ్చి వ్రేళ్ళల్లో చిక్కుకున్నాయి.

అతనితో బాటు ఆమెకూడా వంగి తీగెల్ని వ్రేళ్ళనుంచి వదిలించుకుంటూ—

"ఏమిటీ వెధవ తీగెలు చీకట్లో దారికడ్డంగా-జీవితంలో ప్రతి మానవుడికీ యీలోకంలో క్షణక్షణానికి ఆటంకపర్చే యీతి బాధల్లాగా- నలుగురు నడిచేదారిలో నల్లేరుకూడా పుట్టదంటారు... ఇక్కడెందుకు ఇంత అడివిలాగుందో అర్థంకావటంలేదు? మీలాంటి వాళ్లు నెలల తరబడిగా వుంటున్నా, దారి, కళ్ళుమూసుకు నడవటానికి అనువుగా లేదే? ఏమిటీ గ్రహచారం?"— ఆమె యిలా అంటూండగానే— ఆవరించిన కాటుక చీకటిని చెరిపివేస్తూ- మేడమీది గదిలోంచి గుడ్డిదీపం ఒకటి వెల్తుర్ని కురిపిస్తూ— పిట్టగోడదగ్గర కొచ్చింది. దాని వెల్తురి చారికలు రవ్వంత పడి నయ్యో- లేదో, విశ్వనాథం కళ్లు, మిరుమిట్లు గొల్పే కాంతిని క్షణంలో చూసినయి. ఆ తళుక్కుమన్న ప్రకాశంలో సింహద్వారంపైన- అర్చీలో- సాలెగూళ్ళతోనూ— దుమ్ముతోనూ ఆవరించి- భీతినిగొల్పే ఫణివిగ్రహాన్ని ఉలిక్కిపడుతూ చూసాడు.

వెంటనే నాగమణికోసం అతను వెనుతిరిగి చూసాడు,

ఆమె లేదు.

మారుతి మాత్రం పైనుంచి దీపం చూపుతూ— పైకి రమ్మనమని పిలుస్తున్నాడు.

"నాగమణి ఏది? ఎక్కడైనా దాక్కుందా?"— అతనిలో బాధ.

"తను నాగమణితో యిందాక రావటం— దీపం చూపడానికని వచ్చిన మారుతి చూడలేదుగదా?"

—విశ్వనాథం మెట్లెక్కి, తన గదిముందుకు చేరేంత వరకూ రకరకాలుగా అనుకుంటూనే వున్నాడు.
తీరా, మారుతితో బాటు గదిలోకి వెళ్ళి,— చాపమీద చతికిల బడటంతోనే, నాగమణి అతణ్ణి కలవర పర్చింది.—

"తనతో బాటు గుండెవిప్పి మాట్లాడుతూ వచ్చిన నాగమణి యెక్కడకు పోయి ఒంటరిగా దాక్కుంది యింత చీకట్లో?"

—అతనిలో ఆవేదన- అనుకంప కలిగినయి.

"మారుతి చూపిన లైటుకి తన కళ్ళు జిగేలు మన్నయ్యేమిటి? ఆ వెలుగులో యెదురుగా గుమ్మంపైన— ఆర్చిలో— ఫణివిగ్రహం తళుక్కు మంటూ మెరిసిందేమిటి?"

—విశ్వనాథం యిలా యోచిస్తూ సుడులు తిరిగిపోతున్నాడు... హృదయం బరువెక్కుతోంది. కళ్ళు చీకట్లోకిపోయి నాగమణికోసం వెతుకుతున్నయి. అతనిలో, మారుతి తీక్షణంగా అర్థం చేసుకోగల్గేంత మార్పు కనబడింది. ముఖమంతా నల్లగా మారటంతో, మారుతికి విశ్వనాథం పట్ల శ్రద్ధ తీసుకోవాలనిపించింది.

"ఏమిటలా వున్నావ్? ఎక్కడికి పోయావు? దేనికోసం అటూ- యిటూ చూస్తూ వెతుకుతున్నావు? ఎవరైనా నిన్ను భయపడేలాగూ చేశారా? ఏమిటిరా అసలువిషయం?"

—మారుతి యిలా అడిగిఅడిగి విశ్వనాథాన్ని విసిగించాడు. అయినా విశ్వనాథం నోరువిప్పలేదు. చూపుల్తోనే "ఏమీ లేదు" - అన్నట్టు జవాబిచ్చాడు... అయినా మారుతి నమ్మలేదు.

"ఉన్నట్టుండి- ఎన్నడూ చీకట్లో బయటికి పోనివాడివి, యింత అర్థరాత్రప్పుడు యెక్కడెక్కడ తిరిగివచ్చావు!"

మారుతి యిలా అడుగుతుంటే, తలవంచుకొని కూర్చున్నాడు విశ్వనాథం. నాగమణితప్ప అతనికళ్ళకీ- మనస్సుకీ మరెవ్వరూ కనబడటంలేదు. ఆమె మాటలుతప్ప మరెవ్వరి పలుకులూ అతని చెవులకు వినిపించటంలేదు.

"నువ్వు నా ప్రశ్నలకి జవాబివ్వదల్చలేదా?"

—మారుతి అడగవలసినవన్నీ విసుగులేకుండా అడిగి- అడిగి, కడకు యెంతకూ సమాధానం రాకపోయేసరికి, నిష్ఠూరంగా అన్నాడు...

విశ్వనాథం వంచినతలెత్తుతూ – మెల్లిగాచూశాడు మారుతివంక.

"నన్ను వృథాగా వెధవప్రశ్నలతో చంపకురా! కానేవు నన్ను నిశ్శబ్దంగా వుండనీయరా. పుణ్యముంటుంది. ఎప్పుడో ఒకప్పుడు నాబాధ నీకు విపులంగా చెబుతాగా! విసుగించకు..."

—ఇంతకంటే మరే యితరసమాధానమూ అతని చూపులో మారుతికి లభించలేదు. నిర్విణ్ణుడై వూరుకున్నాడు...

ఆ రాత్రంతా విశ్వనాథం యెలా ప్రవర్తిస్తాడోనని మారుతి నిద్రకు వెలియై— తెల్లవారేవరకూ వున్నాడు.

విశ్వనాథం యేమీ చేయలేదు, కూర్చొని—కూర్చొని ఆలోచించటంలోనే చీకటిని చిత్తుచేస్తూ పగలు పేరుతో వెలుగొచ్చింది.

విశ్వనాథం పునర్జన్మెత్తినట్లు భ్రమపడుతూ మామూలు మనిషిగా మారాడు...

"నాలో యేంజరిగిందో గుర్తు లేదు"

— తెల్లవారినతరువాత మారుతి వేసిన మొదటిప్రశ్నకు విశ్వనాథం అలా జవాబిచ్చి వూరుకున్నాడు...

అదే మొదలు.. ప్రతి గురువారంనాడూ విశ్వనాథం — రాత్రి పదిదాటగానే సర్వసామాన్య మానవలక్షణాలన్నీ కోల్పోయేవాడు.. మారుతికియీ రహస్యం తెలియదు-పాపం!!

ప్రతి గురువారంనాడూ- చీకటిపడగానే— పది దాటగానే- మారుతి— విశ్వనాథం యెదురెదురుగా చదువుకొంటూవున్నా— మారుతికి యేదో మైకంక్రమ్మినట్లుగా-నిద్ర తెరవచ్చి కళ్లను మూయించేది, అతనలావున్నపాళాన నేలమీదకొరిగి మత్తుగా గుర్రుపెట్టేసమయంలో, ఒక సన్నని వెన్నెల రేఖలాంటి కాంతిపుంజం విశ్వనాథంమీదపడి. క్రొత్త జీవమేదో నరనరాల్లోకి యెక్కించేది- గదిలోంచి బయటికి, మెట్లమీదుగా సరాసరి దిగివచ్చేందుకు పగటిపూటలాగా దారికనిపించేది స్పష్టంగా. మారుతినుంచి, విశ్వనాథాన్ని వేరు చేయటం తడవుగా- క్రిందనిలబడి పిలిచే నాగమణి కనిపించేది.

ఒక్క చీకటిరాత్రిళ్ళలోనే యిలా జరుగుతూ వుండేది....

వెన్నెల పనికివచ్చేదిగాదు. ఆ మేడలో వున్నంతకాల
మూమాత్రమే యిలా జరిగేది— జరిగింది...

ప్రతి గురువారం నాటిరాత్రీ విశ్వనాథం వింతప్రవర్తన
యేమిటో మారుతికి తెలీదు. కాని, పగలేమిటో,- ఎలా జరి
గేదో కళ్ళారాచూసి ఆశ్చర్యపడేవాడు. కాలేజీకి స్వస్తిచెప్పి
ఒక్కచో కూర్చునేవాడు... పలకరించినా యెవ్వరితోనూ
మాట్లాడేవాడు కాదు. ఏ పుస్తకమూ ముందేసుకుని చదివే
వాడు కాదు. వ్రాసేవాడు కాదు. తిండీ- నిద్రలు మానినవాడి
లాగా అలసటతో వుండేవాడు. ముఖమంతా డొక్కుపోయిన
ట్లుగా వుండేది... పీనుగులాగా అయ్యేవాడు. చూపులు చీకటి
పడేవరకు శూన్యాకాశంలోకి తొంగి చూస్తుండేవి. ఎవరికో
సమో పరితపించే హృదయంలాగా— ఏమిటో అతని మనస్సు
ప్రతి క్షణం వులిక్కిపడుతూ- జలదరిస్తూండేది. ఎవరో వచ్చి
తనని పిల్చినట్లు భ్రమపడి, లేచివెళ్ళి పిట్టగోడవద్ద నిలబడి,
అడివిలాగావున్న మేడముందు చెట్టు చేమల్లోకి ఆత్రుతగా
చూస్తుండిపోయేవాడు. తల దువ్వేవాడుగాదు.- బట్టలు
మార్చుకునేవాడు గాదు. నిత్యమూ సామాన్యంగా చేసే
యే పనినీ ఆచరణలో చూపెట్టేవాడు గాదు. ఆ రోజు అత
నిలో ఎవరికోసమో తపన- తపస్సూ తప్ప మరే యితర
ధ్యాసా వుండేది గాదు....—

ఇలా తోటి చెలికాడు— వింతగావుంటే, మారుతి
లాంటివాడు యేమిటీ చేయటం?... అక్కడికీ మొదట్లో యిలా
పిచ్చిగా వుండటంచూసి, చూసి, మారుతి నానా విధాలుగా
కేకలువేసి, యెన్నో నీతుల్ని చెప్పాడు- చూశాడు. ప్రయో

జనంలేక వదిలేశాడు.

ఇలా... ఆ మేడలో— వున్నంతకాలమూ— చీకటిలో గురువారం వచ్చినప్పుడల్లా విశ్వనాథం ఆ మేడదిగి బయటికి వచ్చేసేవాడు...

రెండో సంవత్సరంలో— చదువులు పూర్తి కావస్తున్న ట్యూనుకుటుండగా— సరిగ్గా పరీక్షల సమయంలో— ఆకాశంవు న్నట్టుండి కారు మేఘాలతో గర్జించింది.— ఒకనాడు... అది వేసవి కాలమైనా,— వర్షాకాలంలాగా వుందానాడు... మొద ట్లోకంటే, తరువాత విశ్వనాథం చాలాచిక్కిపోసాగాడు...

ఆనాడూ...... గురువారమే!...... పది దాటింది ......మారుతి నిద్రిస్తున్నాడు...

చీకటి పడటంతోనే వర్షం ఆరంభమైంది. చలితో యీదురుగాలి యెడా— పెడా కొడుతోంది ఉరుములూ— మెరుపులూ ఆకాశాన్ని గడ గడ లాడిస్తున్నయి...

విశ్వనాథం అలవాటు ప్రకారం మేడదిగి— యెకాయెకీ

నాగమణి ముందుకొచ్చి నిలబడ్డాడు...—.

అప్పటికే ఆమె బాగా నిలువెల్లా తడిసిపోయింది—.., మృదువైన ఆమె శరీరమంతా వీచె చలిగాలికి గజగజమంటూ వణుకుతోంది. జుట్టు తడిసి నీళ్లు కారుతోంది. చుట్టుకున్న కుబుసంలాంటి తెల్లని పల్చని చీర, ఒంటికి అంటుకుపోయి. యవ్వనాతి శయశోభనూ— దీప్తినీ ప్రస్ఫుటంగా కనబరు స్తోంది.

పద్దెనిమిది దాటి పందొమ్మిదేళ్లువచ్చిన నాగమణి అమృతంలో తడుస్తూ అపురూప సౌందర్యాన్ని తీర్చిదిద్దుతున్న

ట్టుగావుం దేగానీ, హఠాత్తుగా కురిసే వర్షంలో అనుకోకుండా తడిసినట్లు లేదు...

"వచ్చావురా"— అంటూ విశ్వనాథాన్ని ఆ వర్షంలో వెనుక నడిపించుకుంటూ, ప్రతి గురువారంనాటిరాత్రీ కలిసి కూర్చునే— ఆ పాడుబడిన నూతిన వెనుకగావున్న మందార పొదచాటుకి తీసుకుపోయింది. అక్కడో నాపరాతిఅరుగు బీటలు వారి వాటిమధ్యనుంచి మొక్కలు మొలిచివుంది. దాపల గొడుగుపట్టినట్లుగా బాదంచెట్టు. పెద్దపెద్దకొమ్మలతో — ఆకులతో విస్తరించుకొని వుంది. చుట్టూ బొప్పాసచెట్లతోనూ— ముళ్ళగోరింటపొదలతోనూ— భీపత్సంగా వుంది.

వర్షం జోరుగా కురుస్తూనే వుంది— యీదురుగాలి వీస్తూనేవుంది...

ఇరువురూ— ఆ పగిలిన అరుగుమీద— చిటపటమంటూరాలే చినుకులకు సంబరపడుతూ కూర్చున్నారు...

చలివేసినప్పుడల్లా— యిరువురూ దగ్గరదగ్గరగా జరిగి— ఒకళ్ళనొకళ్లు తాకికొని—ఆశ్లేషించుకొని— వేడిని పుట్టించుకొంటారు. అలాగే కొంతసేపు మాట్లాడుకోకుండా కాలంగడిపారు.

విశ్వనాథంకి విసుగెత్తి—

"నువ్విలా యింకెంతకాలం నన్ను విడిచిపెట్టకుండా వుంటావ్?" —అనడిగాడు...

నాగమణి నవ్వుతూ—

"నేనెవర్నో మీరు చెప్పేంతవరకూ విడిచిపెట్టకుండా వుంటాను."

"అయితే నువ్వెవరివో చెప్పకో!"

"ఎందుకూ? తీరా విన్నతరువాత వెళ్ళిపొమ్మంటాని కాని...?"

"కాదు..."

"మరి దేనికి?"

"సంతోషిస్తూ నిన్ను ఆరాధించటానికి..."

"నేనంటే మీ కంత మక్కువ యేర్పడిందా!"

"ఇన్నాళ్ళూ నన్ను రప్పించుకున్నా, నీకు తెలియకుండా నేవుందా!"

—ఆమె నవ్వి వూరుకుంది. అతను ఆమెను ఒళ్లోకిలాక్కుంటూ ప్రేమతో—...

"నాగూ! నువ్వెవరివో చెప్పకోవూ!"

—ఆమె పులకరించిపోయింది. నోటమాట పెగల్లేదు...

"ఇంతకాలనుంచీ నువ్వు నన్ను లాలిస్తూనే ప్రసంగించావు... నీకూ— నాకూ యేదో ఋణానుభంధం యేర్పడి వుందని చెబుతూ వచ్చావు. నన్ను నీలోకి యెన్నోపర్యాయాలు తీసుకొని తృప్తిచెందావు. కాని, నువ్వు మాత్రం యెవరివో చెప్పకోకుండానే దాస్తున్నావు... అవునా...

విశ్వనాథం అలా అడగటంతో నాగమణి గొంతువిప్పింది.

కురుస్తున్నవర్షం యేలనో తెరపిచ్చింది. గాలిజోరు తగ్గింది.

"నాగురించి నేను యధాతధంగా చెప్పకుంటే చులకన చేస్తారేమో!"

—ఆమెముఖంలో భీతి- దిగులూ- నిరాశా- తారాడినయి.

"చేయను. నేను నువ్వనుకునేంత విశ్వాసహీనుణ్ణి కాదు..."

—విశ్వనాథం ఆమెనుగురించి తెలుసుకునేదేదో సాకల్యంగా తెలుసుకోవాలని వెంపర్లాడసాగాడు. అతనిమనస్సు ఆమె మాటలకోసం స్వాతి చినుకుకి నోరువిప్పి నిరీక్షించే ఆలుచిప్పలాగా వుంది. వేదనప్రబలుతోంది-

"నువ్వు నామనస్సుకి స్వాధీనమైనట్లు యింతవరకెవరికీ కాలేదు—"

—నాగమణి యెంతకూ మాట్లాడకపోయేసరికి, విశ్వనాథం ఆమె దగ్గరగాజరిగి- ఒళ్ళోకి లాక్కుంటూ అన్నాడు...

"నాగురించి చెప్పాలనే వుంది— కాని, చెప్పుకోతగినంత విశేష మేమీ నాజీవితంలో యిమిడిలేదు. 'తనమనస్సులోని అభిరుచికి అనుగుణ్యంగా యేర్పడిన కోరిక తీరకపోతే, యెలా తీరేంతవరకూ ప్రయత్నాలు సాగుతూవుంటయ్యో, అలాంటిదే నేనూ అందరితోబాటు చేస్తూవున్నాను"—అంటూ ఆమె అరుగుమీదనుంచి లేచింది అతణ్ణివీడి—

"నా పూర్వాపరాలేమిటో నాకు స్మృతిపథంలో వివరాలతో తెలీవు- కారణం యేమిటంటే వాటినిగురించి నేనెన్నడూ యోచించలేదు... అయితే మునుపు నే నెవర్నో? -యెలా వుండేదాన్నో?- బాగా తెలుసు. చూడు..."-అంటూ నాగమణి- బద్దలుగాపగిలిన అరుగుమీదపరచిన రెండు నాపరాతిముక్కల్ని లేవనెత్తి- ప్రక్కకి నెట్టింది. ఉండీ

—వుడిగీ వురిమే ఆకాశంలో మెరుపు తళుక్కుమంది... ఆ రాతిక్రింద భద్రంగా దాచబడిన పసిడినగలు— కణికలు రాశిగా వున్నాయి. విశ్వనాథంకళ్లు జిగేలుమన్నాయి. ఆకాశం వురిమింది.

"నాగమణి గొప్ప ఐశ్వర్యవంతురా లన్నమాట."— విశ్వనాథం లోలోన ఓ వెయ్యిసార్లు కొనియాడాడు. స్వార్థం తలెత్తింది గుండెలో—

"నువ్వు నాకోసంగదూ! యింతసంపదను దాచిపెట్టింది..."

"అవును. మీకోసమే..."- విశ్వనాథం ఆమెకు అర్థమైనాడు...

మళ్ళీ విశ్వనాథం ఆమెను దగ్గరకుతీసికొంటూ—బుగ్గలు నిమురుతూ

"ఇంతవర కెన్నడూ యీవిధంగా నీవద్ద సంపద వుందని చెప్పలేదేం?"— అని అడిగాడు. నాగమణి మాట్లాడలేదు-..

తిరిగి వర్షం ప్రారంభమైంది, ఎత్తుగా పెరిగిన చెట్లు వూగుతున్నాయి. వర్షానికితడిసినకొమ్మలు బరువుగా వూగుతూ రాసుకుంటున్నాయి, ప్రహారీగోడమీదవాలిన పున్నాగచెట్టు ఒరుసుకొంటోంది. ఆకుసందుల్లోంచి నీటిచుక్కలు రాలి పడుతున్నాయి...నీటిమడుగులు అక్కడక్కడా యేర్పడినయి. ముళ్ళపొదలమధ్య అల్లుకున్న సాలిగూళ్ళపై రాలిన నీటిచుక్కలు ముత్యాల్లాగా నిల్చివున్నాయి—...

"మిమ్మల్ని ఒకటి అడుగుతాను చెబుతారా!"...

—నాగమణి యెందు కీప్రశ్న అడిగినట్లు? విశ్వనాథంకి

వ్యూహ పుట్టింది. 'చెబుతా నన్నట్లు'- ఆమెవంకచూస్తూ తలూపాడు....

ఇరువురూ తోపతోపగా వర్షంలోతడుస్తున్నారు. గుబుల్లు- గుబుల్లుగా పీకుతోంది-

"మీకు నేను కావాలా? నే దాచిన సంపద కావాలా?"

—నాగమణి యిలా అడిగేసరికి విశ్వనాథం సంపద వంక చూశాడు. అతనికి యెన్నో అవసరాలు తీరేమార్గం కనిపించింది. సర్వసుఖాలూ. అని ర్వచనీయమైన అర్థంతో కూడి వున్నట్లు తోచింది. అశాశ్వతమైన యీ జీవితంకంటే, యెన్నోరెట్లు గొప్పగావుండేభావాలు కల్గినయి. పరమనిర్భాగ్యుడికి- పుట్టు దరిద్రుడికి యెంత అల్పసంస్కారమయితే వుంటుందో- యెన్ని చవుకబారు కోర్కెలైతే వుంటయ్యో- అన్నీ విశ్వనాథంహృదయంలో ఏర్పడినయి...

నాగమణి అతణ్ణి ఆమూలాగ్రంగా పరిశీలించింది. అతని చూపు యింకా ఆ సంపదమీదే నిల్చివుంది కైవశంచేసుకునే ప్రయత్నంలో-

"ఇప్పుడు నా స్థితేమిటో చెబుతా వినండి..."

—అతను దృష్టిమార్చి'- ఆమెను చూశాడు... 'చెప్పమన్నట్లు'...

"మీకు ఇప్పుడు ఆ సంపద యెన్నిరకాల ఆలోచనలనైతే రేపిందో, అంతకంటే యెక్కువగా- యెన్నోకోట్ల రెట్లుగా- ఒకప్పుడు నాసౌందర్య సంపద- నా లావణ్యాభూషణాలు—యీ మేడలోవుండే రోజుల్లో- మీలాంటి ఒక యువకునికి రేపినయి......

అతను మీరేనని, యింతవరకూ అనుకుంటూనే వచ్చాను... అతనిపట్ల నాకు ఆనాటినుంచి— యీనాటివరకు వున్న మమకారాన్నీ— ప్రేమనీ— కోరికల్నీ మీకు వ్యక్తపరచాను....

నా సౌందర్యం ఒకసారి నాహృదయాన్ని రెచ్చగొట్టింది...

అభిసారికలాగా— అతనికోసం మేడదిగి— బయలుదేరి వెడుతున్నాను... యిలాగే అర్థరాత్రి చీకట్లో... యీ నగలతో.....

కోటికి పడగెత్తిన నాతండ్రి నన్ను వెంటాడుతున్నాడని గమనించలేకపోయాను... నడచి వెడుతూ....

మార్గమంతా చిక్కుసమస్యలతో యేర్పడివున్న విషయంలాగా వుంది—

తీరా నేను వెడితే— అతగాడు లేడు...నిరాశ కల్గింది...

నా సౌందర్యం తిరుగుబాటు చేసింది...

నాలో వేడెక్కిన కోర్కెలు చల్లబడినయి...

పులకరించే నా హృదయం స్తబ్దుగా— మొద్దుబారింది...

కళ్లు కామప్రేరేపణలో కందిపోయినా, తెల్లబడ్డాయి వెంటనే...

ఆత్మ యెక్కడో అతనికోసం వెదుకుతూ వుంది....

ఇంతలో— యెవరో నన్ను వెనక్కు పిల్చారు....

భయం వేసింది....

ఆ గొంతు మా నాన్నదని గుర్తించాను....

గుండె గుబిల్లుమంది.... చకచకా వెనక్కితిరిగి నడక

సాగించాను.

హృదయంలో అతని రూపం— మాటలు కల్లోల పరుస్తున్నాయి... ఒక సంఘర్షణ యేర్పడింది...

గబగబా అడుగు తీస్తున్నాను... వేస్తున్నాను...

దారి చికాకుగావుంది... తెములుచ్చ కోస్తున్నాను...

అప్పటికి ఎంత ప్రొద్దోయిందో తెలియదు....

నా వెనుక కఠికమైన అడుగులు త్వరత్వరగా— దగ్గరగా —వస్తున్నాయి...

"ఆగు నాగూ!"— నా వెనుకవున్న కంఠం గర్జించింది—

నేను ఆగలేదు— వడిగా— వడివడిగా— వచ్చేస్తూ నగలు తీసి యీ అరుగువైపుకి విసిరి పారేశాను. యిప్పటికీ నాకు బాగా గుర్తు. ఒక పెద్దనాగు నాకెదురుగా నిలబడి - బుస కొట్టింది...

రొప్పుతూ— దడతో— ఆయాసంతో— భయంతో వస్తున్న నేను మంత్రించినట్టు నిలబడ్డాను. నాగు నాలికల్ని సాస్తోంది...

"కోటికి పడగెత్తిన కోటీశ్వరుని బిడ్డవినువ్వు... ఇలా అర్ధరాత్రి పూట జారవృత్తికి పాల్పడతావా? నావల్ల నువ్వు పుట్టావు... నా పేరు నీకు పెట్టారు... నావంశం నీది. యిలా అసహ్యాంగా ప్రవర్తిస్తావా?... వయసొచ్చిందిగదా అని, వంశ మర్యాదల్నీ— నీతినియమాల్నీ— లెఖచేయకుండా అసభ్యంగా ప్రవర్తిస్తావా? వలపుల్లోపడి..."

ఇలా నన్ను చిత్రవధచేస్తూ— తనకున్న విషమంతా నాశరీరంలోకి యెక్కించింది. కూలిపోయి కుప్పలాగా పడివు

న్నాను... తరువాత మెలకువ వచ్చింది. కాని, ఏం లాభం? అతణ్ణిచూసేభాగ్యం లభించలేదు. అప్పట్నుంచీ నాఆత్మ అతని కోసం అన్వేషిస్తోంది..."

—నాగమణి యిలా చెపుతూండగానే, విశ్వనాథం లేచి, ఆమెచెర విడిపించుకోడానికి దూరంగా వెళ్ళాడు... కాని కోరిక సంపదమీదకు లాగుతోంది–

"ఎందుకలా దూరమవుతారు?"– ఆమె అడిగింది.

"యీసంపద యెరచూపుతూ– నాలో బలహీనత్వాన్ని కల్గించావు. ఇన్నాళ్ళూ నువ్వు నన్ను మోసంచేసావు..."

లేదు... లేదు ... లేదు"— అంటూ మేడలోకి వెళ్ళబోతున్న విశ్వనాథాన్ని నాగమణి ఆటంకపర్చినది.

"అవును, నువ్వే నన్ను వశీకరణ చేసుకున్నావు... నీకోర్కె తీరటంకోసం యిన్నాళ్ళూ ప్రయత్నంచేశావు..." కోపంగా అన్నాడు...

"నన్ను అపార్థంచేసుకొంటున్నారు..."

"లేదు... నన్ను విడిచి పొమ్మంటున్నాను..."

"అతనే మీరని తెలుసుకున్నాక యే ప్రేయసీ విడిచి వెళ్ళలేదు."

"ఛీ..." అతను చీదరించుకున్నాడు.. ఆమె సిగ్గుపడ లేదు... వెళ్ళలేదు... వెళ్ళబోయాడు. అమాంతంగా ముందు కొచ్చి కౌగలించుకుంది. అతను నెట్టివేశాడు. ఆమె సడలిపో లేదు. బాహువుల్తో అతణ్ణి బిగియారా నొక్కిపట్టింది. తనలోని వేడితనం అతనిశరీరంలోకి పోనిచ్చింది.– అతను ఆమెను విది లించుకుపోవాలనీ బిగ్గరగా అరుద్దామనీ– యెంతో ప్రయ

త్నించాడు... కుదరలేదు... ఆమె లాలిస్తూ అతనిగుండెల్లోకి దూరిపోవాలని చూస్తోంది. తనలోని యవ్వనమాదకత్వాన్ని అతనిరక్తంలోకి కలిసిపోయేటట్టుగా పెనుగులాడుతోంది. ఆమె ఆమెసన్నని చేతివ్రేళ్లు పామునాలికల్లాగా అతని మెడనీ—చెంపల్నీ—వీపునీ స్పృశిస్తున్నాయి. ఆమె శరీరం పాములా మెలికలుతిరుగుతూ, ఉక్కిరిబిక్కిరిచేసేట్లుగా చుట్టుకుంటోంది. ముఖం పడగవిప్పినట్లుగావిప్పి గుండెలమీదా— ముఖంమీదా పాముతోంది. నరాలు వేడెక్కేటట్లు చేసింది. శరీరమంతా నొప్పులతో సలపరింతలు కలిగినయి. ఆమె తనయిష్టంవచ్చినట్లుగా అతణ్ణి నలిపినా, తృప్తిమాత్రం కల్గలేదు. దాహం తీరలేదు....

అతను వీలుకోసం చూసి— చూసి, ఒక్కతోపు తోశాడు బలంకొద్దీ.

ఆకాశం ఉరిమింది. విద్యుల్లత మెరిసింది. వర్షంజోరైంది. గాలిరొద హెచ్చింది. బాదంచెట్టుకొమ్మలు ఫెడేలుమని విరిగినయి. ప్రహారీ గోడలు ఫెటేలుమంటూ బద్దాబద్దలైంది.

క్రిందబడిన నాగమణి ఆ భీభత్సవాతావరణంలో అతని కాళ్ళకు చుట్టేసుకొని, తల బాదుకుంది. ఆమె వేడికన్నీటిచారికలు వానలో చెరిగినయి. తలకట్టుతీగెలు అతనిపాదలలో చిక్కుబడినయి—

ఆమె బ్రతిమిలాడుకొంటున్నట్టూ— గావురమనియేడుస్తూ తనని మునుపటిలాగా వశపర్చుకొంటున్నట్టూ—విశ్వనాథం తలచాడు. మళ్ళీ వీలుచూసుకొని— ఆమెను విదిలించుకోవాలని కదలబోతూండగా— బురదలో రెండుకాళ్లూ జర్రునజార్, ధభేలుమని— విరగతీసుకొని బోర్లగిల పడ్డాడు...

ఒక్కసారిగా భూనభోంతరాలాలూ దద్దరిల్లేటట్టు పురుమూ —ఫెళఫెళ మంటూ మెరుపూ— ఒక పెద్ద పిడుగూపడింది...

నాగమణి— ఆ భయానక వాతావరణంలో — ఒక్క క్షణపు కాంతిలో యెటుపోయిందో తెలీదు?...—

వాతావరణం తెరపిన బడేసరికి తెల్లవారింది...

విశ్వనాథం, మేడముందు— బురదలో— తోపతోపగా— రొచ్చురొచ్చుగా తడిసి ముద్దలాగా పడివుండటం— అప్పుడే నిద్రలేచి గదివీడి బయటికొచ్చిన మారుతికి— గుండెలదిరేట ట్లుగా కనిపించాడు...

గబగబా— కొండమీదినుంచి దూకే సెలయేరులాగా —మారుతి మెట్లు దిగివచ్చి, విశ్వనాథాన్ని లేపుకొని, బుజాల మీద మోసుకొని— గదిలోకి ప్రవేశించాడు—

ఆరోజున విశ్వనాథానికి ఒళ్లు తెలిసేసరికి— ప్రొద్దుతిరి గింది. అంతే...అదే మొదలూ... చివరాకూడా...!! పాడు బడేందుకు ఆ మేడకి వినాశకాలం దాపురించింది. దారుణంగా దురదృష్టం పట్టుకుంది. నాగమణి కోరికలోని ఆవేదన— —బాధ— కార్చిచ్చులాగా మండుతోంది. తీరనివాంఛలు నిరంతరం— ఆప్రాంగణంలో విహరిస్తూవుండేవి. ఆమె బాధా మగ్నమానసం అవిరళంగా— జీవించి తిరుగాడుతూవుంది.

ఆనాడే ఆమె ఆత్మకు క్రీనీడ వచ్చిపడింది.— అందుకే ఆమె ఆత్మ అసంతృప్తిలో ప్రేల్చ బడుతూవుంది—.

## 3

విశ్వనాథం మగత వీడినవాడిలాగా కళ్లుతెరచి

చూశాడు... చంద్రుడు పడమటికి వాలివున్నాడు. బాగా ప్రొద్దుతిరిగింది. మంచుకణాలకు అతని బట్టలన్నీ చల్లబడినయి. శరీరమంతా గజగజా వణుకుతోంది. ఆరుబయట-డాబాపై -అంతవరకూవుండి, లేచి వెళ్ళి వెంటనే గదిలో కుర్చీలో కూలబడ్డాడు, ఒళ్ళంతా నొప్పులతో సలపరింతగావుంది. కళ్ళు మంటుతున్నయి, తల చెరిగింది, గుబులు- గుబులుగా వీస్తోంది చిలిపిగాలి.

"ఆ నాగమణి- యీ నాగరత్నం కాదుగదా!"-కిటికీలోంచి నక్షత్రాల్ని చూస్తున్నవాడల్లా, పిట్టగోడపై చూశాడు తలత్రిప్పి...

"అవు నన్నట్టు"— ఆ తెల్లని పాముకుబుసంలాంటి పీలిక వూగుతోంది. అతను అలా చూస్తుండగానే గోడమీద నుంచి జారింది—

విశ్వనాథం త్రుళ్ళిపడ్డాడు—

"ఎప్పుడు తెల్లవారుతుందా"- అని మీన మేషాలు లెఖ్ఖపెడుతూ ఆరాత్రికి జాగరణ చేస్తున్నాడు...

ఎలాగో భళ్లున తెల్లవారింది...

"తనలోపదిసంవత్సరాలక్రిందటి వాతావరణం చెలరేగినవైనం" చెబుదామని మారుతికోసం యెదురుచూస్తూ కూర్చున్నాడు...

"నాగమణి యెవరో? నాగరత్నం యెవరో?"—వివరంగా చెబుదామని వువ్విళ్ళూరసాగాడు... అక్కడికీ రెండు కబుర్లు చేసాడు...

ఎలాగో తెముల్చుకుని, మారుతి క్రొత్తపెళ్ళికొడుకు

వేషంలో— ఆరోజు మధ్యాహ్నం— విశ్వానాథంబసకి వచ్చాడు...

అతను వచ్చీరావటంతో, తనగుండెవిప్పి నాగమణినిగురించీ, ఆమె చేసిన కృత్యాల్నిగురించి— జరిగిందంతా చెప్పాడు...

మారుతి నమ్మలేదు... ఓట్రెంచికొట్టాడు పైగా—

"అలాకాదురా! వెళ్ళిచూడు..." అంటూ నాగమణి చూపిన నగల వివరాలన్నీ వర్ణించిచెప్పాడు విశ్వానాథం.

మారుతి యోచిస్తూ— "ఆ నగల్నే ధరిస్తే నాగమణి నాగరత్నంగా వచ్చిందంటావ్? అంతేనా?" ఎదురుప్రశ్న వేశాడు...

"నాగరత్నం యెవరోకాదు, నాగమణి!"— విశ్వానాథం ధృడంగా అన్నాడు...

"అయితే నాభార్యగా యెందుకు ప్రవర్తించింది?"

"నీ అండచూసుకుని— నీ నీడలో తలదాచుకుంటూ— నీకు ద్రోహంతలపెట్టేస్తూ— నా ప్రాణాల్ని తోడుదామని ప్రవర్తించింది అంతే!"

"అంతేనంటావా?"

ఏదీ తేలిగ్గానమ్మని, అతిధైర్యసుడు మారుతి పుటెక్కినన మ్మేశాడు.

"కావాలంటే యిప్పుడు వెళ్ళి చూడు... కట్టుకున్న చీరెదగ్గర్నుంచీ, నాగమణిచూపిన నగలవరకూ, నాగరత్నం వంటిమీద వుండితీరతయి..." ఇలా విశ్వానాథం ఘంటాపధంగా, దివ్యదృష్టితో చూసినట్లు చెబుతుంటే మారుతికి నిజ

మేనేమో ననిపించింది–

"చూసివస్తానాగూ!"– రివ్వున మారుతి, విశ్వనాథాన్ని వదలి వెళ్ళిపోయాడు సరాసరి భార్యవున్నచోటికి–

హఠాత్తుగావచ్చిన క్రొత్తభర్తని చూసేసరికి నాగరత్నం సిగ్గుతో ముడుచుకుపోయింది.

ఆమెకట్టుకున్న పాముకుబుసంలాంటి తెల్లని వాయిల్ చీరె గాలికి రెపరెపలాడుతోంది. ఆ చీరెఅంచులమీదవున్న తీగెలు మెలికలు– మెలికలుగా తిరుగుతున్నట్టున్నాయి. మెళ్ళో నెక్లెసు శంకరాభరణంలాగా మెరుస్తోంది. జడలో నాగరంకీ– సింహద్వారం పై ఆర్చిలోవున్న ఫణివిగ్రహానికీ పోలికలుచాలా వున్నట్టు తోచినయి. అబ్బా నలా చూస్తుంటే సర్పలక్షణాలే మారుతకి కనిపించినయి... విశ్వనాథం మాటలు అసత్యమనటా నికి ఆధారం లభించలేదు. చూసినంతసేపూ తీవ్రంగా చూసి. కళాకాంతుల్లేని ముఖంతో విశ్వనాథం వద్దకువచ్చి– బాధగా చెప్పాడు..

"ఇప్పు డేమిటీ చేయటం?"

–ఇరువురూ వుత్కృష్టావస్థలోపడి ఆలోచించ సాగారు.. ఎప్పుడు చీకటి పడిందో? వాళ్ళెవ్వరికీ తెలిదు..

"ఇందాక పెళ్ళికొడుకువచ్చి, పెళ్ళికూతుర్ని యేమిటో వింతగా చూసిపోయాడు...." అని– మారుతినిగురించి గల భాగా చెప్పుకొంటున్నారు... వెళ్ళాక తను– పందిట్లోనూ– ఇంట్లోనూ– దొడ్లోనూ– పెళ్ళివారు....

మారుతితో బాటు విశ్వనాథం కూడావిన్నాడు...

"ఏమిటీ చేయటం?"–మారుతి అడిగాడు...

"నేను అదే ఆలోచిస్తున్నాను"— విశ్వనాథం జవాబిచ్చాడు...

"ఎట్లా యివ్వాళరాత్రి ఆమెతో కాలక్షేపం చెయ్యటం?"

—మారుతి లోలోన సుడులుతిరిగి పోతున్నాడు...

"తన మూలంగా యెంత విపత్తు వచ్చింది?"

—విశ్వనాథం మారుతికి కల్గించిన బాధని గురించి పశ్చాత్తపం పడుతున్నాడు....

చీకటి రాలుతోంది... వెన్నెల రాలేదు....

మారుతికీ కబురు వచ్చింది. . పెళ్ళింట్లోంచి...

విశ్వనాథంని వదిలి వెళ్ళిపోయాడు భయభయంగా...

మారుతిమనస్సులో యేభ్రమవుందో, అదే విశ్వనాథం లోనూవుంది—

కాస్త ప్రొద్దోవటం తరువాయిగా— అమ్మలక్కలు పంపగా— మారుతి, తన గదిలో నాగరత్నాన్ని చూశాడు—జిగేలుమంటూ...

అదే సమయంలో విశ్వనాథం చీకటి గదిలోకి, నాగమణి వెలుగును తెస్తూ వచ్చింది. చూసి వులిక్కిపడి లేచి.—

మారుతి, తన భార్యని పేరుపెట్టి పిలిచినట్లే, విశ్వనాథం నాగమణిని పిల్చాడు...

ఒకేకాలం వాళ్లిద్దరి గదుల్లో గడుస్తోంది...

ఒకే వాతావరణం వాళ్ళిద్దరి హృదయాల్ని కలచివేస్తోంది...

"నన్నుచూసి యిందాకణ్ణుంచీ యెందుకలా వున్నారూ:"

—నాగరత్నం మారుతికి దగ్గరగావస్తూ చిరునవ్వుతో

అడిగింది. అతను మంచందిగి— ఆమెకు దూరంగా వెళ్లాడు... మూగగా... అలాగే—!

"నేను మీకోసమేగా బ్రతికివున్నాను. యెందుకిలా వ్యాకులపాటు చెందుతారూ!"

—నాగమణి, విశ్వనాథాన్ని తాకుతూండేసరికి, తప్పించుకొని కిటికీ చెంతకు చేరాడు... బిక్కుబిక్కుమంటూ...

నువ్వు మా విశ్వనాథాన్ని ప్రేమించిన నాగమణివి కాదూ!"

—మారుతి యిలా అడిగేసరికి, ఆమె ముఖం చిన్నబోయింది....

"నువ్వు... నువ్వు... దయ్యానివి... పగవి... అన్యాయంతో మా మారుతికి భార్యగా వచ్చావు. నువ్వు నాగరత్నానివా? అతనికి ద్రోహం చెయ్యటం పాపంకాదూ! హింస కాదూ! నువ్వెవరివో నాకు తెలుసు... నాగరత్నమనే పేరుతో, అతణ్ణి ఆశ్రయంకోరావు... భార్యవైనావు... నాపొందు కోరటంకోసం నువ్వింత పన్నాగంపన్ని యిలా దాపురిస్తావనుకోలేదు... ఛీ..."

—విశ్వనాథం యిలా గొంతు చించుకుంటూ అంటుంటే, నాగమణి పిచ్చెత్తిన దానిలా పగలబడి నవ్వసాగింది—.

"నేను మీరనుకుంటున్న నాగమణిని కాదు. నాగరత్నాన్ని..."

—మారుతి, భార్య యెంత సత్యం చెప్పినా నమ్మలేదు... విశ్వసించ లేదు... పరాఙ్ముఖుడై వెళ్ళి పడుకున్నాడు...

ఆమె కళ్లు చెమ్మగిల్లినయి. గుండె ద్రవించింది అనుమానంతోనూ— అవమానభారంతోనూ. వెళ్లి మెల్లిగా భర్త కాళ్లగట్ట తలవాల్చి పడుంది— దీనంగా—

విశ్వనాథం యెంత చీదరించుకున్నా. నాగమణి సిగ్గపడలేదు. అతనెంత కఠినంగా మాట్లాడినా ఆమె నొచ్చుకోలేదు. — కేవలం నవ్వుతూనే అతణ్ణి చేరింది– నీడ మనిషి వెంట చేరి వున్నట్లు.

అతను యెన్నోవిధాలుగా ఆమె బారినుండి తప్పుకోవాలని ప్రయత్నించి, విఫలుడైనాడు. ఆమే గెల్చింది—.

అతనికి తెలియనిస్థితి యేదో ఆమె— ఆ గదిచీకట్లో– అల్లింది— సాలెగూడుని. యీగని పట్టటానికి సాలెపురుగు అల్లినట్లు.

క్రోధంతో– కోపంతో మండుతున్న విశ్వనాథం చటుక్కున ఆ రోజున కాలుజారిపడినట్లు, ఆమె అల్లిన ఒక యింద్రజాలంలో పడ్డాడు... సాలెగూట్లో యీగపడినట్లు—

ఆమె అతనినుంచి అమృతం పొందుతుంటే.— అతనికి, ఆమెవల్ల శరీరంలో మంటలు మండుతున్నయి...

అదే సమయంలో–

భయానికి బానిసయైన మారుతి నాగరత్నాన్ని దగ్గరకు లాగుకొని, తృప్తిపడ్డాడు— ఒక రాత్రివేళ తెలీకుండా–వాళ్లిద్దరికీ అమృతమే లభించినట్లు సంతోషపడ్డారు...

తీరా తెల్లవారిన తరువాత— గబ గబా— ఆదుర్దాతో— విశ్వనాథాన్ని చూడటానికి వెళ్లాడు మారుతి– డాబాపైకి.

తలుపులు వేసివున్నాయి—

తట్టాడు—

దగ్గరగావున్న తలుపులు తెరుచుకొన్నాయి... మెల్లిగా-

మారుతిలోనికి వెడుతూనే- విశ్వనాధాన్ని చూశాడు నల్లగా- విషమెక్కిన వాడిలాగా- మతిలేకుండా- భీతిగొల్పే టట్లు- మంచానికి అంటుకుని పడున్నాడు— అతని ఒంటి బట్టలన్నీ చింపివేయబడి వున్నాయి.,. ముఖంమీాద కొరికిన గంట్లూ- గిచ్చిన గంట్లూ పడివున్నాయి—

మారుతి కెవ్వున కేక వేశాడు—

ఎవ్వరూ పైకి రాలేదు—

క్రిందకు వెళ్లి వాళ్లనీ— వీళ్లనీ పిల్చాడు—

కళ్లు తెరపించి కలికాలు వేయించాడు. నోరు పగలీసి మందులు పోయించాడు. అంతా యెవరిదారిన వాళ్లు వెళ్లారు...

ప్రయోజనం లేకపోయింది. ప్రొద్దు బారెడెక్కినా- తిరిగినా- మారుతి కళ్ళల్లో అశ్రువులు నిల్చినయి-

"తనెరిగివున్న విశ్వనాధం" పుంఖానుపుంఖంగా గుర్తు కొచ్చేసరికి. గుండెలు పగిలేటట్లు ఏడ్చాడు—

"నేను బాధా సర్పదష్టుణ్ణి!"

"విశ్వనాధం సర్పదష్టుడు—"

కాదు—

"సర్పదష్టుడై- ప్రాణాలు విడిచాడు—"

మారుతి లోలోన అనుకుని శూన్యంలోకి చూశాడు- ఆకాశంనుంచి చీకటి రాలుతోంది-

నక్షత్రాలు సానుభూతిగా- జాలిగా- వెలుగుతున్నాయి

—కాలవగట్టుమీద పాములవాళ్లు— చిత్తుకాగితాల్లాగా యెటో —గాలికి తరలిపోయినట్టు— జీవనోపాధికోసం గుడిసెలు పీక్కొని లేచిపోయారు,

అందుకే కాబోలు సొరబూరలనుండి నాగస్వరం విని పించటం లేదు—

పెళ్లికి బాడుగకువచ్చిన సన్నాయిముఠా మేళం మారు తికి తెలీకుండానే చక్కా పోయారు.

కాబట్టే శంకరాభరణరాగం మేజువాణీలో వాయించి నట్లు మళ్లీయెక్కడా వినిపించటం లేదు—

విశ్వనాథాన్ని గంపెడుదుఃఖంతో ఆవూరికి వుత్తరంగా తీసుకుపోయి వదలివచ్చేసరికి చెరిసగంరాత్రి దాటింది— మారుతి గడియారంలో—

'శుభమా!' అంటూ తనపెళ్లికొచ్చి మృత్యువాతపడి నందుకు విశ్వనాథాన్ని తల్చుకుని మారుతి చంటిపిల్లవాడిలాగా బెంగగా కన్నీళ్లుకార్చాడు—

ఆరాత్రి ఒక్క మారుతికేగాదు శకుంతలకేగాదు, పెళ్లి కొచ్చి వెడదామనుకుంటూనే దిగబడిన భంధువులకూ్కడా విశ్వనాథం వింతచావు అలజడిని కల్గించింది.

ముఖ్యంగా మారుతికి హృదయమంతా పిసికేసినట్టుంది అతనికి— కళ్లముందు శకుంతల ఆశించినసుఖాన్నీ— తనదేనను కుంటూ గుప్పెట్లోనూ— గుండెలోనూ దాచుకున్న మంచి అదృష్టాన్ని— వదలుకొని— జారవిడుచుకుని— పోగొట్టుకొని— దిక్కులేనిదానిలాగా యేడుస్తూండటం మనస్సుని రంపపుకోత పెట్టింది—

శకుంతల తన వ్యక్తిగతజీవింతంగురించీ- అభిరుచుల్ని గూర్చీ- విశ్వనాథాన్నిచూసి- 'బావగారూ!', అని అన్నప్పు డెల్లా యెన్నెన్నోసార్లు తన్మయత్వంచెందుతూ- తలపోస్తూ- కాలక్షేపంచేసిందో ఆమెకే తెలుసు. తప్పితే ఆమె ప్రణయ పూరితమైన మనస్సుకే తెలుసు. ఇంకా బాగా ఆమె కోరికలకి తెలుసు- ప్రకృతికి తెలుసు—

అంతే...

తరువాత—

మారుతికి తెలుసు... విశ్వనాథానికీ- తన చెల్లెలికీ పెళ్ళయిన వెంటనే. వచ్చినకట్నంతో- బ్రహ్మాండంగా— యావత్తు భంధుకోటినీ- మిత్రుల్నీ పిల్చి, పెళ్ళి సంతోషంగా చేసేద్దామనుకున్నాడు మారుతి, ఏది ఆ అదృష్టం? ఏది ఆ శుభ సమయం? ఎలా పోయింది? ఎక్కడికి దూరంగా జరిగిపోయిందో? యెవ్వరికీ తెలీదు. కాలమనే గరుడపక్షి గోళ్ళతో. దురదృష్ట మనేపేరుతో— తనచెల్లెలినొసటిపై— విధి నిర్దాక్షిణ్యంగా పగతో- కఠోరమనస్కుడై- యిలా వ్రాసిపారేస్తాడని— మారుతి కేం తెలుసు?

శకుంతలంటే విశ్వనాథం "తనకోసం దివినుండి భువికి దిగివచ్చిన దేవతామూర్తియని, వైజయంతియని"- తల్చుకుని సంబరపడేవాడు... అంత కంటే కొన్నిరెట్లుగా శకుంతల మురిసిపోయేది అతనికంటేయెక్కువగానే వూహిస్తో...

"ఇంకా నీపెళ్ళి యెప్పటికవుతుందిరా? త్వరగా చేసుకో రాదూ!"

—ఇలా శకుంతల, మారుతి విశ్వనాథంగురించి ప్రస్తా

వనరూపంలో ప్రసంగించినప్పుడల్లా— తనహృదయంలోని తీర నికోరికనూ — అభిరుచినీ— యిష్టాన్నీ— లౌక్యంగా అలా వ్యక్తపరుస్తూండేది— ఇంత నిగూఢభావం ఆమెహృదయంలో వున్నదనీ— అది నిరంతరం సుడిగుండం లాగా తిరుగుతూ— మని షిని వుత్తేజపరుస్తోందనీ— కవళికల్ని గుర్తిస్తూ మారుతి లోలోన—

"తప్పకుండా నీకు విశ్వనాథంతో పెళ్ళి చేస్తానమ్మా!"— అని అనుకుని తృప్తి చెందేవాడు. అయినా యెన్నో ఆలోచ నలు అతణ్ణి శకుంతలపెళ్ళి నిగురించి మెలికలుతిప్పేవి.... ఏపనినీ చేయనిచ్చేవిగావు... ఏమీ తోచనిచ్చేవిగావు...

సరిగ్గా— ఆ రాత్రికూడా — చెరిసగం ప్రొద్దుపోయినా— చీకటి విడిపోయి చంద్రుడొచ్చినా— విశ్వనాథంగురించీ— శకుంతలహతభాగ్యపు జీవితాన్నిగూర్చి—తీవ్రంగాయోచిస్తూ పడుకొని వున్నాడు— మారుతి—. భర్తమనస్సులో చెలరేగిన భావసంచలనం అర్థంగాక, క్రొత్తభార్య నాగరత్నం, ముళ్ళ కంచెమీదనుంచి లాగుతున్న గళ్ళచీరెలాగా, ఒకప్రక్కగా పడుకుని వుంది—

"తనకళ్ళముందు ఎవరా మనిషి? శకుంతలా?"

—మారుతి కళ్లనులుముకొని చూశాడు. శకుంతల విశ్వనాథంకోసం మేడమీద— ఆరుబయల్లో కూర్చొని— చీకటికన్నులతో యేడుస్తున్నట్టుగా కనిపించింది—

"దేని కింకా యేడవటం చెల్లీ! వూరుకోవూ!"

—ఇంతకంటే, తన చెల్లెలి దీనావస్థనుచూసి, యేమి అనునయ వాక్యాలు పలకాలో అర్థంగాలేదు మారుతికి. బిగ్గ

రగా ఏడుస్తోంది. చటుక్కున మంచందిగి, టార్చిలైట్ తీసు కొని, మేడపైకి వెళ్ళాడు... అక్కడ ఒకప్పుడు గలీజుగా వుండేది... అంటే పదిసంవత్సరాలక్రిందట... అక్కడే యిప్పుడు పెళ్ళికొచ్చినవారు కూర్చొనిపోవటానికి వేసిన యితాకు చాప లున్నాయి. చీట్లపేక ఆడినప్పుడు కాల్చిపారేసిన రకరకాల సిగరెట్ పీకలూ— పిల్లలు ఆకతాయితనంగా చించి పారవేసిన సిగరెట్ పెట్టెలతాలూకు తగరపుముక్కలు— డొప్పలు— అంతఛండాలంగా వున్నయి... సుష్టుగా భోంచేసివచ్చి, కిల్లీలునమిలి వుమ్మేసిన తమలపాకుల యెర్రని వుమ్మిచారలు సున్నంవేసిన పిట్టగోడమీాదా— చప్టామీాదా— స్పష్టంగా— వెన్నెల్లో కనిపిస్తున్నయి—.

శకుంతలమాత్రం లేదు. ఆమెకంఠంనుండి గుబులుగుబులుగా దుఃఖం పొంగిపొర్లి వస్తున్నట్లు వినవస్తోంది—

మారుతి వెంటనే వెనుతిరిగి ఆమెవుండేగదిలోకి వెళ్లాడు... చూశాడు...

శకుంతల అక్కడా లేదు. ఏడుపు స్పష్టంగా వినిపిస్తోంది...

"చెల్లాయి ఏమైంది?"

—మారుతిగుండె దడదడా కొట్టుకుంది—

"ఏమైనా అఘాయిత్యం చెయ్యలేదుగదా!"

—అతనిలో ధైర్యం పలుచనైంది—

జరజరా మేడదిగి క్రిందికివచ్చి చూశాడు...

చెట్లసందుల్లోంచి వెన్నెల మచ్చల్లాగా నేలమీాదపడి—కుష్టురోగిశరీరాన్ని గుర్తుకుతెస్తూవుంది.

నూతిముందు— ఆ వెన్నెలమచ్చలమధ్య— విచలితహృదయంతో— వియుక్తాలోచనతో — విసుప్పిక్తగళంతో—విశ్వనాథాన్ని కరుళ్లుకరుళ్లుగా వచ్చే యేడుపులో తలపుల నెమరుల్లోకి తెచ్చుకుంటూ— కృశాంగిలాగా నిలబడివుంది.

"ఏమిటీ పిచ్చిపని చెల్లాయి..." అంటూ మెల్లిగా దగ్గరకువెళ్ళి ఓదారుస్తూ నిలపడ్డాడు మారుతి...

"నాకు తెలీకుండా నే నిక్కడికి వచ్చాను. ఏమిటో శబ్దం— బంగారుసంకెళ్లు మ్రోగినట్లు నాకు వినిపిస్తోంది. దాదాపు గంటనుంచీ వింటున్నాను. ఎక్కణ్ణుంచో వస్తోంది? అర్థంకావటం లేదు."

—శకుంతల అలా అనేసరికి, మారుతి చెవులప్పగించి వినసాగాడు... నిజంగా ఆమెచెప్పినట్లే— నూతికవతలనుంచీ— ముళ్ళగన్నేరుపొదల మాటునుంచీ— పారిజాతంచెట్టు మొదట్నుంచీ— బాదంచెట్టు నీడలోంచీ— స్పష్టంగా బంగారుసంకెళ్లు మ్రోగినట్లూ— చిక్కుపడితే సరిచేస్తున్నట్లూ వినపడసాగింది —మారుతికి—

చనిపోయేముందు విశ్వనాథంచెప్పినవిషయం తళుక్కున మెరిసినట్లు మారుతికి గుర్తొచ్చింది—

గబగబావెళ్ళి— తనగదిలో దేనినో వెతకసాగాడు. అది యెంతకూ కనిపించలేదు. కానీ. బాగా నిద్రపోతున్న తన భార్య నాగరత్నం— తీగెమీద పువ్వులాగా తీర్చిదిద్దినట్లుగా వుండటంమాత్రం కనిపించింది.

"ఎక్కడా మంచి బలంగలకర్ర దొరకదేం?"

—మనస్సులో మారుతి యెంతత్వరితంగానైతే—

యీమాటని స్మరించుతున్నాడో. అంత ఆలస్యం, కర్రదారికెందుకు పడతోంది—

మేడపైనంతా వెదికాడు. లాభంలేకపోయింది—

దిగివచ్చాడు...

క్రింద వెతికాడు... ఊహూ... దొరకలేదు—

"ఏమిటీ చేయటం?"- చేతులునలుపుకొన్నాడు... కొంచెం కన్బొమలు వంగినయి రక్తం వేడెక్కుతోంది. ఆదుర్దా వుధృతమవుతోంది...

అక్కడికీ వెన్నెలగావున్నా- కళ్ళకివస్తువులన్నీ కనిపిస్తున్నా- కర్రమాత్రం కావల్సిందికాబట్టి దొరకటం లేదు...

అటూ- యీటూ వినబడేమ్రోతని వింటూ- వెతికాడు.

"దొరికింది... బలంగల కోలుపుకర్ర... ఆరడుగులుంది... వెన్నెల్లో తెల్లగా వుంది."- ఉత్సాహం వచ్చింది. చిరాకు విడిలింది-

"అందింది చేతికి- అదృష్టంవల్ల..." అని లోలోపలనుకొని, సరాసరి శకుంతలవద్ద కెళ్ళాడు...

ఆమె భయంతో- "అటు యిప్పు డెందుకులేరా!"- అంది.

"నీకు తెలియదులే చెల్లాయి... యిప్పుడే వెళ్ళాలి.... ఆమ్రోత బంగారునగలమ్రోత..."- అతను ఆమెకు వున్న సంగతిని చెబుతూ—నూతి- కవతలకి- టార్చిలైటు వేసుకొని వెళ్ళసాగాడు...—

ఆమె ఆశ్చర్యపడింది... నోట మాటరాలేదు...

చూస్తోంది మారుతి వెళ్లే దిక్కువైపు...

అతను నెమ్మదిగా— పగిలిన అరుగుదగ్గరకు వెళ్ళాడు.... కర్రతో బంగారునగల మ్రోత యింకా బాగా వినవస్తోంది—

చూశాడు కాసేపు!... ఎడమచేతిలో టార్చీని కదలకుండా గట్టిగా నొక్కిపట్టి— అరుగుమీదికి పడేటట్లు చేశాడు...

అయిదు నిముషాలాగి, అతిధైర్యంతో— కుడిచేతిలోని కర్రతో— అరుగుమీద పర్చివున్న రెండు నాపరాతిముక్కల్ని ప్రక్కకి బలంగా మెత్తిచూశాడు... చిన్న గుంటవుంది— టార్చిలైటు వెలుగు తిన్నగా— సూర్యకిరణంగా ప్రకాశిస్తోంది— ఆ గుంటమీద—

కర్ర మొనతో — ఆ చిన్నిగుంటలో పొడిచాడు కచ్చాపచ్చాగా...

అంతే!... నగలున్నట్టు లేదు...... మ్రోత ఆగిపోయింది... కాని, పడగ విప్పుకొని. ఒక నల్లని కోడెత్రాచు, బుసకొడుతూ— 'రైయ్‌' మంటూ పైకి వచ్చింది— నాలికలు చాపుతూ—

కాంతివంతమైన టార్చిలైటు వెలుగులో— దానికళ్ళు మిలమిల లాడుతున్నయి. అప్పుడే కూసం విడిచిందేమో! శరీరమంతా తళతళ మంటోంది—

చూశాడు — చూశాడు... మారుతి క్షణంసేపు చూశాడు...

పడగవిప్పి యింకా— బుసకొడుతూ— ఆడుతూనేవుంది.

విశ్వనాథం ప్రాణాలు తోడిన నాగమణి గుర్తొచ్చింది— మారుతికి—

తన చెల్లెలుపట్ల నాగమణిచేసిన ద్రోహం మేల్కొంది—

అంతే!! కోలుపుకర్ర యెత్తాడు... రెక్కలో బలమంతా చూపాడు...

ఒక్కటే దెబ్బ!!— ఫెటేలుమంది...

ఆర్చిలో 'ఫణివిగ్రహం' తల నేలకూలింది—

పడగ రెండుగా బ్రద్దలైంది— చిట్లి.

తోకలోకొచ్చిన ప్రాణంమీద, చిత్తుచిత్తుగా పొడిచాడు. ఆపొడుపుల్లో రెండుకళ్ళూ మట్టి కొట్టుకున్నయి...

ఇదంతా చూస్తూన్న శకుంతలకు చెమటలు పట్టినయి.

తనలో నాగమణి పట్లవున్న— ద్వేషమంతా—కసినంతా—చాలాసేపు ఆ కర్రతో పొడుస్తూ తీర్చుకున్నాడు... మారుతి—తిరిగి తన గదికి చేరేదాకా—!!

ఆ రాత్రంతా మారుతీ— శకుంతలా మేల్కొనేవున్నారు.

తెల్లవారింది—

"ఫణివిగ్రహం తలపగిలి వసారాలో పడివుండటం"—చూసి, పాచిపనిచేసే మనిషి దగ్గర్నుంచి— పంచాయితీ బోర్డు ప్రెసిడెంటువరకూ— ఆవూళ్ళో వాళ్ళంతా వచ్చిచూశారు ఆశ్చర్యపడుతూ—

"ఈ మేడకి పాడుపీడ వదలిపోయింది."— అని, చూడటానికొచ్చిన ప్రతి ఒక్కరూ వెళ్ళిపోతూ అన్నారు...

బాగా తెల్లారినతరువాత ఆ చచ్చిన నాగమణిని యీవలకులాగించి దూరంగాతీసుకుపోయేలాగుచేసి, ఒక రాగి కానీతో అగ్నిసంస్కారం చేయించాడు, మారుతి పెద్దల సలహామీద.

అంతే!

ఆనాటినుంచీ- ఆ మేడకు మంచిరోజు లొచ్చాయి...

శకుంతలకుమాత్రం విశ్వనాథం లేనిలోటు, మరొకనితో వివాహమైనా ఆలోటు లోటుగానేవుంది-

మారుతి ఏంచేయగలడు? పాపం!!

విశ్వనాథం పేరు జ్ఞాపకానికొచ్చినపుడల్లా మారుతికి ఏంచేయబుద్ధీ అయ్యేదికాదు...

ఇన్ని కన్నీళ్ళు కార్చి, సానుభూతిగా శూన్యంలోకి చూసేవాడు... శకుంతలమాత్రం ఏంచేస్తుది? ఆమెకూడా యిదే చేసేది...

# ప్రామిక

మాఘమాసంలో వీచే రివ్వగాలికి తెరుచుకునే, తలు పుల్లాగా ఆ అర్థరాత్రి పూట కరుణానిధిచేత, తోలగ త్రోయ బడిన గది తలుపులు మెల్లగా చిట్లినయి.

బృందావని– ప్రశాంతగా నిద్రిస్తోంది నిశ్చలనీరధివలె– బాగా అతనికి తెలుసు.

ఆ వేళప్పుడు– నిశ్చింతగా– తీగెమీద విచ్చుకున్న– మల్లెపూవులాగా నిద్రిస్తోంటుందని ఆమె.

ఎక్కడో ఏటవాలుగా జారిపడ్తో– జాలిగా– ఆకాశంలో చిన్నగా మిణుకు మిణుకుమంటో వుండే అరుంధతిలా– ఒక చిన్నదీపం ఆ గదిలో– అస్పష్టమైన అక్షరాల్లాంటి కాంతి రేఖల్ని వెదజల్లాతోంది.

అతనికి; బృందావనిమీద జాలి ఒక్కటేగాదు; అపార మైనదయ యేర్పడింది. గత, జీర్ణ శిధిల చరిత్రను గిజిగాడి గూడులాంటి గుండెలో యే కల్లోలమూ, ఆందోళనా, వ్యాకులతా, లేకుండా నిద్రపోవటంగా చేసుకోవడం సర్వసామాన్యంగా ప్రతిమనిషికీ యెంతో కష్టం... అలాంటిది– బృందా

వని యెలా చేసుకోగల్గింది?

అదే!

ఒక్కోసారి కరుణానిధికే పుట్టెడు ఆశ్చర్యం కలిగిస్తుంది. కేవలం అంతేగాదు. అర్థంకూడా గాకుండా ఉంటుంది. అతను ఆలోచనలలో సుడులు తిరుగుతున్నాడు.

బృందావని వెల్లికిలా పరున్నదల్లా ప్రక్కకి తిరిగింది.

అతను రవ్వంత చలించాడు.

ఆమె అతని చలింపుకు మేల్కాంచేటట్లుగా లేదు.

కరుణానిధి వెళ్లి—వాకిట్లో అరుగుమీద కూర్చున్నాడు.

రివ్వగాలి వీస్తోంది.

బృందావని నిద్రలేచేటంతవరకూ— తనేం చేయాలో కరుణానిధికి అర్థంకాని సమస్యగా తోచింది.

ఏకాంతవాతావరణం— అర్ధరాత్రి— సమకూరినప్పుడు; తన జీవిత చరిత్రను గురించి, సింహావలోకనం చేసుకోవడం పరిపాటి ప్రతి మనిషికీ. ఇంతో అంతో, చరిత్రహీనుడైతే— జీర్ణగతుడైతే అతని ఆలోచనలన్నీ ఒక ఆవేదనా పూరితమైన భావాల్లోంచి మునిగి తేలుతో— మహోన్నత గ్రంథమవుతుంది.

లేదా చెత్తకూడా కావచ్చు.

అది వాళ్ళ— వాళ్ళ జీవితానుభవాలనుబట్టి రూపించబడి వుంటుంది. ముఖ్యంగా సంస్కారరీత్యా కూడా వుంటుంది. అందువల్ల యితా తెలుసుండబట్టే తననిగూర్చి, ఆలోచన చేయడం మానివేసి; బృందావనిని కూడతీసికొంటూ ఆలోచన చేయసాగాడు.

* * *

ఎక్కడెక్కడో కురిసే శ్రావణమాసపు విపరీతవర్షాలకు శైశవాస్థనూ. యవ్వనశక్తినీ. ప్రౌఢతనూ, తమలో మిళితం చేసుకుంటో పారే— నదీ నదాల్లో కొట్టుకువచ్చే మంచి గంధపు కొమ్మలాగా కాలంచేత తరుమబడిన బృందావని, ఆ వూరికి చేరింది—ఒకానొకప్పుడు...

అంటే—

ఆమె చరిత్రను, పరిశీలిస్తే నిండా అయిదు సంవత్సరాల క్రిందటి— మాట...

ఒకప్పు డామెబ్రతుకు పండుగలా— ముఖ్యంగా సంక్రాంతి పండుగలా వుండేది. పైగా; పెళ్ళయిన క్రొత్తరోజులవి. తరువాత— బీటలువారింది; మంచి రోజులు పోగుచేసిన సుఖజీవితమంతా—

కాపురం అప్పట్లో చేస్తోండగా—

బృందావని భర్త మానవత్వాన్ని నమ్ముకున్నప్పటికీ— రాక్షసత్వం కన్పిస్తోండేది.

అప్పట్లో— ఆమె వోర్పు వహించి— ఓసారి అడిగింది భర్తను; పడకగదిలో; ఓ చక్కెర కేళీ త్రుంచి పెట్టాక; రెండు తమలపాకు చిలకలు చుట్టేస్తో...

"నే నంటే మీ కింత అసహ్యం దేనికీ? దగ్గరకే రాని వ్వరూ? నేనేం తప్పుచేశా? మీకు వ్యతిరేకంగా, మీ మాట కాదని, నే నెప్పుడు ప్రవర్తించా?"— అంటో...

అంతే—

అగ్నిసాక్షిగా పెళ్ళాడిన ఆమెభర్త కాస్తా; కస్సుమన్నాడు. ఆడది అలుసిస్తే— అందులో భార్య, మగవాడు—

ముఖ్యంగా భర్త—చెట్టెక్కి చిందులు త్రొక్కుతాడు.

నైజమే యిది— చెపితే పోయేదికాదు.

అధికారమే అంత— మంచిమాటలు బుర్రకెక్కవు.

అంతపనీ బృందావనిపట్ల జరిగిందా నాటిరాత్రి...

పైగా; అన్నాడు, పశువులా ప్రవర్తిస్తో.

"నువ్వే నా జీవితంలో చిచ్చుపెట్టావు... నన్నో త్రాగుబోతుగా మార్చింది నువ్వు— నా గుండె యింత రాయి కావటానికి కారణం నువ్వు—నీ ముఖంలో అందం లేక పోవడమే నా కేర్పడిన అసహ్యానికి ప్రబలకారణం. నా ఒడికితగినంత వయస్సూ, నా గుండెకు సరిపడే వలపూ, నా కౌగిలికి అమరేటంత యవ్వనమాదకత్వం నీదగ్గర లేకుండా పోవటంవల్ల నాతో ఖులాసాగా కాలక్షేపం చెయ్యటానికి ఒప్పుకోకపోవటమే, వచ్చింది. నీతో గట్టిచిక్కు. నువ్వు నేనంటే లక్ష్యంగా చూట్టంలేదు; ప్రేమించటంలేదు; నన్నో భర్తగా యెంచటంలేదు; అయినప్పుడు నువ్వు నాకెందుకూ? నీతో నాకేం పనీ? కాబట్టి నువ్వు నా భార్యవేకావు...

బృందావని, భర్తమాటలకు చిత్రవధ గావించబడుతూ; మంచంకోడుకు తల కొట్టుకు యేడవసాగింది..."నన్ను అపార్థం చేసుకోకండీ''—అని

అతను, తన వాగ్ధోరణిని క్షణంసేపు ఆపినట్లే ఆపి; మళ్లీ ప్రారంభించాడు.

"నీ అందం— యవ్వనం— సొంపు వొంపులు— వయ్యారాలూ— వలపులూ— సోయగాలూ— యీ బాపతుబజారు ఆకర్షణంతా ఎవరికోసమో అర్రులు చాస్తో— వున్నాయి.నా

కోసం కాదు. నువ్వు నాదానివి కాదు. నేడో— రేపో—నిన్ను ఇంట్లోంచి, అంతేగాదు, నా హృదయంలోంచి, మొదలంటా —పెకలిస్తో— అవతలికి— వూహా కందకుండా- విసిరి పారె య్యాలనుకుంటున్నాను.

మనసిచ్చి, మధురజీవితాన్ని అందించలేని— మగువ- —భార్యగా; వుంటో- ఒక, నరకకూపాన్ని యేర్పాటుచే యటం, నావంటి భర్త, మొగవాడెవ్వడూ చూస్తో సహించ లేడు.

వెళ్ళు... ఊ... వెళ్ళు...పో...

నీ ఇష్టమైన చోటుకు వెళ్ళు...

స్వేచ్ఛగా, యవ్వనాన్నీ, వయస్సునీ గుండెనీ, జీవి తాన్నీ- పురివిప్పుకొని— సంచరించు.... అన్నిటా వున్నాన నుకుని తిరుగు...

లెక్కలేకుండా బ్రతుకు... కావాల్సిన రకరకాల సుఖాల్ని పొందు— రేగి. జ్వలించే కోర్కెల్ని తీర్చుకో! అను భవాల్ని స్వీకరించు... బ్రతుకుని అభిరుచులతో పుష్పింప చేసుకో!

అథఃపతనురాలివి కా!

అలా జరిగితే— అలా జరిగిననాడు— నిజంగా నువ్వంటే, నాకు, అప్పుడు మిక్కుటమైన సంతోషం కలుగు తుంది.

అంతవరకూ నీ మీద నాకు— ఏమిటో తెలుసా!

—బృందావని దగ్గరగా వెళ్ళి, ఆమె భర్త, జుత్తుపుచ్చు కొని పైకి లేవదీస్తూ, మొగాన్ని కోపంతో, తన వైపుకి తిప్పు

కుంటూ—

"అంతవరకూ నీమీద నాకు— ఏమిటో తెలుసా?"— అన్నాడు— నిప్పులు రాలుస్తో.

బృందావని తెలీదన్నట్లు కళ్ళతో— నీళ్లు నిండిన కళ్ళతో సమాధానమిచ్చింది బేలగా.

—కసి,

—పగ,

—ద్వేషం,

—అసహ్యం,

—రోత,

—చెడ్డగవులుకంపు— సర్వం; నీవల్ల నాలో కుళ్లుతో వుంటూంటాయి...

వెళ్లు—యీరాత్రే—పో! యీ చీకటే నీకు దిక్కు— వెళ్ళిపో—" ఒక్కతోపు తోశాడు. అగ్నిసాక్షిగా వివాహమాడి నట్టిభర్త— భార్యను నిలబెట్టి మాటలతో మానాభిమానాల్ని —తుప్పుదులిపినట్లు దులుపుతూ— ఒల్చివేస్తోంటే— భార్యగా— బృందావనిలాంటి, స్త్రీ యే స్థితిలోకివచ్చి, ఒక నిశ్చయాన్ని— దృఢంగా యేర్పరచుకోవాలి?

బృందావని వెళ్లిపోవటానికే అప్పటికప్పుడు నిశ్చయించుకుంది— ఎక్కడికి?

హఠాత్తుగా యిలాంటి పరిణామం యేర్పడితే—బృందావనికే కాదు. అందరికీ కూడా ఆలోచన సాగదు. అయోమయావస్థ అలుముకొంటుంది.

బృందావనికేర్పడిందప్పుడు— అదే...

అయినా, ఆమె తన నిర్ణయానికి మార్పూ- చేర్పూ- కలిగించలేదు.

క్షణంలో చీకటిని చీలికలు చేసుకో సంకల్పించి; మరు క్షణంలో కట్టుగుడ్డల్తో- గుమ్మం దాటింది. క్రమంగా వీధిగేటు దాటినపిదప- వీధులూ మలుపులూ- వూరి వెలుపల చెరువు గట్టూ- యిళ్ళ తోపూ- చింతలడొంకా- మునసబుగారి మామిడి తోటగుండా పోయే కాలిబాటా- అన్నీ- ఆమెను దాటుకుపోసాగినయి.

—అర్థరాత్రి దాటుతోంది.

—ఒక వూరు- చేరుకుంది. రెండుమైళ్లు నడిచి-నడిచి...

అప్పటికి, తూర్పున తెల్ల రేకులు పల్లవిస్తున్నాయి...

యెక్కడో వూరివెలుపల చెట్లమీద- కొమ్మకొమ్మకో సన్నాయి బట్టినట్లు మత్తకోకిలలు కూస్తోన్నాయి—...

పైరుగాలి ఆహ్లాదంగా తోల్తోంది.

కరుణానిధికి, ఒక్కసారి ఆమె జాలిజీవితగాథను గుర్తు చేసుకునే సరికి- హృదయం- చెమ్మగిలింది.

మొట్టమొదట- కట్టుబట్టలతో గాలివానకు దెబ్బతిన్న లతలా- దిక్కుతోచకుండా- ఎటకోపోయే- కర్ణశిలా- ఒంటిగావచ్చి, వచ్చి- తను, చదువుచెప్పే- వూరివెలుపల పాఠశాల వరండాలో- చెరిగి పోయిన కంచెమీద ఆరేసిన గళ్ళచీరెలా- పిచ్చిగా- గోడవైపుకు పడుకుని వుంటం"—

ఆ దృశ్యం కళ్ళముందు కొచ్చింది; బృందావని- ఆలోచనల్తో తీవ్రస్థితికొస్తుంటే- అప్పుడు మెల్లిగా- తనులేచాడు...

బృందావని, లేచింది.

అడిగి; ఆమెజీవితాన్ని తెలుసుకున్నాడు.

లేచిన, బృందావని, మెల్లిగా- కుచ్చెళ్లు సర్దుకుంటో- బయటికొచ్చి చూసింది,—

కరుణానిధి

తెల్ల బోయింది...

"ఏమిటీరావటం ?"

"ఆఖరుసారిగా, చూసివెడదామని వచ్చాను."

"నన్నేనా?"

"అవును... నిన్నే!—"

"చాలా క్రొత్తగామాట్లాడుతున్నారు,"

"లేదు. మామూలుగానే—"

"కాదు. యెన్నడూ యెరుగని తీరుగావుంది."

"తమతమ తప్పు లెవరైనా యెరిగి- యెరుకపరిస్తే— వినటానికి క్రొత్తగానే వుంటాయి."

"అంత తప్పు నేనేం చేశానని?"

"రోజులు గడిచేకొద్ది నీకే తెలుస్తుంది."

"పోనీ— మీకేం తెలుసో చెప్పరాదా?"

"నానోటిగుండా— చెప్పటం యిష్టంలేదు."

"మీరే యిలాఅంటే- మరొక రేమనుకుంటేమాత్రం లెక్కేమిటీ?"

"నిన్నుగురించి, నే- నేమనుకుంటున్నా- అది నన్నే బాధించి వేయాలిగానీ, నీకు చెప్పి కుళ్ళి కుళ్ళి యేడ్చేలా యేడ్పించను. నా అభిమతం అదికాదుకూడా!"

"ఇంకేమిటీ!"

"మర్యాదగా బ్రతకమని."

"ఇంతవరకూ అమర్యాదగానే బ్రతుకుతున్నా నన్న మాట. అంతేగా మీరనేది యిప్పుడు."

"అని– నీకు తెలీకపోవచ్చు కానీ లోకానికి తెలుసు."

"నన్ను— మీరు— అపార్థం చేసుకోవడం లేదు గదా!"

"ఇంతవరకూ– అలాంటిదేమీ లేదు.—"

"అదేవుంది—"

"లేదు—"

"మీరు తెలీనివి— ముఖంద్వారా– యెదుటివారికి తెలియవచ్చు. అప్పుడేమిటీచేసేదీ?"

"ఊఁ! కొట్టిపూరకోవడమే!"

"ఇప్పుడు మీరిలా చేయగలరా?"

"చేయలేకపోబట్టే చెప్పి వెడదామని వచ్చాను, చెప్పాను."

"మీరు నాకీవూళ్లో– తొలిగా దిక్కులేనిదాన్నిగా వచ్చినప్పుడు– పల్కరించి. అనునయపర్చి– ఆదరించి ఆశ్రయం యిచ్చినవారు. నాకష్టాల్ని విని; కన్నీరుకార్చారు. ఎంతో కరుణతో; దయతో– జాలితో– చూశారు. నాతోబాటు, యీ యింట్లోవుండి, ఒక, జీవనోపాధి అంటూ ఏర్పడిన తరువాత, 'వేరేవుందువు' గాని. అని చెప్పి; మీసంపాదనమీదే నన్ను పోషిస్తోబతికేలాగునచేశారు—"

కరుణానిధి, ఆకాశంవంక చూస్తో; పరిసరాలవంక దృష్టిని మరల్చుతోండిపోయాడు; బృందావని మాట్లాడుతోంటే– ఆలా

-నివురుచెరిగిన నిప్పులా...

"సామాన్య మానవుడికంటే, యెంతో నిగ్రహం మీలో వుంది. మీ చూపులో- మాటలో— ప్రవర్తనలో- సర్వత్రానూ- కరుణామయమే వుంది...

నాకు తెలుసు- మీహృదయం యెలాంటిదో!- "నిండు దానంబు నవ్యనవనీత సమానము. పల్కు దారుణాఖండల శస్త్ర తుల్యము-" యీ ఆరోక్తి- మీ పట్లసత్యం...

మీరిలా- యీనాడు; నాగురించి ఒక నిశ్చయానికి వచ్చారంటే, నమ్మలేకుండా వున్నాను... నాజీవితంలో నాకు తెలీనిమార్పు యేర్పడినమాట వాస్తవమే! దాన్ని దాచలేను; అది; నాతరంకాదు."

—బృందావని, యిలా- మాట్లాడుతూంటే, కరుణానిధి, కేవలం వింటోవుండసాగాడు, నిజంగా బృందావని మాటల్లో యథార్థంవుంది. ఆమె యీనాడు పదిమంది ఆడపిల్లలకు అల్లికపని; కుట్టుపని; చిత్రలేఖనం నేర్పుతూ- పొట్టబోసుకుంటోంది అంటే; దానికితగిన హంగుల్ని యేర్పరచింది కరుణానిధే! ఇంతో- అంతో గడించి, భర్త వెళ్లగొడితే; వదలివచ్చేసినా- పదిమందిలో; వాళ్ల దృష్టిలో—చులకనగా బ్రతకకుండా—జీవితాన్ని గడపుతోంది.— ఇలా కాలం వెళ్లమారటం; నేటి నాగరకతా ప్రపంచంలో చాలా చిత్రం, కష్టంకూడానూ!..."

అసలు భర్తను విడనాడిన భార్యకుఈ లోకం మంచిగా బ్రతకటానికి అవకాశమూ, అర్హతనూ యివ్వదు. జారుడు మెట్ల జీవితంలోకో; చీకటిమెట్ల బ్రతుకులోకో దిగజారేలాగు

చేయటమే— దాని లక్ష్యం; అలాంటిదేమీ ఆమె బ్రతుకులో తటస్థపడకపోవటం బృందావని అదృష్టం...

కరుణానిధి మాటంటే యెంతో లక్ష్యముంది బృందావనికి. అతని మాటకు అభ్యంతరం చెప్పడంగానీ; జవదాటడంగానీ; చేయని జవరాలు ఆమె. తల్చుకున్నప్పుడల్లా అతనో దైవసమానుడని ఆమెకు నమ్మకం. అయితే— ఇంకో చిక్కు, ఆమె మనస్సుని ఒక్కోసారి వేధిస్తోంటుంది; ఆపేక్షతో కాటు వేస్తో...—

"కరుణానిధిలాగా, తనభర్త వుంటే, తనజీవితం యెంత రమ్యంగా, హాయిగా, సుఖంగా– బావుండేది–" అని.—

ఈ అభిప్రాయం, కరుణానిధి పట్ల, బృందావని ఏర్పరచుకున్నదంటే, తప్పులేదు. స్త్రీ కోరేది యెప్పుడూ– అనుకూలుడైన పురుషుడితో— జీవితాన్ని గడపటమే!.. ఇంతకన్నా, యే స్త్రీ కూడా విశేషంగా కోరుకోదు. బృందావని ఆపనే చేస్తూండేది. ఇంతటి, అమూల్యాలోచనని, బృందావని యెప్పుడూ అతని దృష్టికి తీసుకుపోలేదు.

కారణం, ఒకరకమైన పూజ్యభావం. గౌరవం– భయం –ఒకవేళ చెప్పదలిస్తే– తనఉద్దేశం, తనహృదయాన్ని బాధించటమే కాకుండా అతనికి బాధ కలగజేయటం అవుతుందేమోననీ, తేలికైపోతానేమో అనే సందేహం వెక్కిరించటం వల్లనూ– చెప్పక, తప్పుకుంటూ వుంటం జరుగుతోంది. ఈ సంగతిని యేనాడూ కరుణానిధి పసిగట్టలేదు. అతనికి యిలాంటి వూహాలంటే తగనిచిరాకు; అసహ్యమూనూ!

కరుణానిధి గాంభీర్య ప్రకృతే– బృందావనిని ఒక త్రాటి

మీాద నడిపిస్తోంది.

అతని విశాల దృక్పథమే– ఆమెను ఓమనిషిగా– మారుస్తోంది.

అందువల్ల — ఆ సమయంలో మరేం చెప్పలేకపో యింది బృందావని.

అతనూ– పెద్దగా– కల్పించుకోలేదు.—

అయితే– ఆరాత్రి ఆఖరులో– జరిగిన తుది సంభాషణ మాత్రం– ఈ కథ– ముగియడానికి– యిలా మార్గదర్శకమైంది.

గట్టిగా రెండురోజులు గడవక మునుపే– ఓనాడు బృందావని వచ్చి, కరుణానిధిని కలుసుకుని—

"నేను, మళ్ళీ వివాహం చేసుకోవాలని నిశ్చయించుకున్నాను. మీా అభిప్రాయం యేమిటీ?"— అని అడిగింది.

కరుణానిధి ఏమీా మాట్లాడలేదు... వాకిటియెదురుగా పొగడ చెట్టు పూలను రాలుస్తుంటే చూస్తోండిపోయాడు.

"మీాకిష్టంలేదా?"

—బృందావని మళ్ళీ అడిగింది; రెట్టిస్తో.

"ఆలోచిస్తాను..."— అని కూడా అనలేదు అతను. ఊరుకుండి పోయాడు,

ఎవరితో, ఆమె– తన జీవితాన్ని గడుప నిశ్చయించుకుందో అతనికి స్పష్టంగా తెలుసు.

ఆ కాబోయే, భర్త యెలాంటి వాడోకూడా కరుణానిధికి తెలుసు.

క్షణంలో, బృందావని వంక చూస్తో—

"నా కిష్టం లేదు బృందావని!" ఒక్కసారి, కుండపగుల

కొట్టినట్లు చెప్పివేశాడు కరుణానిధి.

"అంటే, నా జీవితం సుఖమయం కావటం— మీ కిష్టం లేదన్నమాట... అంతేనా?"

"అదేమీ కాదు... నీ జీవిత సుఖాన్ని, కాలరాయా లనీ. నాశనం చేయాలని తల్చే కిరాతకుణ్ణి; రాక్షసుణ్ణి; దుర్మా ర్గుణ్ణి కాదు..."

"మరేమిటీ?"

"నువ్వు సుఖపడలేవు... అంతే!"

"కారణం... అతను కూడా కర్కోటకుడా?... మును పటి నాభర్తలా తాగుబోతా?— సౌందర్యమంటే తెలీని వాడా?"

"అవేం కానక్కర్లేదు"— కరుణానిధి స్తబ్దుగా జవా బిచ్చాడు.

—బృందావని, యిక విన్పించుకోలేదు. అతణ్ణి మరేమీ అడగనూలేదు చరాల్ను లేచి, చెప్పకుండా వీధిలోకి బాణం లాదూసుకు పోయింది; బృందావనిలో చలింపు అతనికి చాలా ఆశ్చర్యాన్ని గుచ్చెత్తి పోసింది,

"మనస్సు!...ప్చ్... ఎంత చిలిపిది; మరెంత మూర్ఖ పుది!!"

—బృందావని, కనుచూపుకు మరుగయ్యే వరకూ, కరుణానిధి భావిస్తోండి పోయాడు; అలా నిశ్చలంగా; స్తబ్దుగా; ప్రమాన్పడి చూస్తో—

కరుణానిధి— అయినా— తొందర పడలేదు; ఆమె సంక ల్పాన్ని గానీ; వాంఛితార్థాన్నిగానీ; వారించా ప్రయత్నించ

లేదు. మళ్లీ వెనక్కూ పిలువలేదు. కాని, అలా; ఆమె వెడుతూంటే మాత్రం గుండె చీరుకు పోయింది— ఎందుకో?

గత జీవితం— ఆమెది— గుర్తొచ్చింది. యిలా జరిగిన కొన్నాళ్లకు— కరుణానిధికి తెలీకుండా— హఠాత్ గా— ఒకనాడు మరో పల్లెటూరికి బదిలీ అయింది.

ఒంటరివాడే కాబట్టి— చక్కా వెళ్ళిపోయాడు; ఆలస్యం చేయకుండా.

బృందావని వివాహం కూడా అదే యెద్దడిలో జరిగిపోయింది.

కరుణానిధికి తెలిసింది.

కానీ, జరిగిన చిత్ర మేమిటంటే ఇరువురూ— అటు బదిలీమీద అతనూ; ఇటు క్రొత్త కాపురంమీద భర్తతో బృందావనీ— ఒకే రోజున— ఒకే రైలుకి యెక్కి విడిపోయారు.

మధ్యలో—

కరుణానిధి, బృందావనిని పల్కరించలేదు.

ఆమె అతణ్ణి పల్కరించలేదు.

కాని, తెలుసుకుంది; అతనే వూరు బదిలీమీద వెళ్ళేది.

కాపురానికి వెళ్ళిన, నెల రోజుల్లో— బృందావని యెందుకు తన దగ్గరికి వచ్చిందో— తిరిగి— అకస్మాత్తుగా చూసిన తరువాత— పావుగంటవరకూ— కరుణానిధికి అర్థం కాలేదు.

అతను అడక్కుండానే; బృందావని తలవంచుకుని ఎదురుగా నిలబడి; నేలమీద బొటనవ్రేలితో పిచ్చిగీతలు గీస్తూ—

"నే—

చేతులారా... జీవితాన్ని మళ్ళీ పాడుచేసు కున్నాను. నన్ను క్షమించరూ!"

—కరుణానిధి రెండు పాదాలూ పట్టుకుని, బావురు మంటూ— ఏడ్చింది.

"కారణం?"— అతనా చూపుల ద్వారా ప్రశ్నించాడు; బృందావనిని.

ఆమె కళ్ళు తుడుచుకుంటూ.

"అతని ఆరోగ్యం మంచిది కాదని తెలిసిపోయింది... నేను మూడో భార్యనట... కుళ్ళు మనిషట... ఎట్లా బ్రతకను అతనితో ఇష్టంలేక— చెప్పి పెట్టకుండా నిన్నరాత్రి— అర్థ రాత్రి దాటగానే; యీ చేతి సంచీతో దొడ్డి తలుపులు తెరుచుకుని, పారిపోయి; రైలెక్కి వచ్చేశా!"

చాలాసేపు, బృందావని గోడు విన్నమీదట; కరుణానిధి— "పోన్లే! ప్చ్!"— అన్నాడు. అంతకంటే అతనేమీ అనలేక పోయాడు; ఆమె దురదృష్టానికి సానుభూతి కనబరుస్తో; ఆ తరుణంలో...

"నన్ను క్షమించాననరూ!"

—బృందావని, యేడ్పులో— మెల్లిగా— ప్రాధేయ పూర్వకంగా— అడిగింది.

కరుణానిధి. జీవన వేదాంతిలా నవ్వి వూరుకున్నాడు—...

ప్రొద్దువాటారుతూంటే; కరుణానిధి మెల్లిగాలేచి; ఇంట్లోకి వెళ్ళి సంజెదీపం వెలిగించాడు. అతనితోబాటు బృందావనికూడా లేచివెళ్ళి, అతనివెనుకనే నిల్చి; సంజెదీపపు వెలుగుని చూస్తోండిపోయింది, అతను దీపం వెలిగించాక!

వెనక్కి తిరిగి బృందావనిని అదో విధంగా చూశాడు; నవ్వుతో—...

బృందావనికి, అతని చూపుగానీ; ఆనవ్వుగానీ అర్థంకా లేదు.

ఆ దీపకాంతిలో- అతని ప్రశాంతమయ దృక్కుల్లో బృందావని తరించినట్లు-అతని నీడ ఆమెమీద కప్పివేస్తోన్న ట్లుపడింది రక్షణగా.

తన, నీడ- బృందావనిమీద పడటంతో! ఒక్కనిట్టూ ర్పువిడిచి; ఆమెముఖాన్ని సాపేక్షతో తిలకించి; తలపంకిస్తో వాకిట్లోకి వచ్చేశాడు నిశ్శబ్ధంగా కరుణానిధి.

బృందావనికి, అప్పుడేమీ కరుణానిధి హృదయం అవ గాహన కాలేదు.

నిర్లిప్తంగా, మండిగానికి దగ్గర్లోనిల్చొని; సంజెదీప కాంతిలో వాటిముందు విచ్చుకునే తెల్ల చంద్రకాంతాల్ని చూస్తోండిపోయింది.

ఆరాత్రంతా; బృందావని; కరుణానిధి మనస్తత్వాన్ని గూర్చే ఆలోచనచేయ సాగింది.

"కరుణానిధి; తన జీవితానికి చల్లని నీడలాంటి వాడను కుంది... అతని పరిరక్షణలో- చితికిపోయిన తన బ్రతుకు తిరిగి పునరుజ్జీవించ కలదని భావించుకుంది. అతని మనస్సు మమ తతో; ఆదరణతో; ఆపేక్షతో; తొణకని అనురాగంతో; తొలగని కరుణతో నిండిన గాదె అనుకుంది. తన మనస్సు యెంత చపలత్వాన్ని అనుసరించి; ప్రవర్తించినా; అతను సహించి వూరుకోవడంతో అతన్ని ఆమె ఓ మహా వ్యక్తిగా

ఎంచుకొంది— అతని నీడ— రక్షణగా; తన మీద పడినట్లే; అతనుకూడా తన హృదయానికి దక్కితే— శాశ్వతంగా యెంత బాగుంటును"— అని నిరాశతో తపన చెందింది— బృందావని.

# పరుజాధార

ఒకప్పుడు 'జీవితం' అంటే చాలా ముచ్చటగా— పూవుని చూచినంత మురుపుగా— ముద్దుగా వుండేది గంగ రాజుకి... స్త్రీకంటే కూడా...

నేడో— చాలా నీరసాన్నీ విసుగునీ అసహ్యాన్నీ నిరాశనూ జనింప చేస్తోంది—

దీనికి ప్రధాన కారణం ఏమిటీ అని అతను— కాదు, నేను కూడా తీవ్రంగా ఆలోచించలేదు.... మొన్న మొన్నటి వరకూను...

ఒక్కోసారి, తన్ను గురించి యే మానవుడూ, యెదుటివాడు వూహించినంతగా కూడా— ఆలోచించడు. ఒక్క ఎదురుదెబ్బ— అనుకోని సంఘటనలో తగిలితే... అప్పుడు స్ఫురణ కొస్తుంది. "నేనేమిటీ?" అని, అంతవరకూ, బ్రతుకంతా— దుక్కి టెద్దు సేవలాగే వుంటూ వుంటుంది. లేదా, రెచ్చి పోతూ వుంటుంది.

గంగరాజు— తన వూళ్లో, పూర్వులు కట్టించిన ఓ మండువా యింట్లో— కళ్లు కనిపించని తండ్రి కెదురుగా—

చావేసుకున్నారొచ్చాని, కరిణీకం లెక్కలు తయారు చేస్తూండటం, లోలోన— "వెధవ జీవితం, పాడుబ్రతుకు" అనే మాటల్ని పునశ్చరణ చేసుకోవటం మినహా, మరో ఘన కార్యమంటూ చేయలేని స్థితిలో— కాలాన్ని వెళ్లబుచ్చుతున్నాడు.

గంగరాజు కడకు, కన్నీళ్లు తుడుచుకొంటూ, కరిణీకానికి బ్రతుకంతా ధారవోస్తాడని, వూహించటంలో— చాలా ఆశ్చర్యం పొదగబడి వుంది.

వాడూ నేనూ 'ఓ...నా...మా'లు దగ్గర్నుంచీ— ఓ యింటివాణ్ణి— కావాలనుకోవటం— అనే సిర నిశ్చయం యిద్దరిలో పొటమరించేంత వరకూ— మిత్రులం... చిన్న తనాల్లోనే మా మనస్సుల్ని యేదో అనిర్వచనీయమైన ఆత్మీయతకు— అంకితం చేసుకున్న వాళ్లం... నేడూ అంతే.

చుక్క తెగి నేలపడ్డట్టుగా— యెప్పుడో హఠాత్తుగా— వాకిటిలోకి వచ్చాడంటే వచ్చాడన్నట్టుగా, ఓ నిర్జీవ శిలా ప్రతిమలాగా వస్తాడు..... నేను, తనకన్నా, వింతగా, ఆశ్చర్యంగా వున్నానేమో, నాగరికతంతా నా మీద అలుముకున్నదేమో అన్నట్టుగా— పరిశీలించి చూస్తాడు.

వాడిగా— అతను అలా చూస్తున్నాడని, నేను యేమాత్రం లోతుగా ఆలోచించినా చాలు... నా గుండె చీరుకుపోవటం మాట అలావుంచి, వాలుగా నా వంక చూడనైనా చూడడు.

"నేను వచ్చి నిన్ను చాలా కష్టపెట్టా కాదూ!"

"లేదురా! ఎంతో సంతోషిస్తున్నా"

"నిన్నెందుకు ఇలా చూసానో తెలుసా?"

"ఊహుఁ... తెలీదు..."

"నీ కళ్లలో, చిన్నప్పటి, నీ— నా స్నేహాన్ని తలపుకు తెచ్చుకొని, తృప్తిపడటానికి..."

"అదేమిటిరా!"

"అంతే... నీకు తెలీని కొన్నివిషయాలు, నీలో వున్నాయి. అవి, నా కళ్ళకి స్పష్టపడు తున్నాయి..."

"మరి... నీ..."

"నా కళ్ళలోనా?... ఏ నాడో నువ్వు గుర్తించుకున్న వన్నీ— యింకిపోయినై. అందుకే అద్దాన్ని చూడటంకూడా మానుకున్నాను.

-ఇలా... సాగుతుంది మా యింటికొచ్చి నప్పుడల్లా సంభాషణ—

ఆశ్చర్యం వేస్తుంది...

"నీలో ఎంత మార్పు వచ్చిందిరా గంగా!"

"మార్పా!"— తనలో— పేలవంగా నవ్వుకుంటాడు...

"ఎందుకొచ్చిందిరా?"

"నన్ను నేను తేలిక పర్చుకున్నా కాబట్టి"

"ఏ విషయంలో?"

"బ్రతకటం— సుఖపడటం— ఇలాంటి విషయాల్లో"

కొంచెం బోధపడింది- ఒకరకమైన వ్యక్తిత్వం- తెలీకుండా- లోకం యేనాడైతే- గంగరాజులాంటి వాళ్ళకి అంటకడుతుందో, అనాటినుంచి- జీవితం అనేదానికి అన్ని కోణాల్లోంచీ, విపరీతార్థాలతో- వినూత్న ప్రశ్నలతో, వేధించి

మథించి, వుక్కిరి బిక్కిరి చేస్తుంది.

గంగావతరణంలా– పెళ్ళి విషయం, తన దగ్గర కొచ్చే సరికి, శివుడిలా దాన్ని ధరించలేక, గంగరాజు– విముఖత్వం ప్రదర్శించాడు.–

"పెళ్ళి చేసుకోవా?"

"చేసుకోను"

"కారణం.."

"నాకు నేనే బ్రతకటం చేతకావటం లేదు... ఇంకా పై పెచ్చు, పెళ్ళికూడా దేనికి?"

"ఇంటికి పెద్దవాడివి... నువ్వు మానుకుంటే, మిగతా వాళ్ళ గతేంకాను..."

"వాళ్ళకు జీవించటం తెలుసు... లోకం పోకడ తెలుసు... వాళ్ళేనాటి కైన,నీకేకాదు. యీసంసారానికేపని కొస్తారు... నన్ను మాత్రం నమ్మకోకు... ప్రయోజనం లేదు.

–తండ్రి కెదురుగా నిలబడి, గంగరాజు ఓ నాటి కట్లా అంటాడని, నేనెన్నడూ వూహించలేదు—

గంగరాజులో యింత తెగువ ఏలా కలిగింది... అబ్బ...";

ఒకప్పుడు తండ్రి అంటే గంగరాజుకి– భయంలేదు గానీ– భక్తివుండేది. తనని గారాబంతో అసమర్థుడుగా చేస్తు న్నాడని... గుండెల్లో గుబ్బటిల్లే తపన మరుగుతూండేది... తన యువకత్వమంతా కరిణీకపు లెక్కలకే అంకిత మవు తూంధని, తండ్రిమీద వుక్కురోషం...

"నీ మూలంగా, నేను చెడిపోతున్నాను నాన్నా!..."

చేతికొచ్చిన గంగరాజులాంటి కొడుకు యిలా అనేస రికి, యే తండ్రి సహించి వూరుకుంటాడు... దిగ్భ్రమ చెందాడు—

"ఏమిట్రా నువ్వనేది? నువ్వు నావల్ల చెడిపోతున్నావా"

"అవును!.. చెడుతున్నాను..."

"నిన్ను పెంచిపెద్దచేసింది చెడిపోయేలాగు చేయటానికి కాదు... బ్రతికిలాగుపడి బట్టకడతావని..."

"నీ మనస్సులో ఆభావముండొచ్చు గానీ, నీ పెంప కంలో అదేం కనిపించడంలేదు!"

"ఆఁ... ఎంతమాటన్నావురా!"

"ఎంతో మాట కాదు, అక్షరాలా వున్నమాట, యదార్థం..."

"నా కడుపున చెడబుట్టావురా..."

"అందుకే కాబోలు చెడిపోతున్నా...... ఇక దీన్ని గురించి విచారించ వలసిన పనిలేదు..."

గంగరాజు ఎడా— పెడా మాటలిలా అనేసి, యెటో పోయాడు... అతని తండ్రి కృద్ధ మనస్కుడై కుక్కి— మంచంలో దిగబడిపోయాడు... ఎదురు తిరిగిన వాత్సల్యంతో—

తీరా, ఆరాగా ఆలోచిస్తే, గంగరాజు, తండ్రి కెదురు మెందుకు తిరగాల్సొచ్చిందో అర్థమైంది... ఒకసారి, గంగ రాజు చెప్పాడు... సమాధిచేలో వేరు సెనక్కాయల్ని తంప తేసుకుని తింటున్నప్పుడు తనని గురించి...

"నన్ను ఇంట్లో వాళ్లంతా చాలాహీనంగా చూస్తు

న్నారు, కారణం? నేనువాళ్లు చెప్పిన ప్రతి పనినీ ఎదురు చెప్ప కుండా చేయగల్గుతూన్నాను."

గంగరాజుని, అంతహీనంగా చూసే 'వాళ్ళు' ఎవరో నాకు తెలీక అడిగా—

"నా సవతి తల్లి, ఆవిడికి పుట్టిన పిల్లలు, అంటే, లోకం దృష్టిలో నా తమ్ముళ్లు, చెల్లెళ్లూ..."

"నువ్వు అందరికీ అన్నవు గదా! ఆ మాత్రం పెద్దరికం లేదా నీకు వాళ్ళదృష్టిలో! ఇంతనీచంగా చూస్తారా? చాలా వింతగా వుంది!"

"నువ్వు అనుభవించలేదు కాబట్టి, నా లాంటివాడి బ్రతుకుని తెలుసుకుంటుంటే నమ్మశక్యం కాకుండా వుంటుంది. కాదనను. ఇంటికి, తండ్రి తరువాత పెద్దవాణ్ణే! లెక్కకు కానీ. యింట్లో నాకేమి అంతస్థు లేదు—

"మిగతా పిల్లలు మాట్లాడినంత గడుగ్గాయ తనంగా, ఆకతాయివేషాల్తో నేను ఏ పని చేసినా, వాళ్ళ విమర్శకు గురి కావాల్సిందే. కన్నెత్తి చూచినా, అది నావల్లనే దిష్టి తగిలి పాడైపోతుందని మాటల విసుర్లు... నలుగురితో నేను అన్నానికి వెళ్లేప్రాప్తిలేదు. అందరూ తిని మూతులు తుడుచు కున్న తరువాత, నాకు వంటింట్లోకి ప్రవేశమున్నదన్నమాట. గొడ్డుచాకిరీ మాత్రం అస్తమానమూ చెయ్యకతప్పదు. అట్లా చేస్తేనే, మాపటి వేళకు మింగ మెతుకు దొరికేది! కరణీకం లెక్కల దగ్గరనుంచీ కట్టుగొయ్యకు కట్టేసిన లేగదూడ మేత వరకూ నాదే పూచీ, ఇలా చాలావుంది పురాణం, నిన్ను విసి గించ దల్చలేదు."

చెబుతూ— చెబుతూ, తన విషయాన్ని త్రుంచిపారే శాడు.

ఇది ఒక రకమైన మనస్తత్వం. తను, హృదయాంతర్గతంగా యెంత అలజడి పడుతున్నదీ, ఆప్తుడైన వాడు ఎదటపడితే; గబగబా నుంచోబెట్టి చెప్పుకుందామని వుపక్రమిస్తాడు. తీరా కొంతవరకు వచ్చేసరికి, ఎదుటి వ్యక్తి, తన గాధనెలా వింటున్నదీ గ్రహించీ, తన విసుగుపుట్టిస్తున్నా నేమోఅని భావించి, భావన సరైనదయితే ,పుటిక్కున ఆపేస్తాడు; గంగరాజులాటి వ్యక్తి.

అలాంటిదె, జరిగింది—

"ఆపేశావేం."

"నువ్వుచాలావిసుక్కుంటున్నావ్!"

"లేదు. వింటున్నా."

"బలవంతంమీద వినగల్గుతున్నావ్. అంతేగానీ, మనస్ఫూర్తిగా— నా తృప్తికోసం కాదు."

"ఎంత మాటన్నావురా!"

"అన్నమాట యదార్థం"

గంగరాజు అన్నది సబబే! నిజంగా అతని స్వంత విషయాన్ని చాలా చిరాకుగానే వింటున్నా— కారణం చాలా పాతగా వుండటం వల్ల, ఏ సంసారంలో యిలాంటి కలతలూ మనస్పర్థలూ కలహాలు లేవూ? అన్ని సంసారాలూ అనుకున్నంత అంతస్థుల్లో వుండవు. వుండలేవు. సమిష్ఠి కుటుంబమన్న తరువాత, అందులో పైగా పెద్ద కుటుంబం అనిపించుకున్న ఇంటిలో జ్యేష్ఠుడైన తర్వాత, ఏ ధొచ్చినా ఓట్టు

కోవాలి. ఓర్పు వహించి, కుటుంబ క్షేమంకోరి, అన్నీ చక్క-బెట్టుకొంటూ వుండాలి.

పదిమంది గల కుటుంబమైన తరువాత యెన్నో గాలి వానలు, తుపానులూ రాక మానవు. తట్టుకోవాలి. తండ్రి అంతటి వాళ్ళ మనిపించుకోవాలి. ఆ నాడే ఆ కుటుంబంలో పెద్దకొడుకు విశిష్టత పేర్కొన బడేది.

తను పెళ్ళి చేసుకుంటే, తననే కాకుండా, తనను నమ్ముకున్న భార్యను కూడా నా నా కష్టాలపాలు చేస్తారేమో ననే భయంతో గంగరాజు కడకు పెళ్లి చేసుకోవటం మానుకున్నాడు.

ఇదేమీ నాకు నచ్చలేదు. "నీవాళ్ళను చూసి, నువ్వు, నీ సుఖానికి దూరమై పోవటం చాలా సిగ్గుమాలిన పని. నీ ఓర్పే నిన్నొక అంతస్థుగల వాణ్ణిగా తీర్చి దిద్దుతుంది. నిన్ను హీనపర్చిన వాళ్ళే మర్యాద యిచ్చి తీరుతారు.

కష్టాలు ఎప్పుడూ శ్రావణ మేఘ వరుణధారలు కావు. వాటిల్లో కూడా సుఖమూ, సుందరమూ వున్నాయి. ముఖ్యంగా చెరగని అనుభూతి కలుగుతుంది. నీకు నువ్వుగా తేలికపర్చుకోవటం నేను ఒప్పుకోను. ఆ కారణంగా, తన్ను దాను తన విలువను చంపుకోవటం అంటే, అంతకంటే మరో పెద్ద నేరం, శిక్షా- మానవ జీవితానికి వేరుగా అక్కర్లేదు. నీ లాంటివాడే నిప్పులాగా బ్రతక గల్గుతాడు.

ఏ సహాశై తే నిన్ను కృంగ దీసిందో అదే పునర్జీవింప చేస్తుంది. ఏ హీనత్వమైతే నీ జీవితాన్ని కళంక పర్చిందో అదే వెలుగునిస్తుంది. ఏ వరుణ ధార అయితే నీ జీవితాన్ని తడిపి

వేసిందో అదే, నిన్ను క్షాళిత పర్చి మనిషిని చేస్తుంది.

నీ మహామహీధరాశ్మ సంఘత కర్కశమైన మా
జీవితకు నిన్నే వెన్నెల మెట్లపై నడిపించి వరుణధార క్రమే
అమృత ధారమై నీ వెన్నెల వాడలో పన్నీటి జల్లులుగా ప
తయి.

నా మాటలన్నీ విన్నాడు—

భవిష్యత్ కో చిరునవ్వు విసిరాడు, మింటివంక చూస్తూ, ఓ వేదాంతిలాగ.

